## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

**గమనిక:** భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) సహాయంతో ఇవ్వడం జరిగింది. 

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

**http://ebooks.tirumala.org**

ebooks.tirumala.org

తిరుమల తిరుపతి దేవస్థానములు
Tirumala Tirupati Devasthanams
ePublications

Languages | Series | Authors | Archives | Saptagiri | Catalog | Contact US

COMPLAINTS PLS CONTACT e MAIL saptagiritd@gmail.com CAN CALL 0877 226 4359, 4543,4360,4363, 4365 BETWEEN 10.30 AM AND 5 PM (DURING WORKING DAYS)

- TELUGU (1197)
- BANJARA (2)
- ENGLISH (226)
- SANSKRIT (70)
- TAMIL (302)
- KANNADA (175)
- HINDI (181)

Saptagiri
Telugu Tamil Sanskrit Kannada Hindi English
Online Subscription

Panchangam
Telugu Tamil

Sri Bhagavad Ramanuja 'Sahasrabdi' Utsavam
Narada Bhakthi Sutra...

Maha Bharatham - Bhagavatham
Maha Bharatham Vol 1... | Potana Bhagavatam Vo... | Potana Bhagavatam Vo... | Potana Bhagavatam Vo... | Potana Bhagavatam Vo...

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ స్కాందపురాణ సారామృతము

(శ్రీశ్రీశ్రీ కంచి కామకోటి పీఠ జగద్గురువుల శ్రీముఖముతో)



651 Kalyan Murugan J.B KHANNA & Co.,

"జ్యోతిష - కళా- వైద్య ప్రియసుదర్శన"

Dr K N నటరాజన్, B.Sc, B.Ed, M.H.M.S, A.L.M.P,
Regd. Medl. Practitioner : 10748

## శ్రీశ్రీశ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు
## జగద్గురువులు శంకరాచార్యులు



"పరమాచార్య"
శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములవారు

శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతి స్వాములవారు

శ్రీశ్రీశ్రీ విజయేంద్ర సరస్వతి స్వాములవారు

"ఓం హ్రీం సౌః శరవణభవః సౌః హ్రీం ఓం"

# శ్రీ స్కాందపురాణ సారామృతము

కలం

"జ్యోతిష కళా వైద్యప్రియ సుదర్శన"

డా॥ కె.యన్. నటరాజన్, B.Sc., B Ed , M.H.M.S , A L.M.P.
Registered Medical Practitioner No. 10748

బలం

This book is published with the financial assistant of Tirumala Tirupathi Devasthanams, Tirupati under their noble scheme of "Aids to Authors for publishing Religious Books".

వెల: రూ. 50/-



# అంకితం

మాతాకుమారశ్చ పితాకుమారః
భ్రాతాకుమారశ్చ సఖాకుమారః
విద్యాకుమారో ద్రవిణంకుమారః
స్వామికుమార స్సకలమ్కుమారః


సర్వస్వామ్యములు : రచయితవి

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : 1997లో

మూల్యము : 50/-

ప్రతులు వలయువారు :



**Dr. K.N. NATARAJAN,** B.Sc., B.Ed., R.M.P.
18-2-258 A Upstairs,
Abbanna Colony, 2nd Street,
Ashok Nagar, TIRUPATHI - 517501.
Andhra Pradesh, India.



ముద్రణ :

త్యాగరాజ ప్రింటర్స్, గిడ్డంగివీధి, తిరుపతి.

"ఓం హ్రీం సౌః శరవణభవః సౌః హ్రీం ఓం"

# శ్రీ స్కాందపురాణ సారామృతము

కలం

"జ్యోతిష కళా వైద్యప్రియ సుదర్శన"

డా॥ కె.యన్. నటరాజన్, B.Sc., B Ed, M.H.M.S, A L.M.P.,
Registered Medical Practitioner No. 10748

బలం

This book is published with the financial assistant of Tirumala Tirupathi Devasthanams, Tirupati under their noble scheme of "Aids to Authors for publishing Religious Books"

వెల : రూ. 50/



# అంకితం

మాతాకుమారశ్చ పితాకుమారః
భ్రాతాకుమారశ్చ సఖాకుమారః
విద్యాకుమారో ద్రవిణంకుమారః
స్వామికుమార స్సకలంకుమారః


సర్వస్వామ్యములు : రచయితవి

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : 1997లో

మూల్యము : 50/-






ప్రతులు లభించువారు :

**Dr. K.N. NATARAJAN,** B.Sc., B.Ed., R.M.P.
18-2-258 A Upstairs,
Abbanna Colony, 2nd Street,
Ashok Nagar, TIRUPATHI - 517501.
Andhra Pradesh, India.



ముద్రణ :

త్యాగరాజ ప్రింటర్స్, గిర్థంగివీధి, తిరుపతి.

ఫోన్ : 2115

శ్రీచంద్రమౌళీశ్వరాయ నమః

శ్రీ కంచి కామకోటి పీఠాధిపతి

# జగద్గురు శ్రీ శంకరాచార్య స్వామి వారి

శ్రీ మఠ సంస్థాపనము

ప్రధాన కార్యాలయము : కాంచీపురము - 631 501

శ్రీ చంద్రమౌళీశ్వర　　　　తేది: 3-10-1994

( తమిళ 'శ్రీముఖ' మునకు ఆంధ్రానువాదము )

ఆరు దివ్యక్షేత్రములనుచూచి 'శ్రీ కుమార సంభవము' మొదలగు విషయములతో పరిపూర్ణాది దైవమై మహిమలను విశ్లేషించునదియే "శ్రీస్కాంద పురాణము". దీనిని కుమారస్వామి అనుగ్రహముతో శ్రీ కశ్యపశివాచార్యులవారు తమిళభాషలో కీర్తించిరి.

తన్మూలమును గ్రహించి తెలుగుభాషాలాలిత్యముతో నడపిన వైద్యశ్రీ నటరాజన్‌గారి "శ్రీ స్కాంతపురాణ సారామృతము" వ్రాతప్రతిని జూచి మిగుల సంతసించుచున్నాము.

తెలుగు మాతృభాషగాగలవారున్నూ, తెలిసినవారున్నూ స్కందదేవుని గరిమను తెలిసికొనుటకు సహాయకారిగా ఈ గ్రంథము ప్రకాశించు చున్నది.

ఈ పురాణమును పరిశోధించి పాఠకులకు సహాయమొనరించిన చి॥ నటరాజన్ యొక్క ఆధ్యాత్మిక కృషి మరింత ప్రవర్ధమానమై వర్ధిల్ల శ్రీ స్కందస్వామి పూర్ణానుగ్రహము చేకూరవలయునని ఆశీర్వ దించుచున్నాము.

నా రా య ణ స్మృ తిః



PRIME MINISTER'S OFFICE
NEW DELHI-110 001

**P.V.R K. Prasad,**
Information Advisor to P.M.
Tele.No. 3025573

No. 1196/mp/94 June, 28, 1994

**Dear Dr. Natarajan,**

**Received with thanks two books, viz., "Guruvuevaru?" and " Pradosha Pooja Mahima '**

With regards,
Yours sincerely,
**(sd) P.V.R.K. Prasad**

**Dr. K.N. NATARAJAN**
**Nagari-517 590**
**Chittoor Dist. (A.P.)**

శ్రీ సిద్ధానంద మహారాజ్,
శ్రీస్వస్వరూపజ్ఞాన విద్యాపీఠమ్,
వ్యవస్థాపకులు,
28-27-30, గొబ్బాకవీధి,
జాంపేట, రాజమండ్రి.

తేది : 12-6-1994

## సందేశము

ఆత్మీయులు శ్రీ K.N. నటరాజన్ పుణ్యదంపతులకు శ్రీ లలితా పరాభట్టారిక ఆశీర్వాదములు-

మీ తపస్సు ఫలించి "శ్రీ స్కాందపురాణ సారామృతము" అను ఉద్గ్రంథమును మీచే రచింపజేసినాడు. శ్రీ వల్లీశుని కృపాకటాక్షము మీరు పొందితిరి. వారి దయచే తొందరలో ముద్రింపబడి, మానవ రూపములో మాధవుని ఆనందమునకు యీ గ్రంథమును అందింప జేయుదురు గాక!

మీలోని దైవత్వము పాఠకులు గ్రహింతురు.

శ్రీ సిద్ధానంద మహరాజ్

శ్రీ స్కందాశ్రమము,
సేలం
16-11-1994.

# అనుగ్రహము

ప్రేమస్వరూపుడా!

మీ ఉత్తరము అందినది. తాము వల్లిమలలో పనిచేసి పూర్తిచేసిన "శ్రీ స్కాందపురాణసారామృతము" అనే గ్రంథమునకు సహృదయులైన ధనికుల మూలముగా ప్రచురణచేయించి వెలువరించగలరు.

అట్టమీద తిరుత్తణి సుబ్రహ్మణ్యుని చిత్రమును ముద్రించగలరు.

మీకృషి సఫలీకృతమగుటకు శ్రీ సుబ్రహ్మణ్యుని అనుగ్రహము మీకు పూర్ణముగా లభించుగాక!

శ్రీశ్రీశ్రీ సద్గురు శాంతానంద
స్వాములవారి అజ్ఞానుసారము
(sd)..............

(తమిళలేఖకు తెలుగు అనువాదము)

# కుమారతత్త్వం

**Prof. H.S. Brahmananda,** ☎ 20924-160
M A , (Telugu) M.A , (Linguistics) Ph D.,
Dept. of Andhra Bharathi,
Sri Krishna Deva Raya University.

Residence:
28-493-A-7
Vijayanagar Colony
ANANTAPUR-515 001
DATE 9-12-1994

కుమారస్వామిగా భారతీయులు అర్చించే సుబ్రహ్మణ్యస్వామికి 'స్కందు'డన్నది అతిప్రాచీన నామం. స్కందన మంటే స్రావం. వాగుత్పత్తి పరంగా రోదనం. శివుడికి రుద్రుడని మరోపేరు. రోదనం వల్లనే రుద్రుడనిపించుకొన్నాడు. ఋగ్వేదంలో చెప్పబడ్డ మహావృషభుడు చేస్తున్న రోదనమే చతుర్విధ పరిమితమైన వాక్కు. పరా-పశ్యంతీ మధ్యమా-వైఖరులుగా ఈవాక్కు విశ్వవ్యాప్తమయినది. వాక్కుద్వారా కలిగే జ్ఞానాన్ని 'బ్రహ్మ'మన్నారు. ఆ ప్రకృష్టవాక్స్వరూపుడైన మనిషిని 'బ్రహ్మణ్యు'డన్నారు. వారిలో పరమశ్రేష్ఠుడు 'సుబ్రహ్మణ్యుడు'. వెరసి స్కందతత్త్వం-ప్రపంచ మంతటా వ్యాపించిన జ్ఞానప్రదాయకమైన వాక్తత్త్వమని అర్థం పశ్యంతీరూపమైన 'కుమార' వాక్కే స్కందుడు.

ఈ వాక్తత్త్వాన్ని యోగులు సమాదరిస్తారు. షట్కమల భేదన మూలకమైన సాధన మార్గంకూడా ఈశబ్దయోగ సమాధికోసమే. అందుకే శాంకర మంచి పరమహంసలకు 'సరస్వతులని-భారతులని' బిరుదనామం - దీక్షానామం - ఉన్నాయి. కాంచీపీఠ పరమాచార్యులు చంద్రశేఖరసరస్వతీస్వామివారికి సుబ్రమణ్యనాథ అంటే చాలాఇష్టమని పెద్దలు చెప్పగా విన్నాను. అలాంటి పూజ్యుల ఆశీస్సులతో ఈ రచన కుపక్రమించిన డా॥ నటరాజన్‌గారు ఈ గ్రంథంద్వారా మానవ జాతికి అధివ్యాధిభయతారకమైన ఒక మహాపురాణ గాథను అందిస్తున్నారు. అందుకే డా॥ నటరాజన్ గారిని అభినందిస్తూ ఈ గ్రంథాన్ని పరిచయం చేస్తాను.

కుమారగాథ అనగానే మనకు 'కాళిదాసు' స్ఫురణకు వస్తాడు. ఋగ్వేదం మొదలు శివ-అగ్ని-స్కాందపురాణాల వరకు శివ కుమారుని కథను భిన్న యుగాలలో ప్రస్తుతిస్తూవచ్చారు. దక్షిణభారతంలో కాశ్యప శివాచార్యుడు (కచ్చియప్ప అని తమిళుల వ్యవహారం) కుమారుని కథను పురాణ పద్ధతిలోనే చెబుతూవచ్చినా ఆతని 'కందపురాణం'లో దేశీయత, విచిత్ర కథాసంవిధానం ఉన్నాయి. డా॥నటరాజన్‌గారు తమ 'స్కాందపురాణసారామృతం'లో శివాచార్యుల మార్గాన్నే అవలంబించి నట్లు గ్రంథప్రణాళిక సూచిస్తున్నది ఇంకా 'వల్లిమల స్థల పురాణం' వంటి ఇతర దేశీయ సాంప్రదాయక రచనల్నికూడా చూశారనటానికి గ్రంథంలోనే నిదర్శనాలున్నాయి.

అలాగని డా॥ నటరాజన్‌గారు స్కాందపురాణాన్ని యథాతథానువాదమూ చేయలేదు. దక్షకాండాన్ని ముందుగా చెప్పి కుమార-అసుర మహేంద్ర-యుద్ధ-దేవకాండాలను తమకు అనుకూలమైన రీతిలో సులభ శైలిలోకి మార్చారు. అందుకనే ఈ గ్రంథంలో 'మౌలికత' కనిపిస్తోంది రచయిత 'పరిశ్రమ' సార్థకమై శిష్టదేశీయ సంప్రదాయాలు కలిసిన ఒక పురాణగాథ (Legend) గా స్కాందపురాణ కథ ప్రస్తుతరూపాన్ని పొందింది.

ఈ కథలోని ప్రధాన సమస్య తారకాసురాదుల సంహారం దాని కోసం శివపార్వతుల సమాగమం కావాలి అగ్ని శివతేజాన్ని సంగ్రహించి గంగలో వదిలాడు. ఆమె భరింపజాలక శరవణం లో ఆరుభాగాలుగా వదిలింది కృత్తికలు సంరక్షించారు అందరి సమిష్టి కృషి ఫలితంగా ఆగ్నేయుడైన 'శివతేజుడు' 'గాంగేయుడై' "కార్తికేయు" డయ్యాడు. దేవసేనకు పతి అయ్యాడు ఘోరయుద్ధం చేశాడు అసుర సంహారం జరిగింది.

కాలచక్రంలో దేవసేన-వల్లి అనే ఇరువురు భార్యలు కుమారునికి కల్గినట్టు కథలు ఏర్పడ్డాయి. ఈ కథలకు ఆధారమైన దక్షిణదేశ సంస్కృతిని సంపూర్ణంగా అధ్యయనం చేస్తేనే ఈ కథల పరమార్థం అవగతమవుతుంది. డా॥ నటరాజన్‌గారు ఆపని కూడా చేశారు. వల్లీ శబ్దవ్యుత్పత్తిని చూడండి. అలాగే 'వేంగై' మాను ప్రసక్తి కూడా

స్కందుని సోదరుడుగా విశాఖుడు చెప్పబడగా వీరబాహువు ఇక్కడ ప్రస్తావించ బడ్డాడు అలాగే నవవీరుల ప్రసక్తి కూడా అమూల్య మైన కొత్త విషయం ఆరుముఖాలకు విశిష్టమైన అర్థాలను - ప్రణవ నాదానికి - ప్ర - నవమైన అర్థం రచయిత చెప్పారు.

ఇంతమాత్రమే గాకుండా రచయిత స్వయంగా అనుభవ శీలం ఉన్నవాడు మూలకథను బాగామధించి తన అనుభవంలోకి తెచ్చుకొన్నాడు మూలకథలో వాయు ప్రసక్తిలేదు కాశ్యపుల రచనలో వుంది. అందువల్ల పంచభూతాత్మక శరీరఆవిర్భావాన్ని గురించిరాశారు. ఇది చాలా బాగుంది

మరొక రహస్యం కూడా ఉంది రచయిత సాధన గురువు సుబ్రహ్మణ్యుడు ఆస్వామి ఆశీస్సులే డాక్టరుగారి జీవితాన్ని నడుపు తున్నాయి. అందుకే ఈగ్రంథంలో సందర్భవశంగా రచయిత స్వాను భవాలు ప్రస్తావింప బడ్డాయి.

# అభినందనోక్తి

శ్రీ నటరాజన్‌గారు అధ్యాపక వృత్తికి దగినయోగ్యతా పత్రాలు చేతబట్టుకొన్నారు. జీవికకై వైద్యులుగా స్థిరపడినారు. ప్రస్తుతం సాహితీ ప్రవృత్తితో శ్రమిస్తున్నారు. హృదయ వికాసమునకు సంబంధించిన ఈ చరమకృషితో వీరు అలుపెరుగని ఆత్మతృప్తితోనున్నట్లు పెక్కుమారులు నాతో ముచ్చటించినారు.

ప్రదోషపూజామహిమ, గురువెవ్వరు? సంకటహరచతుర్థీవ్రతపూజ ఇప్పటికి వెల్వడిన వీరిలఘురచనలు. అయ్యవి భారతీయ తత్త్వప్రతిపాదకములై అలఘుత్వమునాపాదించుకొన్నవి. సహజధార్మికపథగాములైన శ్రీ డి.సి వరదరాజులు (నగరి) వంటివారి సాహచర్యము పూదావికి పసిడికాంతియబ్బినట్లైనది.

పరిశోధనా రంగంలో ప్రామాణికత సాధించిన ఆచార్య హెచ్ ఎస్ బ్రహ్మానంద గారు దీనికి విపుల పీఠిక వ్రాసినారు. మరల నేనేదొ వ్రాయదలచుట సాహసమేయవుతుంది. ఆత్మీయతాను బంధం దృష్ట్యా మిత్రశ్రీని కాదనలేక ఒక్కమాటతో ముగిస్తున్నాను.

డా॥ నటరాజన్ గారు సంస్కృతాంధ్రాంగ్ల, తమిళ, కన్నడ, హిందీ భాషలను జాగ్రత్తగా అధ్యయనము చేసినవారు. ఆయాభాషలలోను లభ్యమైన శ్రీ వల్లీకుమారగాథలనెల్ల పరిశీలించినారు. కావున ఈ "శ్రీ స్కాందపురాణసారామృతము"న స్పష్టత సారళ్యత సాధించినారు. కథాకుతూహలురకేగాక, స్తోత్రప్రియులకు కూడా కాన్క చేసినారు. వీరికృషి అభినందనీయం. అందుకే ఆ ఏడుకొండలవాడే అభయహస్తమెత్తినాడు.

శుభమస్తు

తేది : 18-9-1995 ఆశావాది ప్రకాశరావు
పెనుకొండ "అభినవ సాహితీ సోమయాజి"
(అనంతపురం)

ఓం శ్రీ సాయిరామ్

కశెట్టి సుబ్రహ్మణ్యం M A ,M Ed.,
Dip in T.T. Mechanical Instructor,
డా॥ రాధాకృష్ణన్ హైయ్యర్ సెకండరి బాలుర పాఠశాల,
తిరుత్తణి.

## "అవతారిక"

అనన్య సామాన్యమైన ప్రజ్ఞాపాటవములుగల శ్రీయుతులు డా॥ కే. ఎన్. నటరాజన్‌గారి "శ్రీ స్కాందపురాణ సారామృతము" తెలుగు ప్రజలకు లభించిన ఒక అపూర్వ కానుక! తెలుగు వారికి శ్రీ సుబ్రహ్మణ్య తత్త్వము, అవతార విశేషములు అంతగా తెలియదనే చెప్పవలసియున్నది. కొన్ని ప్రాంతాలలో నేటికికూడా నాగుపామే శ్రీ సుబ్రహ్మణ్యుడని పూజించడం కద్దు.

స్కాంద పురాణం అష్టాదశ పురాణాలలో ఒకటి రామాయణ యితిహాసమునకు స్కాందపురాణమునకు పెక్కు పోలికలు కలవు భక్తి శ్రద్ధలతో చదివే పాఠకులకు ఈ విషయం బాగా అర్థం కాగలదు.

పురాణ పఠనం చేస్తున్నప్పుడు శ్రీ నటరాజన్ గారి విశేష జ్ఞాన సంపద మనలను ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. వీరు కథలను చెప్పడం మాత్రమేగాక అవసరమైనప్పుడెల్ల చాలా విపులంగా సులభంగా అర్థమయ్యే రీతిలో అంతరార్థాలు చెప్పియున్నారు.

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని నీతి, ధర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్య ఉపదేశములు అన్ని భావాలను చదివేటప్పుడు పైన చెప్పినఅభిప్రాయంతో పాఠకులు ఏకీభవిస్తారనే నానమ్మకం

తమిళసాహిత్యంలో మంచిపాండిత్యంగల మాప్రధానోపాధ్యాయులు శ్రీ ఇ శివశంకరన్ గారికి ఈ "స్కాందపురాణ సారామృతము" ను చదివి వినిపించి నపుడు వారు చాలా సంతోషించి "మూలమునకు" ఏ విధంగానూ తీసిపోని విధంగా ఉంది" అన్నారు "రచయిత అచ్చుటచ్చుటా చేసిన విశ్లేషణాలు ఎంతో విజ్ఞానదాయకమే గాక ఔచిత్యాన్నివాటు పాటించడం జరిగింది" అని వారు శ్లాఘించారని ఇక్కడ చెప్పడం సబబుగానే యుంటుందని భావిస్తున్నాను.

పురాణాంతమున శ్రీ సుబ్రహ్మణ్యుని అద్భుత నామావళి వల్లీ దేవసేన దివ్య నామములు, అరుప్పడైవీడు అనే ఆరుదివ్యక్షేత్రముల వివరణ, వల్లీ-దేవసేనల-సుబ్రహ్మణ్య స్తోత్ర- పూజా విధానము ఈ గ్రంథమునకు మరింత సొబగును ఒనగూర్చుచున్నది.

ప్రతి ఒక్కరు ఈ గ్రంథప్రతిని తమ పూజా గృహములో ఉంచుకొని నిత్యపారాయణము చేయదగిన అత్యంత పవిత్ర గ్రంథముగా ఈ "స్కాందపురాణ సారామృతము"ను భావిస్తున్నారు.

తిరుత్తణి
4-12-94

కె. సుబ్రహ్మణ్యం

ఓం శరవణభవః

## కృతజ్ఞతలు / ముఉన్నుడి

28-11-1988వ తేదీ కార్తీకశుద్ధ షష్టి దినమున అసంకల్పితముగా కాంచీపురము చేరాను. ముందుగా 'కుమరకోట్టం'లో శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని దర్శించాను. ఆలయ ప్రదక్షిణము చేయుచున్నప్పుడు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని విశ్వరూప నిలువెత్తు వర్ణ చిత్రము చూడగానే నాలో ఏదో తెలియని దివ్యానుభూతి కలిగింది.

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి గురించి ఆంధ్రదేశములో తెలిసినది చాలా తక్కువయని అనుకొన్నాను. శ్రీవారిని ప్రస్తుతిస్తూ వేదవ్యాసులవారి అష్టాదశపురాణాలలో నొక్కటైన "శ్రీ స్కాంధపురాణాన్ని" వచన రూపములో తెలుగులో వ్రాయాలని దైవ సంకల్పంగా అప్పుడు తోచినది.

శ్రీ కశ్యప శివాచార్యులవారు 'కుమరకోట్టం'లో అర్చకులుగా నుండిరి. వారు తమిళంలో కందపురాణం వ్రాసియున్నారు. వారి దివ్యాత్మ నాలో ప్రేరేపించియుండవచ్చునని తలంచెదను. యథాతథంగా వారి మూలాన్ని ఆధారంగా గ్రహిస్తూ పురాణసారాన్ని మాత్రం వ్రాయాలని అనుకొన్నాను. గ్రంథమును పరిశోధన చేసి వ్రాసే ముందు మహనీయుల ఆశీస్సులు పొందాలని తలంచి, కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ జగద్గురువులు చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాముల వారిని దర్శించి విన్నవించాను. నన్ను ఆపాదమస్తకము లిప్తకాలంలో చూశారు. ఆనందంతో తలాడిస్తూ 'రాస్తావులే!' అని అభయహస్త(దర్శన)మిచ్చి మనసారా ఆశీర్వదించారు.

ఇదంతా నా పూర్వజన్మ సుకృతం. 'శ్రీ స్కాంధపురాణ సారామృతము' అనిపేరు పెట్టదలిచాను. ఎందుకంటే యీనాటి పాఠకులు ఉద్గ్రంథాలను పూర్తిగా ఓపికతో చదివేవారు చాలా అరుదుమరి! పురాణమంతా వ్రాసినా చదివే పాఠకులుండాలి కదా! అందుకే పురాణసారాన్ని మాత్రమే అందించాలనుకొన్నాను.

నన్నెరుగని పద్యములు చిన్నప్పుడు చదివియున్నాను. తమిళంలో ప్రవేశమున్న కారణాన శ్రీ కశ్యప శివాచార్యుల వారి పాఠకను

నాశైలిగా తీసుకొన్నాను. 'శ్రీ వల్లిమలక్షేత్ర మహిమ' అనే చిఱు గ్రంథం లోని విషయాలనుకూడా గ్రహించాను అలా రచన మొదలైనది. పురాణ రచన అంత సులభమూకాదు. అలావ్రాయుగలిగినంత మాత్రాన మన గొప్పతనమేమీలేదు! కేవలం దైవ సంకల్పబలమున్నపుడే సాధ్యమవు తుంది. పశువుల కాపరి 'కాళిదాసు' కాళీమాత కృపతో కవియైనాడు. మరి భగవద్విలాసమెలా వుంటుందో, ఎవరిద్వారా ఏమి చేయాలని నిర్ణ యింపబడియున్నదో ఎవ్వరు ఊహించగలరు? నా అనుభవమూ అంతే మరి!

సద్విషయం తీసికొన్న కారణమేమోగానీ గ్రంథరచన కొంతవరకు సజావుగా సాగినా, దరిమిలా కుంటుపడుతూ వచ్చినది ఈలోగా శ్రీ దోర్నాదుల చిన్న వరదరాజుల శ్రేష్ఠి (నగరి) గారి ప్రోత్సాహముతో 'గురువు ఎవరు?' అనే చిన్ని పొత్తము నాచే రచింపబడి వారిచే ముద్రిం పబడి ఉచిత పంపిణీతో పాఠకలోకానికి దగ్గరయ్యాము. ప్రశంసాపర మైన ఉత్తరాలనేకం వచ్చినవి

తరువాత 'ప్రదోష పూజామహిమ' అనే చిరు గ్రంథాన్ని నాచే వ్రాయించి, శ్రీ మన్రిపల్లె నరసింహ రామచంద్రనాయుడు గారు (పారి శ్రామిక వేత్త, ఆధ్యాత్మిక దురంధరులు, సదాలోచనాపరులు, సదా చారులకు ఆత్మబంధువు) ముద్రణవ్యయాన్ని భరించారు. 6-4-93 చైత్రపౌర్ణమి మంగళవారము సాయంత్రము కంచికామకోటి పీఠంలో జగద్గురువులు శ్రీశ్రీశ్రీ విజయేంద్ర సరస్వతీస్వాములవారిచే ఆవిష్క రింపబడినది. వారిచ్చిన 'శ్రీముఖ'ములే నా గ్రంథములకు జీవమని పండితలోకాభిప్రాయము!

ఇదిలా వుండగానే పుంగనూరు కాళికాలయములో నుండు ప్రజాకవి. జ్ఞానశ్రీ పార్నంది అన్నదానభట్లు గారి ప్రమేయంతో వారి శిష్యశ్రీ ఎ చిదానందం గారి ఆర్థికసాయంతో మరో చిఱుగ్రంథం "శ్రీసంకటహర చతుర్థీవ్రతపూజ" ప్రచురింపబడినది.

మొదట రచనకుద్యమించిన "శ్రీస్కాందపురాణ సారామృతము" వెనుకబడినది. కారణాలేమైనా యీ బృహద్గ్రంథం పూర్తిచేయాలంటే దైవ సన్నిధిలో ప్రశాంతమైన వాతావరణంలో రచన సాగించాలని అర్థమైనది.

చిట్టచివరికి సహకరించిన "అష్టావధాన అభినవ సాహితీ సోమయాజి" బిరుదాంకితులూ, అనంతపురం - పెనుగొండ ప్రభుత్వ డిగ్రీకళాశాల ప్రధానాచార్యులు శ్రీ ఆశావాది ప్రకాశరావు గారి 'అభినందనోక్తి' శ్రీ స్వస్వరూప జ్ఞాన శ్రీవిద్యాపీఠ వ్యవస్థాపకులూ మద్గురువ రేణ్యులైన శ్రీ సిద్ధానంద మహరాజ్ వారి 'ఆశీఃపూర్వక లేఖ' సేలం సమీపం శ్రీ స్కందాశ్రమ నిర్వాహకులు శ్రీ సద్గురు శాంతానంద స్వాముల వారి 'ఆజ్ఞాపత్రము' ప్రతి మంగళవారము తిరుత్తణి పుణ్యక్షేత్రాధి దేవుడైన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని క్రమం తప్పకుండా కొన్ని యేళ్లుగా దర్శించు శ్రీకశెట్టి "అమూలము" యివన్నీ యీ గ్రంథమునకు అకార్కచంద్ర ప్రకాశితములైన అక్షర లక్షలు వారికివే నా శిరస్సు వంచి ప్రణామములు చేసి కృతజ్ఞతలు తెలుపుతున్నారు.

చేసిన మేలును మరచి ప్రవర్తించడం మానవత్వం కాదని అందరికీ తెలుసు. తనుక మేలుచేసినవారిని శ్లాఘించడం ద్వారా మరింత మేలు చేసిన వారవుతాము ఎవరినైనా నేను మరచినట్లు భావిస్తే వారు నన్ను క్షమించి ఆదరించ గోరెదను శ్రీ మంత్రిపల్లె నరసింహ రామచంద్ర నాయుడిగారికి శుభాభివందనములు.

శ్లోకములను పొందు పరచడంకోసం తనవంతు సహకారం మందించిన శ్రీ రాంభట్ల వేంకట సుబ్రహ్మణ్య శర్మ (అర్ యస్. మణి అయ్యర్ నగరి) గారికివే నా శతసహస్రవందనాలు ! అలాగే సోదరుడు శ్రీ కె. తిరువేంగడపిళ్లై (నగరి) గారికి

ప్రేమామృత స్వరూపులూ సాక్షాత్తు శ్రీ కుమారస్వామి స్వరూపులైన శ్రీశ్రీశ్రీ విజయేంద్ర సరస్వతి శంకరుల వారి పరోదుహ పదద్వయమునకు కృతజ్ఞతా పూర్వకనమస్సులు వారి కరుణాపూరితమైన దృష్టి పుణాల తచనానంద మూలమై మార్గదర్శకమైనదని త్రికరణశుద్ధిగా ఉల్లేఖించి యీ కృతజ్ఞతా శ్రేణిని పరిసమాప్తమొనరించు చున్నాను.

పాఠకులు సద్భక్తితో గ్రంథమాంతము చదివి తమ మేలైన అభిప్రాయములను సూచనలను తేలియజేయ మిక్కలి ప్రార్థితుడను.

తిరుపతి
11-7-97

ఇట్లు,
భవాంఘ్రి రేణువు
"జ్యోతిష - కళా - వైద్య ప్రియదర్శన
డా॥ కె. యన్. నటరాజన్

కుటుంబంతో కదిలాను 'వల్లిమల' చేరాము అక్కడే పన్నెండు దినములు బసచేసినాము సూర్యోదయానికి ముందే 26-4-1994 వతేది నుండి 6-5-1995 వతేది శుక్రవారం వరకు గిరిప్రదక్షిణము చేసి వచ్చిన తరువాత పురాణసారామృత రచన చేయగలిగాను. కఠోరమైన దీక్షవహిస్తేనే భగవదనుగ్రహము సాధ్యము కాదని అనుభవంమీద తెలిసికొన్నాను. ఆర్థికబలము, కుటుంబసభ్యుల సహకారము, విద్వాంసుల సలహాలు మొదలైనవి లభించినంత మాత్రాన సరిపోదు. దేవుని కృపవుంటేనే యివన్నీ వుపకరిస్తాయి.

ఈ గ్రంథరచన కారణంగా సన్మిత్రులు శ్రీ కుమారస్వామిని ఆరాధించు భక్తులు నాకు తోడ్పడ్డారు వారిలో ముఖ్యులైన వారిని ప్రస్తావించకుండా వుండలేను. కొందరు తనుగురించి తెలియబఱచవద్దని వారించినా, కృతజ్ఞతాభావంతో వారిని స్మరించడం నా ధర్మంగా భావిస్తున్నాను. వారిలో డా॥ యం రామచంద్రన్ M B.B S. నగరి. ఆధ్యాత్మిక దురంధరులు మరియు పారిశ్రామిక, రాజకీయ నాయకులైన శ్రీ పాతా ఆర్ముగం గారు పుదుపేట, నగరి. నాకు శిష్యసమానులైన చి॥ జి.వి. రమణారావ్ (I O.W Rlys. Orisa). చి॥ జి. సురేష్ కుమార్ S.V.U తిరుపతి. చి॥ జి సుబ్బారావ్ Xerox Centre తిరుపతి. శ్రీ మనోహరరెడ్డి గారు, శ్రీ సరస్వతీ విజ్ఞానమందిర్ నగరి. గంగాభాగీరథి సమానురాలైన వదినగారు శ్రీమతి కనకవల్లి బెంగుళూరు శ్రీ జనార్ధనరాజు శ్రీ సరస్వతివిద్యానికేతన్ తిరుపతి. శ్రీ డి. రాఘవేందర్ APSEB పుత్తూరు. మొదలైనవారి సహాయమునకు సర్వదా కృతజ్ఞుడన్ను

పుస్తకరచన ఒక ఎత్తయితే దానిని ముద్రించుటకు ఆర్థిక బలమిచ్చేవారిని ఆశ్రయించడం మరోఎత్తు తిరుమల-తిరుపతి దేవస్థానముచే హిందూమతధర్మరక్షణకు ప్రోత్సాహమిచ్చే పుస్తకమునకు ఆర్థిక సహాయమందించడం నాబోటివారికి కల్పతరువై "బ్రోచేవారెవరురా?"... అని బాధపడకుండా తి.తి దే. తనవంతు సహాయమందిచడం వల్ల యీ పుస్తకము వెలుగులోనికి వచ్చుచున్నది ఇందుకుగాను 1994లో ధర్మకర్తల మండలి అధ్యక్షులుగా ఉండిన శ్రీ ఎ. చెంగల్‌రెడ్డి గారికి ఇ ఓ గా ఉండిన శ్రీ డి.వి.యల్‌యన్ మూర్తి గారికి మిక్కిలి కృతజ్ఞుడను

ఈ గ్రంథాన్ని సవిమర్శ చేసే అనుభవజ్ఞులు నాకు దొరకడం కేవలం శ్రీ స్కందుని లీలా విలాసమే ! అవిధంగా పరిచయమై అభినుతులందించిన H.S బ్రహ్మానంద M A., (Telugu): M.A., Lingustics Ph. D 'తెలుగుభారతి' విభాగాధిపతి, అనంతపురం గారి 'కుమార తత్త్వము' వారిని పరోక్ష పరిచయము చేసి తన 'అమూల్యమ్' ను అందిచడానికి వెనుకాడి, నా ప్రోద్బల కారణాన

## గురు వందనం

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్ విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ । తస్మైశ్రీ గురవేన్నమః ॥

## వాణీ గణపతుల ప్రార్థన

శ్లో॥ వర్ణానామర్థ సంఘూనాం । రసానాం ఛందసామపి ।
మంగళానాంచ కర్తారౌ । వందే వాణీ వినాయకౌ ॥

## శివకేశవుల ప్రార్థన

శ్లో॥ ఓం శివాయ విష్ణురూపాయ । శివరూపాయ విష్ణవే ।
శివస్య హృదయం విష్ణు । ర్విష్ణోశ్చ హృదయం శివః ॥

## శ్రీ వెంకటేశ్వర ప్రార్థన

శ్లో॥ ఓం నమో వేంకటేశాయ । పురుషాయ మహాత్మనే ।
ప్రణతః క్లేశనాశాయ । గోవిందాయ నమో నమః ॥

## శ్రీ అంబికా ధ్యానం

అరుణాం కరుణాం తరంగితాక్షీం ధృతపాశాఙ్కుశ పుష్పబాణ
చాపామ్, అణిమాదిభిరావృత్తాం మయూఖై రహమత్వేన
విభావయే భవానీమ్, ధ్యాయే పద్మాసనస్థాం వికసిత వదనాం
పద్మపత్రాయతాక్షీం, హేమాభాం పీతవస్త్రాం కరకలితల
సద్ధేమపద్మాం వరాంగిమ్, సర్వాలఙ్కార యుక్తాం సతత
మభయదాం భక్తనమ్రాం భవానిం, శ్రీ విద్యాం శాన్తమూర్తిం
సకలసురాసురనుతాం సర్వ సమ్పత్ప్రదాత్రిమ్, సఙ్కుమ
విలేపనా మళిక చుమ్బి కస్తూరికాం, సమన్దహసితేక్షణాం
సశరచాప పాశాఙ్కుశామ్, అశేష జనమోహినీ మరుణ
మాల్య భూషామ్బరాం, జపాకుసుమ భాసురాంజపవిధౌ
స్మరేదమ్బికామ్

## శ్రీ సుబ్రమణ్యేశ్వర ధ్యానమ్

శ్లో॥ షడ్వక్త్రం శిఖివాహనం త్రినయనం చిత్రాంబరాలంకృతం ।
శక్తిం వజ్రమసిం త్రిశూలమభయం ఖేటం ధనుశ్చక్రకం ।
పాశం కుక్కుట మంకుశంచ వరదం దోర్భిదధానం సదా ।
ధ్యాయేదీప్సిత సిద్ధిదం శివసుతం వందే సురారాధితం ॥
ఇతిధ్యాత్వా మానసోపచారైః పూజయేత్ ॥

## శ్రీ అయ్యప్ప ప్రార్ధన

శ్లో॥ అఖిల భువన దీపం, భక్త చిత్తాబ్జ సూరం
సురగణముని సేవ్యం, తత్త్వమస్యాది లక్ష్యం
హరిహరసుత మీశం, తారకబ్రహ్మరూపం
శబరిగిరినివాసం, భావయే భూతనాథం ॥

## శ్రీ ఆంజనేయ స్మరణం

శ్లో॥ అంజనానందం వీరం జానకీశోక నాశనం
కపీశమక్షహంతారాం వందే లంకాభయంకరం

## శ్రీ దక్షిణామూర్తి

శ్లో॥ ఓం నమోభగవతే శ్రీమేధా దక్షిణామూర్తయే నమః ।
మహ్యం మేధాం, ప్రజ్ఞాం ప్రయచ్ఛస్వాహా ॥

## శ్రీ దత్తాత్రేయ గాయత్రి

ఓం పరమహంసాయ విద్మహే । అవధూతాయ ధీమహి ।
తన్నో దత్తః ప్రచోదయాత్॥

"పురాణం పంచ లక్షణమ్" అని చెప్పబడినది. అంటే ఐదు లక్షణాలు పురాణంలో వుండి తీరాలని చెప్పబడినది. అవి :

1 సర్గమ్ (లేదా) లోకారంభము
2 విసర్గమ్ (లేదా) ప్రళయకాలములో ప్రపంచరీతి
3 ప్రజాపతుల అవిర్భావము, అదృశ్యము
4 మన్వంతరము (లేదా) వేర్వేరు మనువుల కాలనిర్ణయము
5 వంశము (లేదా) దేవతల పారంపర్యము

నైమిశారణ్యంలో సూతుడు చెప్పిన గాథలనే శ్రీ వేదవ్యాస భగవానుడు పురాణములుగా విభజించి వ్రాసినాడని ప్రతీతి. కథలను కావలసిన రీతిలో మలచినా, పైన చెప్పిన యీ పంచలక్షణాలతో కథలను పురాణప్రోక్తం చేయాలి. పురాణం యొక్క ముఖ్యోద్దేశ్యం. ప్రకృతి వర్ణన, ప్రకృతి ఆరాధన, భూగోళ ఖగోళాది శాస్త్ర విజ్ఞానార్జన-తద్వారా ఐహిక సుఖాలను ధర్మానుసారము పొందుచూ, ప్రాపంచిక భోగాలను క్రమేణ త్యజించి చివరకు పారమార్థికచింతనకు దారితీయుట.

" శ్రీ స్కాందపురాణం " లో శివకుమారుని జననకారణము, స్కందుని బాల్యమందలి లీలావినోదములు; శివసదృశమై అండపిండ బ్రహ్మాండాదులను తనలోనే విశ్వరూప సందర్శనముజేయు శ్రీసుబ్రహ్మణ్యేశ్వరుని విశేషము కాగా; తారకాసుర, సింహముఖ, శూరసేనుల వధ; తద్వారా ఇంద్రాది దేవతలకు అభయము, వల్లీదేవసేనలతో పరిణయము చెప్పబడినది. దీనిని గురించి తర్వాత తెలిసికొందాం. అంతకుముందు

1 శివుడు: లింగ రూపముగ అంతయూతానై వ్యాపింప, బ్రహ్మదేవుడు తాను శివలింగము యొక్క అంచులను దాటి చూచినానని అసత్యమాడి పూజకు అనర్హుడయ్యెను. విష్ణువు తాను పూర్తిగా చూడలేకపోయినానని సత్యము పలికినందువల్ల పూజార్హుడై 'పురుషోత్తము' డాయెను. ఈ గాథలోని అంతరార్థము ఏమనగా !

మానవుడు నిజము పలుకుటవల్ల పూజింపబడుచున్నాడు. పురుషులి లో ఉత్తముడగుచున్నాడు. అనృతమాడి బ్రహ్మవలె నిరాదరింపబడు చున్నాడని తెలియవలెను. కావున అందరూ విష్ణుమయ రూపులై ఉత్తమజీవులుగా విలసిల్లాలి.

2 క్షీరసాగర మథనం : భూగోళపరంగా లవణ సముద్రాలు మనము చూడవచ్చును. పురాణపరంగా పాల సముద్రమును గురించి చదివి తెలిసికొను చున్నాము. పాలసముద్రము ప్రతి ఒక్కరి ఆత్మ విమర్శ చేత తనలోని అంతరంగాన్ని మథనం చేయగా చేయగా మొదట హాలాహలం లాంటి దుఃఖపూరితమైన సంఘటనలు సంభవించిననూ, పిదప అష్టభోగములనిచ్చు కౌస్తుభ, ఐరావత, ఉచ్ఛైశ్రవ, కల్పవృక్ష, కామధేను, లక్ష్మి, చంద్రులను పొంది, ప్రాపంచిక సుఖములను అనుభవించి, చివరకు, సాయుజ్యమును, అమృతమును పొందవచ్చునని యీ క్షీరసాగరమథన ఘట్టము నుండి తెలియనగును.

ఈశ్వరుని సృష్టిలో దేవతలూ, రాక్షసులూ అంటే మంచివారూ, చెడ్డవారూ ఉభయులూ ఉండిరి: ఇరువురికి ఐకమత్యము ఉండేదికాదు అందువల్ల ఉభయ పక్షాలూ వైరభావముతో ప్రవర్తించుచుండగా - క్షీర సాగర మథనకాలంలో "అమృతము" దొరుకుతుందని ఒక్కటైనారు. పాలసముద్రము చిలికినపుడు 'విషం' పుట్టింది. దేవతలూ, రాక్షసులూ అందరూ పరుగెత్తారు. ఈశ్వరుడు ఆహాలాహలాన్ని త్రాగినపుడు 'దేవి' దానిని ఆయన కంఠం దగ్గర ఆపినందువల్ల శివుడు, నీలకంఠుడు 'నీలగ్రీవుడూ', గరళకంఠుడయినాడు. తర్వాత లభించిన విలువైన వన్నింటినీ ఎవరకి తగినది వారు గ్రహించినారు.

దీనివల్ల మనం తెలుసికోదగినదేమిటంటె క్షీరసాగరమథనం మన జీవితఘట్టం. ప్రాణులన్న జీవితమనే పాల సముద్రాన్ని దాటుచున్నది. లేదా ఆ పాల కడలిని మథించుచున్నవి. వారికి ఐశ్వర్యము, విద్య ఆభరణములు, వాహనములు మొదలగునవి లభించుచున్నవి. మర ణాన్ని వాయిదా వేయించునది అమృతపానమగును. ఆహారరూపమున

'చావు' దూరమగుచున్నది. అయినను హాలాహలం లాంటి మృత్యువు ఆ జీవుల్ని కబళించక మానదు ఇది కాలక్రమములలో జరుగుచున్నది. అయితే "శివజ్ఞానమును" అనుభూతితో పొందువారు శివునిలో ఐక్యమయి పునర్జన్మ నుండి తప్పించు కోగలుగుతారు.

ప్రకృతిని చక్కగా పరిశీలించి చూచినట్లయితే మనకు ఒక విషయము అవగాహన అవుతుంది. జీవన సరళిలో పంచేంద్రియముల ద్వారా ఈ హాలాహలాన్ని పొందుతూవున్నాము. పంచ భూతాత్మకమైన ఆకాశము, జలము, వాయువు, అగ్ని, భూమి నుండి యీ హాలాహలము అమృతముగా మారుచున్నవి. ఇదంతా ఈశ్వరుని చిద్విలాసమని తెలిసిన వారు ప్రకృతిలో లీనమై, ప్రకృతిలో జీవించి, ప్రకృతిలోనే చేరు చున్నారు. దీనినే ఆధునిక యుగంలో (సైన్సులో) 'నత్రజని భ్రమణము'ని చెప్పుచున్నారు. నవపాషాణములతో నవసిద్ధులచే నిర్మింపబడిన 'పళని' విగ్రహం నుండి స్వీకరించిన పంచామృతమెంత రుచిరమైనదో రుచిచూచి తెలిసికొనండి.

3 త్రిపుర దహనము : తారకాక్షుడు, విద్యున్మాలి, కమలాక్షుడని ముచ్చరు దానవులు, రజిత(వెండి), స్వర్ణ (బంగారు), లోహ (ఇనుము) ములచే నిర్మింపబడ్డ పురములలో వుండేవారు. వారు కోరిన చోటికి ఎగిరి వెళ్లే తమ త్రిపురాల మహిమతో ఇచ్ఛాగమనముగల వారి తాకిడికి దేవతలందరూ భయపడుతూ వుండేవారు. వీరి దురాగతాలను సహించలేక దేవతలందరూ శివుని శరణుజొచ్చారు. వారి ప్రార్థనను ఆలకించిన మహాదేవుడు వారియందనుగ్రహించినాడు.

త్రిపుర దహనానికి శివుడు వెళ్లేందుకుగాను దేవతలందరూ కలిసి ఒక దివ్యమైన రథాన్ని సిద్ధం చేశారు. ప్రకృతిలో లభించే ప్రతి వస్తువునీ ఆ రథ నిర్మాణానికి వుపయోగించారు. దేవతలందరూ తగు రీతిన అలంకారమయినారు. బ్రహ్మదేవుడు రథసారథిగా నిల్చినాడు. వేదాలను గుర్రాలుగా పూన్చినాడు. విష్ణుమూర్తి శివునిచేతిలో విల్లైనాడు.

పరమేశ్వరుడు రథారూఢుడైనాడు. దేవతలు తామారథానికి అలంకార ప్రాయులైనందువల్ల వారివారి స్థానాలు ఆరథానికి ప్రాముఖ్యత

పొందినట్లు వారికవారే భావించుకొని గర్వించినారు. కానీ సదాశివునికి అవన్నీ త్రిపుర దహనానికి వుపయోగపడే సాధనాలు కావుకదా!

ఆయుధ ప్రయోగము చేయలేదు శివుడు చేతిలోని ధనుర్బాణము లను ప్రయోగించలేదు త్రినేత్రుడు. కేవలం చిరునగవుతో త్రిపురాలను అలవోకగా చూచినాడు. అంతే త్రిపురాలు దహింపబడినవి.

త్రిపురాధిపతుల త్రిగుణములు సత్త్వ, రజోతమోగుణాలకు ప్రతిరూపాలే. వరుస క్రమంగా స్వర్ణ, రజిత, లోహములనే పురాలు మానవ శరీరమే రథము. ప్రపంచములోని అణువణువూ శరీరంలో చూడవచ్చును. పంచేంద్రియాలే దేవతలు. అజ్ఞానముతో కొట్టుమిట్టాడే జీవాత్మయే బ్రహ్మ. ఈ జీవుడు పొందే విచక్షణా జ్ఞానమే వేదాలలోని సారము.

శివజ్ఞానముతో ఉదయించు ఆత్మ జ్ఞానమువల్ల యీ త్రిగుణాలు భస్మీపటలమైపోవుచున్నది. అప్పుడు జీవాత్మ పరమాత్మయైన శివునిలో లయమగుచున్నది. ఇటువంటి లయకారకత్వమే శివలీల. అనేక జన్మలెత్తి పడరానిపాట్లన్నిపడే యీ జీవాత్మ కర్మపరిపక్వత నొంది, సుజ్ఞానము పొందినపుడు ఈశ్వరునిలో లయమై పునర్జన్మ లేనిదగు చున్నది. ఇది జరిగినంతవరకు ప్రతి జీవాత్మ త్రిపురముల వలె త్రిగుణాత్మకమై సంచరించుచూ అనేక రకములైన జన్మలెత్తుచూ, అంటే పుట్టుచూ గిట్టుచూ వుండునని తెలిసికొనవలయును.

4 దక్షప్రజాపతి: ప్రజాపతులలో నొకడు. ఇతడు బ్రహ్మ కుడి బొటన వేలి నుండి పుట్టెను. ఎడమ బొటనవేలి నుండి పుట్టిన 'ధరణి'ని దక్ష ప్రజాపతి వివాహము చేసికొనెను. ఈ దంపతులకు కీర్తి, లక్ష్మి, ధృతి మొదలుగా యాభై మంది కూతుండ్రు పుట్టిరి. వీరిలో దాక్షాయణి అని పిలువబడు 'సతీదేవి' పెద్ద కుమార్తె. ఆమెను శివునికిచ్చి వివాహము చేసెను. బ్రహ్మ చేయుచుండు యజ్ఞమునకు దక్షుడు కూడవెళ్ళెను. అచ్చట శివుడుండెను. మామగారైన దక్షుని జూచియు శివుడు లేవక, గౌరవించక యూరకుండెను. అందులకు దక్షునికి శివునిపై కోపము కలిగెను.

ఈశ్వరునికి అహ్వానము పంపక "నిరీశ్వర యాగము" చేయు బ్రహ్మ, విష్ణువులు వెళ్ళలేదు. కానీ ఇంద్రాది దేవతలు తమతమ విమానములలో కోలాహలముగా దక్షయజ్ఞమునకు వెళ్ళిరి. ఇది జూచిన 'సతీదేవి'కి తండ్రిచేయు యజ్ఞమునకు వెళ్ళ కుతూహలమాయెను.

" దేవీ ! నన్ను కాదని చేసే దక్షయజ్ఞమునకు వెళ్ళినవారి దుస్థితిని వూహించలేకున్నావు ! నీ పితృ వాత్సల్యము నీకు కీడు చేయునని యెఱుంగవేల? " అని శివుడు అడుగగా, సతీదేవి, నాథా ! పుట్టింటి మమకారము ప్రతి స్త్రీకి సహజగుణము ! పుట్టింటి వారెన్ని తప్పులు చేసినను తమ మమకారముతో కప్పిపుచ్చుకొని, తల్లితండ్రులకడ కేగెదరు ! కాన నా మమకారము కూడా అట్టిదియేనని తాము గ్రహించరేల ? " అని ప్రత్యుత్తరమిచ్చినది.

" వెళ్లక తప్పదా ? " అని శివుడడిగెను.

" అవును ప్రభూ ! పోయి వచ్చెద" ననెను. "భర్త గౌరవము కన్నా పుట్టింటి మమకారము మిన్నయని భ్రమసి పరాభవించుచోటికి వెళ్లెదనని మొరాయించుచున్నావు ! ఫో ! పొమ్ము! " అని మొహము త్రిప్పుకొనుచూ శివుడనెను.

" స్వామీ ! పోయిరమ్మని ఆనతివ్వు " డని ప్రార్థించిన దాక్షాయణి వైపు చూడకనే మరలా "ఫో! పొమ్మ" ని శివుడు పలికెను. చేయునది లేక దాక్షాయణి దక్షయజ్ఞ వాటికకు వెళ్ళెను. తల్లితండ్రులు గానీ, తోబుట్టువులుగానీ, దక్షునికి భయపడివచ్చిన దేవతలుగానీ తన్నాదరించలేదు. శివుని సతియని తెలిసియూ పలుకరించలేదు. జగత్పతియే తనకు పతియైననూ తనకు కలిగిన అవమాన భారమును దిగమింగుట ఆమెకు దుస్సాధ్యమయినది.

" తండ్రీ ! నా భర్త పరమేశ్వరుడని యెఱుంగియు ఆతనిని ఆహ్వానించక యజ్ఞము తలపెట్టినావు ! ఇప్పటికైనను మించిపోయినది లేదు ! వెళ్ళి నా భర్తను ఆశ్రయించి శరణాగతి పొందుము ! లేనిచో

నీకు జరిగెడి విపరీతములకు నీవే బాధ్యుడవు అగుదు" వని దాక్షాయణి పలికినది.

"హుం! పరమేశ్వరుడు! ఎవడు పరమేశ్వరుడు? పాములను అలంకరించుకొని, స్మశానమందు సంచరించి బూడిద పూసికొనుచూ, ఏనుగు చర్మము పులిచర్మము చుట్టుకొనుచూ, ఎగుడు దిగుడు కన్నులు కలిగిన ఆ వికారియా పరమేశ్వరుడు? చాలుచాలునీ అనవసర ప్రలాపములు! పిలువని పేరంటమునకు వచ్చిన దానవు! అయినా నిన్ను అనియేమి ప్రయోజనమున్నది? ఆహ్వానము తనకు లేదని తెలిసియూ నిన్ను పంపి తన్ను ఆహ్వానించుటకు నిన్ను నియోగించిన నీ భర్తకు సిగ్గులేకపోతే నీకైనా సిగ్గులేదా? నీతో వృథా ప్రసంగము నాకేల? నేను చేయుచున్న యీ నిరీశ్వరయాగమునుండి మరొశివుని పుట్టించెదను! అప్పుడు తెలియగలదు. నా మహిమ! పొమ్మ" అని మిగుల తూష్ణీభావముతో దాక్షాయణిని తిరస్కరించి మాట్లాడెను.

దక్షప్రలాపములతో సతీదేవి "శివశివా!" యని చెవులు మూసికొనెను. క్రోధావేశముతో దుఃఖము వెల్లుబికినది. "ఓ దేవతలారా! పరమేశ్వరునికి మన్ననలేని యీ యాగమునకు వచ్చిన మిమ్ములను యిదే శపించుచున్నాను. మీకు సంతానము కలుగకుండా పోవుగాక! ఈ యాగశాల భగ్నమై పోవుగాక!" అని పలికి తన యోగశక్తితో యోగాగ్నిని సృష్టించుకొని అందులో తన శరీరమును బూడిద కావించుకొనినది (స్థూలశరీరము నశించినను సూక్ష్మ శరీరము నాశనము లేనిది కదా!)

కైలాసమందలి పరమశివునికి దక్షయజ్ఞ వాటికలో జరిగినదంతయూ తెలిసి ప్రళయరుద్రుడాయెను. కైలాసగిరులు తల్లడిల్లునటుల ప్రళయ తాండవమొనరింపగా, సమస్తలోకములలోని వారు భయపడిరి. సముద్రములన్నీ ఉవ్వెత్తున పొంగినవి. భూలోకములోని ప్రజలకు జరుగునదేదో తెలియకపోగా భయపడి పరుగెత్తసాగిరి. అడవులలోని జంతుజాలమంతయూ కంగారుపడి అటుయిటూ పరుగెత్తసాగినవి.

రుద్రతాండవ మొనరించిన నటరాజు కోపముతో తన జటాజూట మునుండి ఒక జటను పెకలించి క్రిందికి కొట్టగా అందుండి 'వీరభద్రుడు ఉదయించెను.

''వీరభద్రా! దక్షయాగమును ధ్వంస మొనరింపుము! దక్షుని మదమణచిర''మ్మని శాసించెను. వీరభద్రుడు శివాజ్ఞబడసి వెంటనే దక్షయాగశాలను చేరెను. వీరావేశముతో యాగశాలనంతటిని భీభస్మ మొనరించెను. దేవతలందరినీ చావగొట్టెను. దేవతలలో కొందరికి కళ్ళు పోయినవి. కొందరికి కాళ్ళు తెగినవి, చెతులు నరకబడినవి. మరి కొందరికి నడుములు విరిగినవి. ఇలా అందరికీ అంగవిహీనమై అక్కడ నుండి పరుగిడుచూ కైలాసము చేరిరి. మహాదేవుని పలువిధములుగా స్తుతించి శరణాగతి నొందిరి. శంభుడు వారియందు దయార్ద్ర చిత్తుడై వారి అంగవిహీనతను పాగొట్టి పంపెను.

దక్షయాగశాలతయూ వీరభద్రుని వీర విహారముతో నాశనమై కాలి కొబ్బరికాయ రూపముతోనూ, అందు త్రినేత్రములు ఏర్పడగా బూడిదయైమిగిలినది. వీరభద్రుడు దక్షప్రజపతి తలను నరికి యాగగుండములో పడవైచెను. ఇదితెలిసిన బ్రహ్మ, విష్ణ్వాది దేవతలు కైలాసముచేరిరి. పరమశివునితో దక్షుని తప్పిదమును మన్నించి పునరుజ్జీవుని చేయమని ప్రార్థించిరి. శాంతచిత్తుడయిన భోళాశంకరుడు దక్షుని మొండెమునకు 'గొర్రె' తలను అమర్చి ప్రాణము పోయుటకు అనుమతించగా దక్షుడు 'అజముఖుడ' నే పేరు కలిగినవాడై చేసిన తప్పును మన్నించమని కైలాసవాసుని వేడుకొనెను.

మరొ శివుని సృష్టింప సంకల్పించి మొదలు పెట్టిన దక్షయజ్ఞము కొబ్బరికాయగా ఏర్పడినది. అందు శివునికున్న విధముగా మూడు కన్నులు కలిగినవి అది మొదలు కొబ్బరికాయను ఏ దేవుని తలంచికొట్టి ననూ అది శివప్రతిరూపముగా మూడు కన్నులు కలదైన కారణాన అది శివునికే అర్పితమగుచున్నది. అనగా సర్వదేవతా స్వరూపములకు చేయు ఆరాధనలన్నీ పరమ పావన మంగళరూపుడైన లోకేశ్వరునికి చెందునని యీ కొబ్బరికాయ వృదంతము మనకు తెలియజేయుచున్నది.

ఈ వృత్తాంతము నుండి పాఠకులు గ్రహింపదగినదేమనగా 'దక్షప్రజాపతి' వంటివాడు గర్వించిన కారణాన, తలకెక్కిన మదాంధత (తల) తెగినదై, గొర్రె తలతో సరిపెట్టుకొనవలసి వచ్చినది. అలాగే గర్వాంధులై దైవమహిమను తిరస్కరించు వారికి గర్వభంగమగునని గ్రహింపనగును.

శ్రీ స్కాందపురాణ మందు 'దక్షయజ్ఞకాండము' చివరిన చెప్ప బడినది. కానీ కథాక్రమములో ముందుగా చెప్పనగానీ 'గిరిజా కళ్యా ణము'ను చెప్పుటకు అనువుగా వుండునని ముందుగా చెప్పుకొన్నాము. దక్షయజ్ఞగాథ నుండి తెలిసికొనదగిన విషయములు మూడు .

ఒకటి : పెద్దలకు అహ్వానమున్నచోటికే పిన్నలు పోవలెను.

రెండు : భర్త యాజ్ఞతోనే పుట్టింటికైననూ స్త్రీలు పోవలెను.

మూడు : గర్వము తలకెక్కినవారికి భంగపాటు తప్పదు.

శ్రీ స్కాందపురాణమందు దక్షకాండము ముందుగా చెప్పవలసి రాగా, కుమార సంభవ, అసుర, మహేంద్ర, యుద్ధ, దేవ కాండములను వరుసగా చెప్పకొనెదము!

శ్రీ సుబ్రమణ్యేశ్వరుని కటాక్ష ఫలసిద్ధిరస్తు!

* * * *

## కై లా స ము

దాక్షాయణి యోగాగ్నిలో తన శరీరాన్ని దహించింది. ఇది తెలిసిన శంకరుడు ప్రళయ తాండవము చేసినాడు. సకల లోకములు తల్లడిల్లినవి సముద్రములు ఉవ్వెత్తుసలేచి అల్లకల్లోల మొనర్చినవి. అడవులలో జంతుజాలము భయపడి దిక్కుతోచక పరుగిడుచుండగా, ఇంద్రాది దేవతలు, బ్రహ్మదేవుడు, నారాయణుడు మొదలైనవారు శివతాండవము యొక్క ఫలితములను చూచి శోకతప్తులైనారు.

బ్రహ్మ, విష్ణు, ఇంద్రుడు మొదలైన వారందరూ కైలాసమునకు వెళ్ళి శివుని అనేక విధాల స్తుతించినారు. 'నటరాజు' శా తించినాడు.

"దేవతలారా! సతీదేవి నా ఆజ్ఞమీరి దక్షయజ్ఞానికి వెళ్ళింది. ఆదరణ లేనిచోటికి వెళ్ళినందువల్ల అవమాన భారంతో దాక్షాయణి దగ్ధమైపోయింది. ఆమెను సత్కరించి గౌరవించని దక్షునికి గొర్రెతల మిగిలినది దక్షయజ్ఞానికి వెళ్ళిన దేవతలందరికీ సంతానము కలుగ రాదని దాక్షాయణి శపించింది. ఇప్పుడు దాక్షాయణి లేదు. నా యందు భక్తి శ్రద్ధలు గలిగి మానస సరోవరమందు తపమాచరించుచున్న హిమవంతునికి ఆమె జన్మించనున్నది. తపమానరించుచున్న పర్వత రాజుకు, అతని యిల్లాలు మేనక శుశ్రూషలు చేయుచున్నది. మానస సరోవరమందు నీలోత్పల పుష్పమందు 'పార్వతి'గా ఉదయించుచున్న నా సతీదేవి మేనక స్తన్యమిచ్చి, పెంచి, పెద్దచేసిన తరువాత ఆమె మరలా పూర్వజన్మ బాంధవ్యముతో నాయందు ప్రేమానురాగాలు కలిగినదై, నన్నే ధ్యానించుచూ, తపమాచరించి నన్ను వరించనున్నది. అంత వరకు నేను 'దక్షిణామూర్తి' నై మర్రిచెట్టునీడలో కూర్చొని చిన్ముద్ర దాల్చి యుండెదను. మీరు మీమీ లోకాలకు పొయిరండి అని శంకరుడు అందరికీ వీడ్కోలిచ్చినాడు. శివుడు శాంతించినందున సకల లోకములు యధావిధిగా కాలచక్రమునందు గ్రహగతులు తప్పకుండా నడచు చుండుట చూచి, సంతోషముతో దేవతలు తమ తమ లోకములకునేగిరి.

దేవతలతో శివుడు చెప్పిన విధంగానె మానస సరోవరంలో నీలోత్పల పుష్పమందు 'శక్తి' వుదయించింది. ఘోర తపమాచరించు చుండిన పర్వతరాజు అదిచూచి సంతోషభరితుడై, ఆమెను తన చేతులలో తీసికొని, మేనకకు అందించినాడు. పులకాంకితయైన మేనక ఉరోజము లలో అప్పటికప్పుడే క్షీరాభివృద్ధి ఏర్పడి పుప్పొంగినది. మేనక తపః ఫలితం వల్ల "మహాశక్తి" ఆమెకు పుత్రికయైనది. మేనక పాలివ్వగా 'మహదేవి' కడుపారా గ్రోలినది. దేవతలు పూలవృష్టి కురిపించిరి. గంధర్వులు పాడిరి. అప్సరసలు నాట్యమాడిరి. దేవదుందుభులు మ్రోగినవి.

హిమవంతుని మరోపేరు పర్వతరాజు. హిమవంతుని కుమార్తెగా హైమావతి యనిపించుకొని ఆమెయే 'పార్వతి' యని పిలుబడినది.

లోకమాతయైన పార్వతికి మేనక తల్లియైనది. మేనక హిమవంతుల భాగ్య భాగ్యమేమని అందరూ వేనోళ్ళ కొనయాడరి.

పార్వతి దినదిన ప్రవర్ధమానముతో షోడశ కళలతో పెరుగుచున్నది. అంతఃపురములో ఉన్నా, ఉద్యానవనంలో చెలికత్తెలతో తాను ఉన్నా, 'శివలింగము' నే పూజించుచూ, 'శివలింగము' తోనే ఆజలాడుకొనుచూ, మైమఱచి సదా 'సదాశివుని' యందే నిమగ్నమైనది.

పార్వతీ దేవికి అయిదేళ్ళు నిండగానే తపమాచరించవలెనని సంకల్పము కలిగి తన తండ్రి అనుమతిని కోరినది. పర్వతరాజు వల్లె యనగానే, తగు పూజాద్రవ్యములతోనూ, తపమాచరించునపుడు తనకు ధ్యానభంగము కాకుండా జాగ్రత్తలు తీసికొనుచూ తనకు సేవలు చేసే చెలికత్తెలతోనూ హిమవత్పర్వత సానువులకేగినది.

అట్టి తరుణంలో సనక సనందాదులకు శంకరుడు 'పశువు' 'పతి' 'పాశము' అనే మూడు తత్త్వాలను వేదరహస్యముగా చిన్ముద్ర ద్వారా నిరూపించు చున్నాడు.

అది శంకరాచార్యుల వారి ప్రౌఢరచనల్లో "దక్షిణామూర్తి" స్తోత్రం ఎంతో ప్రాముఖ్యత పొందినది. శంకర భగవత్పాదుల వారి అద్వైత సారమంతా యీ స్తోత్రంలో మనకు అవగతమవుతుంది.

దక్షిణామూర్తి అనే పదాన్ని దక్షిణ + అమూర్తి అని విడదీస్తే ప్రసన్నమైన నిరాకార బ్రహ్మమని అర్థం.

దక్షిణ + మూర్తి అని విడదీస్తే ప్రసన్నమైన సాకారమూర్తి అని అర్థం.

ఆయనకు నిరాకారమూ, సాకారమూ, రెండూ వున్నవి. దక్షిణాభిముఖంగా ఆయన కూర్చొన్నందున ' దక్షిణామూర్తి ' అని కూడా పిలువబడుచున్నాడు. దక్షిణదిశకు 'యముడు' అధిపతి. యమునికి అధిదేవత 'రుద్రుడు' యముడు ధర్మము తప్పక పాపులను శిక్షించి వారిని

పునీతులుగా చేసి వారి పునర్జన్మకు తోడ్పడు చున్నాడు. కానీ మానవ జన్మనెత్తిన జీవాత్మలు తిరిగీ పాపకూపంలోనే పడి తిరిగీ యముని బారినుండి తపించుకొన లేకున్నవి. అందువల్ల 'యముని' చేతపడక దక్షిణామూర్తి ఆశ్రయించి మనం విముక్తులు కావాలి. అందుకు సహాకారమైనా నిరాకారమైనా రెండూ ఒక్కటే. మనస్సును నిగ్రహించి ఆత్మానందము పొందాలంటే ఏది ఆచరించినా గమ్యమొక్కటే. మాటలకతీతమైన మౌనముతోనే 'దక్షిణామూర్తి' సనకాదులకు జ్ఞానోపదేశము గావించినాడు.

మౌనవాఖ్య : నిరాకారము, నిర్గుణము అయిన పరబ్రహ్మన్ని ఎవరు వర్ణించ గలరు? నిశ్శబ్దమై అందుకు సరియైన వర్ణన! మౌనవ్రతావలంబులైన వారే 'ముని' లగుచున్నారు. మౌనం వల్ల అనేక మైనవి సాదింపవచ్చును. అందువల్లనే గృహస్థులైనవారు కొందరు వారంలో ఒక్కనాడు పూర్తిగా మౌనం పాటించి, ఆత్మబలం పొందటానికి కృషిచేస్తారు. మాటలుడిగిన చోట మిగిలేది బ్రహ్మమే. వ్యక్తమూ, అవ్యక్తమూ అయిన మౌనము విలక్షణమైన 'వ్యక్తి' త్వాన్ని సూచించగలదు. తనకు తెలిసిన మంచి విషయాలను యితరులకు వ్యక్తం చేయడమే వ్యక్తత్వం. ఇది తాకకపరమైనా కావచ్చు. అలౌకిక పరంగా కూడా 'వ్యక్తం' చేయవచ్చు. కాబట్టి మౌనమూ, వ్యాఖ్యరెండూ కలిసి బ్రహ్మ తత్త్వాన్ని నిరూపిస్తాయి.

అంతర్ముఖం : దీనినే Perception అంటారు. "వర్షిష్ఠ అంతేవసత్ " అంటే అంతర్ముఖ దృష్టిని పొందే అనుభవజ్ఞులను అన్వేయించుకోవచ్చును. వాళ్లైఋషులు. తక్కినవారు తప్పక 'భుక్తి' కోసం చేరేవారే. వారికి'యముని' సన్నిధియే పెన్నిధియై మరలా మరలా మరలా పుడుతూ గిడుతూ వుంటారు. బాధగురులై శిష్యులను పెడత్రోవ పట్టించే వారికి నరకమే సన్నిధి!

ఆచార్యేంద్రుడు : ఇంద్రియ నిగ్రహము కలిగి, శిష్యులలో ఆచరణ చేయించి, జ్ఞానమార్గంలో నడిపించేవాడే నిజమైన గురువు. వీరినే 'బోధగురువు'లని చెప్పుకోవచ్చు. శిష్యుల మోహమును క్షయమొనరించి

మోక్షము ప్రసాదించువాడే "బోధగురువు". తతిమా వారంతా బాధ గురువులే! ఆచరణలో లేని వేదాంతంవల్ల ప్రయోజనమేమున్నది?

నిజమైన బ్రహ్మ విద్య గఱపే గురువులను ఇప్పుడు వ్రేళ్ళమీద లెక్కబెట్టుకోవచ్చు. గురుస్థానంలో వుండేందుకు ఎంతో క్రమశిక్షణా, స్థితప్రజ్ఞతా, సహనమూ, సహజీవనసరళి మొదలైన సుగుణాలువుండాలి అప్పుడే "ఆచార్యు"డవుతాడు. తాను ఆచరించి చూపువాడే 'ఆచార్యు' డని అర్థం. (గురుకులవిద్య) ఆచరణ యోగ్యమైనదే వేదాంతము. ఆచరించినవాడే వేదాంతి.

## శివుడు 'దక్షిణామూర్తి'యై దాల్చిన చిన్ముద్ర

చూపుడు వ్రేలిని బొటన వ్రేలికి తాకించి గుండ్రంగా వుంచి, తక్కిన మూడు వ్రేళ్ళను కలిపి వుంచడం చిన్ముద్ర. ఈ మూడు వ్రేళ్ళు ఊర్ధ్వముఖంగా నిలిపి వుంచడం యొక్క పరమార్థం. 'పరమాత్మ'ను చేరుకోవడానికి త్రిగుణాతీతమైన సంస్కారము మూల మని తెలిసికోవాలి. అంటే సత్త్వ, రజో, తమోగుణాలకన్నా అతీతమైనది 'బ్రహ్మ'మని, చిన్ముద్రద్వారా గ్రహించుకోవచ్చును. ఆత్మ, పరమాత్మ సంయోగమే బొటనవ్రేలిని చూపుడు వ్రేలియొక్క మూడవ కణుపు నందు తాకుట యొక్క పరమార్థము. చూపుడు వ్రేలితో మంచినీ, చెడునూ ఎత్తిచూపడం రివాజు. ఇది మానడం వల్ల మానవుడు మను నీతిని పాటించు నిజమైన మానవుడగుచున్నాడు.

త్రిగుణాత్మకమైన లోకాన్ని అవల వుంచుటా అహంకారాన్ని పరబ్రహ్మంతో కలపడమే పూర్ణత్వం. ఇది సద్గుణాలని తపించడమే తపస్సు.

చిన్ముద్ర మహాత్మ్యాలు చూపెవి. శబరిగిరిపై వెలసి, భక్త కోటిని ఆకర్షించుచున్న భూతనాథుడైన శ్రీ అయ్యప్పస్వామి చూపేది కూడా చిన్ముద్రయే. జీవుడు తనలో లయమైనప్పుడు మిగిలేది సంపూర్ణమగు

పరిశుద్ధమైన చైతన్యము. రెండూ తానేనని నిరూపిస్తారు శ్రీదక్షిణామూర్తి అలాగే అయ్యప్పస్వామియున్నూ. మనోవాక్కాయములతో సకలమైన కర్మలను ఒక్కటిగా భావించి వ్యక్తిత్వాన్ని పొంది, అహంకారాన్ని భగవదర్పణం చేసే విధానమే సాధనాముద్ర. ఇది శివ్యునిది.

ఆత్మలో రమించేవారు ఎల్లప్పుడూ ప్రసన్న వదనంతో వుంటారు. దుఃఖం అనేది వారి దరిదాపులకు రాదు.

ఓంకారరూపుడు, ఓంకారానికి తాత్పర్యమైనవాడు. ఏక శుద్ధాత్మ జ్ఞానమే రూపంగా గలిగి, మచ్చలేక ప్రపూర్ణ శాంతి సౌభాగ్యములతో విరాజిల్లువాడే దక్షిణామూర్తి. అందుకే ఆయన జగదీశుడూ, జగద్గురువూ అగుచున్నాడు.

ఓంకారమే తారకబ్రహ్మం. ఇది పరమాత్మ పరమాత్మయే. 'ఓం'కారనాదము.

ఈ లోకంలో సకలమూ ఆత్మయేనని ప్రబోధించువాడు దక్షిణా మూర్తి. దానిని అర్థం చేసికొని, ధ్యాన సంకీర్తనాదులు చేసేవాడికి ఈశ్వరత్వం సులువుగా లభిస్తుంది. ఈ 'శావ్యాసోపనిషత్' ఇదే చెప్పు చున్నది. అందరికీ సర్వాత్మత్వం కలగాలనేదే యీ రచయిత ఆకాంక్ష. ఆ ఉద్దేశ్యంతోనే కైలాసమందు మర్రిచెట్టు క్రింద అమరిన శ్రీదక్షిణా మూర్తి యొక్క సాకార, నిరాకార తత్త్వజ్ఞానాన్ని నాకు తెలిసినంత వరకు, నాఆత్మకు తోచినంతమేరకు మీముందు వుంచినాను. ఈ 'నేను' అనేది 'వాడే' 'వాడే' 'నేను' ఇక 'మీరు' 'నేను' కాదా? 'నేను' 'మీరు' కాదా? ఈ అద్వైతాన్నే ఆదిశంకరులు మనకు ఇచ్చారు.

ఇక అసలు కథలోనికి వస్తాను. కృపామూర్తియైన శ్రీ దక్షిణా మూర్తి నుండి సనకసనందాదులూ చిన్ముద్ర ద్వారా సకల వేదాంత రహస్యములను తెలిసికొని ధన్యులయినారు.

ఈశ్వరుడు వీరికి జ్ఞానోపదేశము గావించుటకు ముందు నందీశ్వ రుని చూచి, "నందీ! సనకాది మునులకు నేను జ్ఞానమార్గము చూపు

తరుణంలో, నన్ను చూడవచ్చు మన్మధుని తప్ప, వేరెవ్వరినీ లోపలికి అనుమతించ వద్దు! " అని ఆదేశించాడు. శివాజ్ఞ మేరకు నంది కైలాస మందిరానికి వెలుపల కాపలాగా వుంటూ ఎవ్వరినీ అనుమతించ కుండా అప్రమత్తంగా ఉన్నాడు.

## దేవతల ఆగమనం

అట్టి సమయాన శూరపద్మడనే రాక్షసుడు పెట్టే బాధలకు తట్టుకోలేక, గడగడా వణకుచూ దిక్కుతోచక పారిపోతున్న దేవతలు "ఈశ్వరా నీవే దిక్కు"ని కైలాసం చేరారు. ఉరుకులిడుతూ మహాదేవుని సందర్శనార్థము వచ్చిన దేవతలకు నందీశ్వరుని అనుమతి లభించలేదు 'ఈశ్వరాజ్ఞలేదని' వారిని అవలనే వుండమన్నాడు నంది.

సకల జీవరాసులకు మూలపురుషుడైన సాంబశివుడు, అంబలేని శివుడైనందున, సృష్టి సక్రమముగా జరగుట నిలిచిపోయినది. దంపతులలో రామబాణాన్ని నాటే మన్మధునికి యిప్పుడు పని లేదు. లైంగిక వాంఛ ఎక్కడా ఏ జీవజాలంలోనూ కానరాలేదు. "ప్రకృతి" స్వరూపమైన అంబ "పురుష" స్వరూపుడైన శివుని నుండి దూరమై హిమాలయ పర్వత సానువులలో శివుని చేరాలని తపస్సు ప్రారంభించింది జ్ఞాననిష్ఠలో కూర్చొన్న పరమశివుని చూడటానికి దేవతలకు వీలులేకున్నది శూరపద్మాసురుని బారి నుండి తాము తప్పించుకోవడానికి కైలాసమె సిరియైన చోటని దేవతలందరూ అక్కడే తలదాచుకున్నారు. దేవ బృహస్పతి దేవతలను తోడ్కొని బ్రహ్మదేవునికడకేగి నమస్కరించి యిలా చెప్పాడు :

"పద్మోద్భవా! నలువా! చతుర్ముఖా! సత్యలోకాధిపతి! తారకాసురుడూ, వాడి సోదరులైన సింహముఖుడూ, శూరపద్ముడు. వీరు ముగ్వురూ లోకభీకరులై కంటక ప్రాయులైనారు. వీరి ఆగడములు మితిమీరిపోవుచున్నవి. దేవతలు స్థానభ్రంశులై అలమటించుచున్నారు. కశ్యపునికీ, మాయాదేవికి జన్మించిన యీ అసురులలో శూరపద్మునికి పరమేశ్వర ప్రభావం వల్ల వెయ్యిన్ని ఎనిమిది అండములను పరిపాలించే అర్హత కలిగినది.

వాడు దురహంకార పూరితుడై, ఇంద్రాది దేవతలను రణరంగ మున ఓడించి, వారిని తన బానిసలుగా చేసికొనినాడు. ఈ రాక్షస సోదరులను నిర్మూలించి దేవతలను కాపాడుటకు తామే తరుణో పాయాన్ని సెలవీయ కోరుతున్నాను అని ప్రార్థించాడు బ్రహ్మదేవుడు వారిని ఆశ్వాసపఱచి వైకుంఠునికి తీసికొని వెళ్ళినాడు.

"రాక్షసులను అణచి దేవతలను కాపాడే జగద్రక్షకా! నారాయణా! కనికరంలేని శూరపద్మునిని నుండి మమ్మల్ని బ్రోచి రక్షించ శరణు కోరుచున్నా" మని వైకుంఠుని పలు విధాల స్తుతించినాడు బ్రహ్మదేవుడు

తదుపరి నారాయణుడు బ్రహ్మాది దేవతలను తోడ్కొని కైలాస గిరికి వచ్చి ఈశ్వరుని ఎన్నోవిధాలుగా స్తుతించి కీర్తించగా, పరమశివుడు వారియందు కరుణార్ద్ర హృదయుడై, "సృష్టి, స్థితి కారకులైన ఓ బ్రహ్మ విష్ణుమూర్తులారా! దేవతలు భయం వీడి వెళ్ళవచ్చును. మీకు కలిగిన విపత్తును నేను తొలగిస్తాను. ముందు నన్ను పిలువని దక్షయజ్ఞానికి యీ దేవతలు వెళ్ళిన కారణాన యిన్ని కష్టాలు పడుతున్నారు. నా ప్రతి రూపమైన 'కుమారుడు' ఉదయించి శూరపద్మాది రాక్షసులను సంహరించగలడు. అంత వరకు మీ కర్మ పరిపాకమునకు మీరు వ్యధ చెందక తప్పదు" అని చెప్పి అంతర్హితుడాయెను.

ఇక్కడ మనమొక్క విషయాన్ని మననం చేసికోవాలి. మన్మథుని తప్ప వేరెవ్వరిని గృహాంతర్భాగమునకు అనుమతించరాదని దక్షిణా మూర్తియైన శివుడు ఆజ్ఞ యిచ్చియున్నాడు. కానీ విష్ణువూ, బ్రహ్మాది దేవతలు తనని స్మరించి ప్రార్థించిన కారణాన భక్తవశంకరుడైన శంకరుడు వారికి దర్శనమిచ్చి, వారిని స్వాంతనమొనర్చి అదృశ్యుడై నాడు. సనక సనందాది ఋషులకు మాత్రం చిన్ముద్రధారియైన దక్షిణామూర్తిగా కన్పట్టుచునే యుండినాడు. ఇదియే శివలీల!

దేవతలు కైలాసము వదలి వెళ్ళినారు. కానీ వారికి ఒక సంశయము కలుగక పోలేదు. పార్వతీదేవి శివుని చేరాలని హిమాలయలో ఒకచోట తపమాచరించుచున్నది. మౌన నిష్టలో కైలాస మందిరంలో

శివుడువున్నాడు. వీరికి పరిణయమైనప్పుడు కదా కుమారుడు ఉదయించ గలడు! వీరి వివాహము జరుగునంత వరకు సమస్త జీవరాసులలో కామేచ్ఛ కలుగదు. మోహమూ, తాపమూ లేని జడత్వం ప్రపంచ మంతా ఆవరించియున్నది. స్త్రీ పురుషుల కలయికకు ప్రకృతి పురుషు లైన ఆది దంపతుల సమాగమమే కదా మూలము! కావున సాధ్యమై నంత శీఘ్రగతిన, పరమేశ్వరునికి పార్వతీదేవి యందు మోహనురాగాలు కలుగవలె! అందుకు మన్మథుడు పూనుకోవలె! వారి నడుమ రాగ మతిశయించగానే కుమార సంభవము జరుగవలె! ఆ కుమారుని మూలముగా శూరపద్ముని పీడ తొలగవలె! అంతవఱకూ మనము ఈ శూరపద్ముని నుండి తప్పించుకొని తిరగవలె! ఇదంతా కర్మ ఫలితము! శివునికి మన్నన లేనిచోటికి వెళ్ళినాము. కష్టాలను కొని తెచ్చుకొన్నామని" పరి పరి విధాలుగా దేవతలు వగచుచుండిరి.

## మన్మథుడు

బ్రహ్మ విష్ణువులు దేవతలతో సమావేశమైయుండిరి మన్మథుని తలంచుకొనగానే రతీదేవితో మన్మథుడు వారి ముందు ప్రత్యక్ష మయినాడు. దేవతలకు నమస్కరించినాడు. అప్పుడు బ్రహ్మదేవుడు మన్మథునితో," నీవు కైలాసానికి వెళ్ళి నీ పుష్పబాణాలను పరమశివునిపై ప్రయోగించు! శివుడు మౌనదీక్ష వీడి, పార్వతిపై మోహం పెంచుకొని, పార్వతిని తపస్సునుండి విరమింపజేసి పాణిగ్రహణం చేస్తాడు. తరువాత వారికి అద్భుతమైన 'కుమారుడు' కలుగుతాడు. ఆ బాలుని వల్ల శూరపద్ముడూ, వాని సోదరులైన తారకాసురుడూ, సింహముఖుడు నశిస్తారు. దేవతలకు బానిసత్వం పోయి వారు స్వాతంత్ర్యులై తిరిగి అమరావతి చేరుకుంటారు. ఇంద్రుని కుమారుడైన జయంతుడు శూరపద్ముని చెరలో ఉన్నాడు అప్పుడు జయంతుడు శచీదేవిని మరలా చూడగలుగుతాడు. ఇంత మహోపకారం నీవల్ల జరుగ వలసి యున్నది" అన్నాడు.

ఇది విన్న మన్మథుడు ఖిన్నుడైనాడు. "ఈశ్వరుడి మీద నాపుష్ప బాణప్రయోగమా? దేవతలందరిమీదా నా పూలశరాలు ప్రయోగించాను చివరికి నా తండ్రి నారాయణునిపై ప్రయోగించి యున్నాను. వీరి మీద నా ప్రతాపం చూపించగలనేమోగానీ దేవదేవుడైన మహాదేవుని మీద సాధ్యము కాదు! ఒక వేళ మీరు చెప్పినట్లే నేను చేయవలసి వస్తే నా ప్రాణాలు నావి అవుతాయా? సర్వశక్తిప్రదాత పరమేశ్వరుడు తన క్రోధాగ్నికి నన్నుబలి చేయడా?" అని బ్రహ్మదేవునితో మొరపెట్టుకున్నాడు

"నీవు చెప్పిందంతా సత్యమే! అయినా ఈ కార్య భారం నీవు వహించక తప్పదు! ఇది దైవఘటనగా భావించి నేను చెప్పినట్లు చెయ్యి! స్వలాభాపేక్ష లేని జీవితం అమృత ప్రాయమైనది! ఒకరికి ఉపయోగ పడని జీవితం ఉన్నా ఒక్కటే! లేకపోయినా ఒక్కటే! నీ త్యాగగుణం చరితార్థమవుతుంది! నీవల్ల పార్వతీపరమేశ్వరులకు కళ్యాణమవుతుంది! లోక భీకరుడైన శూరపద్ముడు అంతమవుతాడు. అందువల్ల ముక్కోటి దేవతలకు శుభం కలుగుతుంది. నా ఆజ్ఞ పాటించి వెళ్ళు. నీవు వెళ్లక పోతే దేవతల కార్యం నెరవేరదు. ఇంతగా చెపుతున్నా నీవు వినకపోతే నిన్ను నేను శపిస్తాను!" అన్నాడు బ్రహ్మదేవుడు.

అందుకు మన్మథుడు, "బ్రహ్మదేవా! నీకోపం కన్నా దేవదేవుని ముందుకు వెళ్ళి నశించడమే కృతార్థమవుతుంది. ఏది ఎలా జరగాలో అలాగే జరగనీ!" అన్నాడు. రతీదేవి భయంతో తన ప్రాణనాథుని కౌగలించుకొన్నది.

బ్రహ్మ అన్నాడు: "మదనా! మహాదేవుని కడకు నిన్ను పంపి మేము ఇక్కడే ఉంటామా? మేమంతా నీ వెంట వస్తాము. నీకు శుభం కలుగుతుంది. వెళ్ళు."

విధిలేక—చెఱకు విల్లు, పూలబాణాలు చేత ధరించిన మన్మథుడు బయలుదేరాడు. రతీదేవి —సమాయత్తమై రథంలో నిలబడింది. అదరుతున్న చేతులతో మన్మథుడు ఉంటె, పూలతీగెలాంటి రతీదేవి మెల్లమెల్లవడకు చుండగా—మన్మథ రథం కైలాసానికి చేరింది.

ఈశ్వరాజ్ఞ మేరకు నందీశ్వరుడు మన్మథుని కైలాసమందిర ప్రవేశాన్ని అడ్డగించకుండా వదలివేశాడు. కానీ వెంట వచ్చిన బ్రహ్మాది దేవతలను లోనికి పోనీయ లేదు. చేసేది లేక, దేవతలంతా బయట వుండిపోయారు. మన్మథుని తేరు మహేశ్వరుని చెంతకు చేరింది. సర్వేశ్వరుని కాముకుణ్ణి చేయాలని తన చేతిలోని చెఱుకు విల్లుపై పూలబాణాన్ని సంధించాడు రతిపతి. ఆ ద్వారా పశుపతి ఉమాపతి కావాలన్నదే ఆశయమైనా మన్మథ బాణం భూతపతియైన 'శివుణ్ణి' తాకగానే లిప్తకాలంలో చలించినట్లే నటించిన పరమశివుడు–మరోక్షణం లోనే తన మూడో నేత్రాన్ని కొద్దిగా తెఱచి మన్మథుని పైన దృష్టి సారించాడు.

రతిదేవి తుపానుకు కదలుతున్న ఎండుటాకులాగా వణకుతూ, గట్టిగా మన్మథుణ్ణి తన బాహువుల్లో బంధించి– మరణిస్తే సతీపతు లిద్దరూ ఒక్కసారిగానే మరణించాలని, కాని శివదృష్టియొక్క ప్రభావంతోమన్మథుడు మాత్రం భస్మీపటలమై పోయాడు. మన్మథుణ్ణి చుట్టూ పెనవేసిన రతీదేవి చేతులు అలాగే గాలిలో ఉండినట్లు నిలిచి పోయి తనముందు తన ప్రియుడు, తననాథుడు సర్వులలోనూ కామాగ్ని పుట్టించగలిగిన మదనుడు, తన సర్వస్వమూ అయినవాడు బూడిదై క్రింద పడివుండటం గుర్తించింది మన్మథసతి.

మన్మథుడు చావుకు తెగించే వచ్చాడు. త్రిపురాసుర భస్మము చేసిన వాడి చేతిలో తన ఆయువు మూడిందని, పూల శరం విడువక ముందే గ్రహించి అందుకు సిద్ధపడే వచ్చాడు. అలాగే చచ్చాడు. రతీదేవి భర్త వియోగం సహించలేక మూర్ఛిల్లింది. మూర్ఛ నుండి కాస్సేపటికి తేరుకుంది.

ఇది జరిగే సమయంలోనే మన్మథ బాణం వృథా పోకుండా పరమేశ్వరుని చెంతకు వెళ్ళినట్లే వెళ్ళి ఆయన్ను సమీపించే శక్తిలేక హిమవత్పర్వత సానువులకు అభిముఖంగా వెళ్ళి పార్వతీదేవిపై సమ్మోహనంగా పని చేసింది. ఆమెలో మోహాన్ని ప్రేరేపించింది.





పరమేశ్వరుడు ఇవన్నీ తెలియని వాడిలా ఎప్పటిలాగానే సనకాది ఋషులకు ఆత్మస్వరూప జ్ఞానాన్ని ఉపదేశించు భంగిమలోనే అమరి యున్నాడు.

రతీదేవి మూర్ఛ నుండి తేరుకోగానే పరమేశ్వరుని పతి భిక్ష కోరి విలపించింది. కన్నీరు మున్నీరుగా రోదిస్తున్న రతీదేవి యొక్క దుఃఖం శివుడు అప్పుడే తనకు తెలిసినట్లుగా ప్రవర్తించాడు. రతి యొక్క పరితాపాన్ని, ఆమె దీనావస్థను చూచిన ఈశ్వరుడు ఆమెపట్ల కరుణ బూనాడు.

"నారీమణీ! వ్యథ చెందకు. మన్మథుడు తాను ప్రయోగించే పుష్పబాణాల వల్లనే సృష్టి కార్యక్రమం జరుగుతున్నదని అదంతా తన ప్రతాపమేనని, అహంకారంతో ప్రవర్తించాడు. దేవతలు దక్షయజ్ఞానికి వెళ్ళి నా ఉన్నతిని విస్మరించినందువల్ల, వారి గర్వోన్నతిని పోగొట్టేందుకే శూరపద్మాదులకు వరమిచ్చినాను. అందువల్ల దేవతలు ఇప్పుడు పశ్చాత్తాపము చెంది నిర్మల మనస్కులైనారు. నీభర్తను మళ్ళీ బ్రతికించి నీకు ప్రసాదిస్తాను. కానీ కొంత కాలము నీవు సహనంతో నీ భర్తృ వియోగాన్ని భరించక తప్పదు. వేచియుండుము" అని రతీదేవిని ఆశ్వాస పరిచాడు శివాజ్ఞబొంది రతి నిష్క్రమించింది. జగదీశ్వరుడైన కైలాస వాసుడు నందిని తలిచాడు. వెంటనే నంది శివుడి ముందు నిలిచి ఆయనకు నమస్కరించి శివాజ్ఞకోసం చేతులు కట్టుకొని వినమ్రంగా నిలబడ్డాడు.

"నందీ! నాదర్శనం కోసం వేచియున్న చతుర్ముఖ పురుషోత్తమ ఇంద్రాదిదేవతలను వెంటనే ప్రవేశపెట్టు!" అని ఆనతిచ్చాడు. "వల్లె" యని నంది కైమోడ్చి, శివమందిరానికి వెలుపల వున్న దేవతలను తోడ్కొని శివసన్నిధికి తెచ్చాడు.

సర్వజ్ఞుడయ్యీ ఏమియు నెరంగని వాడి వలె, "బ్రహ్మవిష్ణు ఇంద్రాది దేవతలారా! మీరాకలోని విశేష మేమి? మీకు ఏమి కావలెను? "అని వారిని అడిగాడు.

"సర్వజ్ఞా! నీకు తెలియనిదేమున్నది? శూరపద్మసోదరత్రయా న్ధునుమాడి మమ్ములను కాపాడే కుమార జననము తమమూలముగా జరుగవలె, మీగురించి తపోదీక్షలో ఉంటున్న జగన్మాత పార్వతీ దేవిని, తాము శీఘ్రమే పరిణయమాడి, మమ్ములను రాక్షసుల బారినుండి రక్షింప మిక్కిలి ప్రార్థించు వారము" అని సవినయంగా కైమోడ్చితాము వచ్చిన పనిని సర్వేశ్వరునితో విన్నవించారు.

దేవతలతో శివుడిలా అన్నాడు: "మీకోరిక తప్పక నెరవేరుతుంది. మరికొంతకాలం మీరు వేచియుండండిఅని చెప్పి దేవతలను పంపివేశాడు

తర్వాత సనకసనందాది మునిశ్రేష్ఠులను చూచి "మీరు యిదే మనః ప్రవృత్తితో ధ్యాన నిమగ్నులైయుండండి దేవకార్య నిమిత్తం నేను వెడుతున్నాను" అని సెలవిచ్చి అదృశ్యుడయ్యాడు.

## పార్వతీ కళ్యాణము

### : వృద్ధవేషధారిగా శివుడు :

జగదీశ్వరి జగదీశ్వరుని ధ్యానిస్తూ తపోదీక్షలో వున్నది. పార్వతీ దేవి తపస్సుకు భంగం రాకుండా పర్వతరాజుచే నియోగింపబడిన చెలికత్తెలు ఆమెకు సపర్యలు చేస్తూ, ఆమెకు కావలసిన పూజాద్రవ్య ములు ఎప్పటికప్పుడు సమకూరుస్తున్నారు.

మహేశ్వరుడు మహేశ్వరి తపోమహిమను పరీక్షించాలనుకొన్నాడు సుందరేశ్వరుడైన కైలాసపతి వృద్ధరూపం ధరించాడు. మెల్లగా పార్వతీదేవి ఆశ్రమం సమీపించాడు. ఆమె పర్ణశాలకు చేరువగా తచ్చాడుతున్న ఆ పండు ముసలివానిని పార్వతీదేవి చూచింది. కొందరికి శివప్రసాదం యిచ్చి పంపివేశాక, వృద్ధరూపధారియైన మహేశ్వరుని ఆదరంతో ఆహ్వానించింది అపర్ణ.

"దేవీ! తరుణ వయస్కురాలివైన నువ్వు తపస్సు చేయడం నిజంగా అవసరమైందా? ఏమికోరి ఈ తపస్సు చేస్తున్నావు? నీకు చెప్పాలని తోస్తే ఆ వివరం నాతో చెప్పు" అని గిరిజను అడిగాడు గిరీశుడు. పర్వతరాజ పుత్రి తన తపః కారణాన్ని చెప్పమన్నట్లు సైగలతో తన చెలికత్తెలను ఆదేశించింది.

"ఈ తరుణీమణి హిమవంతుని ముద్దుల గారాలపట్టి సకల గుణఖనియైన యీ సౌందర్యమూర్తి జగద్రక్షకుడైన పరమేశ్వరుని తన భర్తగా పొందాలని తపమాచరించుచున్నది," అని జయ, విజయ అనే యిద్దరు చెలికత్తెలు సర్వేశ్వరునితో అన్నారు.

వారి సమాధానం విని వృద్ధుడు విలాసంగా నవ్వాడు. "ఈ పర్వత రాజ పుత్రియైన పార్వతి అందానికే అర్థం చెప్పగల లావణ్య! అయితే ఈమె కోరుతున్నదేమోదేనికో కొరగాని నాగభూషణుణ్ణి! పార్వతీ! ఎందుకు ఇలాంటి వాణ్ణి భర్తగా కోరుతావు? పాముల్ని ఆభరణాలుగా ధరించి, ఏనుగు చర్మాన్ని వస్త్రంగా ధరించినవాడు, జటాజూటధారియైన వాడు, మంచుకొండయిన కైలాసంలో నివసించేవాడా నీకు భర్త? అంతకన్నా సుందరాకారుడు వేరెవ్వరు నీకు కన్పించలేదా? ఎల్లవేళలా భూతప్రేత ప్రమద గణముల సంచరిస్తూ, స్మశాన మందలి బూడిద పూసికొని సంచరించే వాడినా నీ భర్తగా కోరుకొన్నావు? రుద్రమూర్తియైన పురుషుణ్ణి చూచి ఏ జవ్వనీ తన భర్తగా కోరుకోదు! అలాంటిది తెలియని తనంతో నువ్వు ఆ భూతపతిని పతిగాకోరి, తపస్సుకు ఉపక్రమించావు! ఇప్పటికైనా మించిపోయింది ఏమీలేదు! వెంటనే నీ తపస్సు చాలించి అంతఃపురభోగాల్ని అనుభవించు ఇంతటి సౌందర్యరాశివైన నిన్ను చూస్తుంటే నాకు దుఃఖం కలుగుతోంది. కారణం నీకు తగినవాణ్ణి నీవు పొందాలనుకొంటున్నావు" అన్నాడు. ఆ తర్వాత చెలికత్తెలను చూచి యిలాఅన్నాడు శివుడు. "పార్వతి సఖియలారా! మీ నాయకురాలైన యీ పార్వతీదేవి నిర్ణయం సరియైనదికాదని ముందుగా ఎందుకు నివారించలేక పోయారు? నన్ను బాగా చూడండి! నేను చూడ్డానికి వృద్ధుడినే. కానీ తపః ఫలితం అద్వితీయమైనది! అందువల్ల నాకు లయంలేదు!

లయం లేని వాడికి జరామరణాలు లేవు! నిత్యయవ్వనం నా సొత్తు! అందుకనే కోరుతున్నాను మీ గిరిజ పొత్తు" అంటూ చిద్విలాసంగా నవ్వాడు,

ఉమాదేవికి శివనింద చేసే వృద్ధుణ్ణి చూస్తే అరికాలిమంట నెత్తికెక్కినట్లుంది. "శివ శివ" అంటూ తన రెండు చెవుల్ని గట్టిగా మూసికొన్నది.

ఉమానాథుడు ఇహ తను పెట్టే పరీక్షచాలనుకున్నాడు. ఉమాదేవి నిశ్చల భక్తివిశ్వాసములు శంకరుణ్ణి ముగ్ధుణ్ణి చేసింది. తాను పెట్టిన పరీక్షలో పార్వతి నెగ్గిందని సంతోషించి, తన నిజరూపాన్ని చూపాడు. పార్వతి తన యెదుట నిలబడ్డ తన ఆరాధ్యదైవాన్ని చూచింది ఆమెకు మాటలే కరువయ్యింది. పూర్వజన్మ బంధంవల్ల తనకు శంకరుడు సన్నిహితుడని ఆమె అంతరంగం చెబుతున్నది జగదంబను చూచి యిలా అన్నాడు శివుడు. "సర్వశోభాయమానమైన ఓ సుందరీ! వెలుగుకే వెలుగునిచ్చే నీ అందంతో బాటు, నీ మానసిక సౌందర్యం నీ తపశ్శక్తి వల్ల ఇనుమడించినదై నన్ను సంతోషంలో ముంచెత్తుచున్నది. నీ తపః కారణంబేమో చెప్పు! నీకు కోరిన వరాలిస్తాను" అన్నాడు. ఆమె ఏమి కోరి తపస్సు చేసినదో తెలియక అలా అడగలేదు. శంభునాథుడు ఆమె మృదు భాషణం కోరి అలా అడిగాడు.

పార్వతీ దేవి సంతోషం చెప్పనలవి కానిది. ఆమె హృదయం ఆనంద డోలిక లూగినవి. తన ప్రాణనాథుడు తన యెదుటే వున్నాడు యిప్పుడు. ముందుగా తన భక్తిశ్రద్ధలు అయనకు చూపాలి. ఈలోగా అయనతో తన కోరికల్ని వెల్లడించేందుకు తన గొంతు తోడ్పడాలి. అనుకుంది. వెంటనే కైంమోడ్చింది. మహాదేవుని స్తుతించడం కోసం గొంతు సవరించుకొన్నది.

"మహదేవా! నన్ను స్వీకరించు! నీవు వినామరేదీ నాకు ప్రియం కాదు! నన్ను నీదాన్నిగా చేసికో! ఇదే నేను త్రికరణశుద్ధిగా నిన్ను కోర

వరం స్వామీ!" అంటూ ఆయన పాదపద్మాలపై తలవాల్చి మ్రొక్కింది.

"కళ్యాణీ! నీతోనే నాకళ్యాణం జరుగుతుంది! నీ తల్లిదండ్రులతో మాట్లాడి మన వివాహం జరిపేందుకు సనకసనందాది ఋషు లను పంపుతాను! "అని పరమేశ్వరుడు పార్వతీదేవికి అభయమిచ్చి అంతర్ధి తుడాయెను.

## వివాహ ప్రయత్నం

పరమేశ్వరుడు కైలాసం చేరాడు. నందిని పంపి సనక సనందా దులను రప్పించాడు. వారు మహేశ్వరునికి దండప్రణామములర్పించారు ఉచితాసనాలు అలంకరించారు.

"సనక సనందాదులారా! అసురులైన శూరపద్మ, తారకాసుర, సింహముఖుల పాపకృత్యములు ఫలించుచున్నవి. వారికి నేనిచ్చిన వరాలను సద్వినియోగం చేయక, ఇంద్రాదులను క్షోభ పెట్టుచున్నారు. వారిని నిర్మూలించే శక్తిమంతుడైన కుమారుడుసంభవం ఆసన్నమయింది. దేవసేనాధిపత్యం వహించే నిమిత్తం సుబ్రహ్మణ్యుడు నానుండి ఉద్భవిస్తాడు. ఎవ్వరూ సమీపించ నలవిగాని వరబలగర్వోన్మత్తులైన శూరపద్మసోదరత్రయాన్ని నాకుమారుడు సంహరిస్తాడు.

పర్వతరాజు పుత్రికయైన పార్వతీదేవిని పాణిగ్రహణం చేయ నిశ్చయించినాను. దాక్షాయిణి అనే పేరుతో పిలువబడిన సతీదేవి, ఆ తనువును చాలించి, మానససరోవరంలో అయోనిజగా నీలోత్పల పుష్పమందు జనియించి, పర్వతరాజు దంపతులచే పెంచబడుచున్నది. నా సతీమణిగా పూర్వవైభవం పొందాలని చిన్ననాటినుండి నన్నే ధ్యానిం చుచున్నది. ఈపార్వతీదేవి ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి స్వరూపంతో ప్రకాశించునది. నాయందు ఐద్ధానురాగంతో తపస్సు చేసి తన అభీష్టాన్ని నెరవేర్చు కొంటున్నది. అందువల్ల పార్వతీదేవితో నా వివాహ

మహోత్సవాన్ని నిశ్చయించడానికి మీరు మీధర్మపత్నులతో పర్వతరాజు కడకు వెళ్ళండి ఈ శుభకార్యాన్ని మంగళ ప్రదంగా నెరవేర్చండి." అన్నాడు జగద్రక్షకుడు.

ఈశ్వరాజ్ఞ బడసిన సనకాదిమునివర్యులు తమ తమ ధర్మపత్నులను తోడ్కొని, పర్వతరాజు అంతః పురాన్ని చేరారు. పర్వతరాజు వారిని సముచితాసనాలలో కూర్చొండనిచ్చాడు. మేనక తోడ్పడుచుండగా వారికి అర్ఘ్యము, పాద్యము, ఆచమనము, పంచామృతము (శుద్ధోదకము), వస్త్రద్వయము, యజ్ఞోపవీతములు, గంధము, అక్షింతలు, ఆభరణములు, పుష్పములు, ధూపములు, దీపములు, నివేదనము, తాంబూలము, నీరాజనము, మంత్రపుష్పసహితంగా—షోడశోపచార పూజలు సలిపాడు.

"గిరిరాజా! దైవలక్షణాలు అని చెప్పబడిన శౌచం, దానం, వీరం, ధానవం కలిగి, ఇచ్ఛాశక్తి,-క్రియాశక్తి-జ్ఞానశక్తి స్వరూపమైన 'ఆదిశక్తి అంశతో పార్వతీదేవి నీపుత్రియై, నీకు ఎనలేని సుఖసంతోషాలను కలిగించింది! అటువంటి పార్వతీదేవిని పెంచి సంరక్షణ చేసిన మీరు భాగ్యశాలురయినారు! ఇప్పుడు మేము ఈశ్వరుడు పంపగా వచ్చినారము. పార్వతీపరమేశ్వర కళ్యాణము జరుగనున్నది. దానిని గుఱించి మేము ఈశ్వరుడు నియోగించగా వచ్చినా" "మని అంగీరసుడనే మునివర్యుడు హిమవంతునితో చెప్పాడు.

మేనక కనుసైగలను అర్థం చేసికొన్నజయ, విజయలనే చెలికత్తెలు పార్వతీదేవిని సర్వాలంకార శోభితగా, వస్త్రభూషణాదులతో అలంకరించి తోడ్కొనివచ్చి ఉచితాసనములో కూర్చొండబెట్టారు. సర్వజ్ఞుడయ్యే అవతార విశేషాన్ని అందంగా అలంరింపజేయాలని పార్వతిదేవి సహజ మైన స్త్రీల సిగ్గును అభినయిస్తూ ఉండినది.

అప్పుడు మేనక పర్వతరాజులను చూచి- ఋషులలో మరొక్కరు ఇలా అన్నారు.

"సర్వేశ్వరుడైన మహాదేవునికి కన్యాదానం చేయబోతున్నారు! ఎంతటి తపః ఫలితమో! పార్వతి పరమేశ్వరుల కళ్యాణంవల్ల లోక

కంటకులైన శూరపద్మాది అసురులను సంహరించగల కుమారుడు సంభవించనున్నాడు. అందానికే అందమై, శక్తికే శక్తియై శోభాయమానంగా విలసిల్లే సుబ్రహ్మణ్యుడు జన్మించి, నీకు మనుమడయి, అందరికీ గర్వాన్ని, ఆనందాన్నీ తెచ్చియివ్వనున్నాడు. శంభుడే నీకు అల్లుడై కాళ్ళు కడిగించుకొనుచున్నాడు. ఈ శుభకార్యం శీఘ్రంనెరవేర్చి కృతార్థుడవుక"మ్మని చెప్పాడు ఆ మునివర్యుడు.

మేనకకూ, పర్వతరాజుకూ ఆనందం పట్టనలవికాలేదు. ఋషులారా! శుభలగ్నం మీరే నిశ్చయించండి" అని అభ్యర్థించాడు పర్వతరాజు.

"రేపు ఉత్తరానక్షత్రంతో కూడిన అత్యంత శుభప్రదమైన వివాహ లగ్నమున్నది! రేపే పరమేశ్వరునికీ పార్వతీదేవికి కళ్యాణం జరగాలి! ఓ పుణ్యదంపతులారా! వివాహానికి కావలసిన ఏర్పాట్లు చూడండి. మీకు సర్వశుభములు కలుగుగాక!" అని హిమవంతునీ, మేనకనూ ఆశీర్వదించి, ఋషులు తమతమ పత్నులతో వెడలి కైలాసం చేరారు.

శివసన్నిధిలో "మహేశ్వరా! రేపు ఉత్తరా నక్షత్రయుక్త శుభ లగ్నంలో పార్వతీదేవిని తాము పరిణయమాడి, సకల శుభములు కలుగునట్లు అనుగ్రహించమని ప్రార్థన!" అన్నారు

పర్వతరాజు విశ్వశిల్పియైన విశ్వకర్మను రప్పించాడు. దేవాది దేవుడైన మహాదేవునికీ, బ్రహ్మదేవునికీ, వైకుంఠునికీ, ఇంద్రాది దేవతలకు ఉచితమైన విడిది గృహాలను సర్వాంగసుందరంగా నిర్మించమని విశ్వకర్మను కోరాడు. తన శక్తి సామర్థ్యాలను చూపుతూ విశ్వకర్మ నిర్మించిన విడిది గృహాలనూ, కళ్యాణ మందిరాన్ని చూచి, పర్వతరాజు సంతోషభరితుడైనాడు. ఉచితరీతిని విశ్వకర్మను సన్మానించాడు. వివాహ వేడుకలు దగ్గరుండి ఏర్పాట్లు చేసిపొమ్మని విశ్వకరను ప్రార్థించాడు.

జయ, విజయలు పర్వతరాజు ఆజ్ఞననుసరించి పార్వతీదేవిని వధువుగా తీర్చిదిద్దారు. సకలమంగళములు కలిగించే ఆ కళ్యాణాన్ని

చూడాలని బ్రహ్మాదిదేవతలు ఉవ్విళ్ళూరుతూ, మహాదేవుని పెళ్ళి కుమారుడిగా చేసి కైలాసం నుండి హిమవంతుని మందిరానికి తీసికొని వచ్చారు. దేవదుందుభులు మ్రోగుతున్నాయి. అప్సరసలు నాట్య మాడుతున్నారు. పత్నిసమేతంగా దేవతలందరూ సమోత్సాహంతో పరమేశ్వరుని ముందిడుకొంటూ, పర్వతరాజుచే ఏర్పాటు చేయబడ్డ విడిది గృహాలను చేరారు.

పర్వతరాజు పరమేశ్వరునికి ఎదురుగా వెళ్ళి భక్తి శ్రద్ధలతో మేనకాదేవిని ప్రక్కన యిడుకొని షోడశోపచార పూజలు చేశాడు. బ్రహ్మవిష్ణ్వాది దేవులను అలాగే ఉపచరించాడు. సరస్వతీ, లక్ష్మీదేవులు పరాశక్తియైన పార్వతీదేవిని చేరారు.

పెళ్ళికుమారుని కోలాహలంగా ఊరేగించి కళ్యాణ మండపానికి చేర్చారు. సుందరేశ్వరుడు అందరికీ దర్శనమిస్తూ కటాక్షించాడు. మందిరోపరితలం నుండి స్త్రీలు 'శివుని'పై పూలవృష్టి కురిపించారు. దారిపొడుగునా నందివాహనుడికి అపూర్వమైన స్వాగత మర్యాదలు ఇచ్చారు. వాహనం నుండి మహేశ్వరుడు దిగి అంతఃపుర ముఖద్వారాన్ని సమీపించగానే మంగళహారతులిచ్చి, కళ్యాణ మంటపానికి తోడ్కొని వెళ్ళారు.

భూలోకవాసులైన మానవులు శివపార్వతుల కళ్యాణం చూడాలని పర్వతరాజు ఉంటున్న హిమాలయాలకు తండోపతండంగా వచ్చారు. ఈశ్వరుడు అందర్నీ అనుగ్రహించాడు. భూభారమంతా ఒక్కవైపుకే ఒరిగిపోతుందని గ్రహించి, కాశీలో స్థిరనివాసముంటున్న అగస్త్యుని రమ్మన్నాడు శివుడు.

"అగస్త్య మహామునీ! నా కళ్యాణం చూడాలని ప్రజానీకమంతా యిటు వచ్చారు. ప్రజాభారంతో ఉత్తర దిగ్భాగమంతా ఒరిగిపోరాదు. కనుక నువ్వు దక్షిణాపథం వెళ్ళు. నీ ఒక్కడివల్ల యీ భూమి సమతుల్యంగా నిలుస్తుంది! వెళ్ళు!" అని అగస్త్యుని ఆదేశించాడు పరమశివుడు.

"కరుణాసాగరా! విశ్వనాథా! భక్తవత్సలా! నీ కళ్యాణ వైభవాన్ని అందరూచూచి తరిస్తూవుంటే నేను మాత్రం చూడకుండా దక్షిణాపథం వెళ్ళాలా? నా హృదయం ఎంతగా ఆవేదన చెందుతుందో మీకు తెలియనిది గాదు! మీ అజ్ఞానుసారం దక్షిణ దిగ్భాగం వెళ్తాను. మీ కళ్యాణ వైభవాన్ని నేను తిలకించాలి. అందుకు అనుగ్రహించండి" అని ప్రార్థించాడు.

"మహామునీ! నువ్వు దక్షిణాపథం చేరగానే 'తిరువేర్కాడు' అనే చోట పార్వతితో జరిగే నా కళ్యాణాన్ని కనుల విందుగా చూడగలవు! వెళ్ళు!" అని అగస్త్యుని అనుగ్రహించి పంపాడు విశ్వనాథుడు.

అగస్త్యుడు శివానుగ్రహంపొంది దక్షిణాపథం చేరాక పార్వతీ పరమేశ్వరుల కళ్యాణ వైభవాన్ని దూరదర్శనం (నేటి టి.వి.) తో చూడగలిగాడు ఈ 'తిరువేర్కాడు' మద్రాసుకు చేరువలో ఉన్నది.

మంగళవాద్యములు ఘోషించుచున్నవి. పార్వతీదేవి సర్వాలంకార శోభితయై పరమశివుని చెంతకు రాగా ఆది దంపతులిరువురూ ఒకరి ప్రక్కన ఒకరు ఆసీనులయ్యారు. బంగారుటూయలలో ఊగారు. అప్సరసలు నాట్యమాడిరి. తుంబుర నారదులు పాడిరి.

తర్వాత పార్వతీ పరమేశ్వరులను కళ్యాణ వేదికకు గొంపోయిరి. జంటగా ఇద్దరూ కూర్చొన్నారు. విప్రోత్తములు వేదమంత్రాలు వల్లించారు. బంధు మిత్ర దేవ గణాది సపరివారం చూస్తుండగా పర్వతరాజు మేనకతో కలిసి–భక్తిపారవశ్యంతోనూ, భయప్రపత్తులతోనూ పరమేశ్వరుని పదకమలములను అభిషేకించాడు.

పార్వతీదేవి కోమలమైన దక్షిణ హస్తాన్ని పరమశివుని హస్తంలో ఉంచుకొని పర్వతరాజు నీటిధారను వదిలి కన్యాదానం చేశాడు.

"నాగాల పట్టి పార్వతిని నీవు చేపట్టినందువల్ల, సర్వేశ్వరుడవైన నీ అనుగ్రహంతో, నేను పునీతమయినాను! దేవాధిదేవా! ఈ నా కుమార్తెను స్వీకరించి నన్ను కృతార్థుడిని చేసినందుకు నీకు నేను

చాలా కృతజ్ఞుణ్ని. స్వీకరించుము స్వామీ!" అంటూ పార్వతీదేవిని పరమేశ్వరునికి పాణిగ్రహణ మొనర్చినాడు పర్వతరాజు.

పరమశివుడు ఎంతో ఉల్లాసంగా, సుందరంగా చిరునవ్వులు చిందుతూ పార్వతిని పరిణయమాడిన వేళలో మంగళ వాద్యములు మ్రోగుచుండగా, 'జయీభవ! విజయీభవ! అంటూ ఆకాశమంతా ఘోషానాదంతో దంపతులు ముచ్చటగా ఒకరి దాపున ఒక్కరు చేరువయ్యారు. ఈ శుభముహూర్తంలో భూమి భారమంతా హిమాలయాలవైపు ఒరిగింది. శివాజ్ఞతో అప్పటికే అగస్త్యుడు దక్షిణాపథం చేరి భూభారాన్ని తన ఒక్కడి తపోబలంతోనే సమ తుల్యం చేశాడు. అందరూ ఆదిదంపతుల కళ్యాణ వైభవాన్ని తిలకించారు. కృతార్థులైనామని సంతోష పడ్డారు. హిమవంతుని ఆతిథ్యం పొంది వారివారి స్వస్థలాలకు వెనుదిరిగారు.

వైదికశాస్త్రోక్తంగా వివాహ తంతు జరిగింది. అగ్ని సాక్షిగానూ, అగ్ని ప్రదక్షిణాది తంతులన్నీ చేశారు. బ్రహ్మదేవుడు, నారాయణుడూ, ఇంద్రాది దిక్పాలకులు, ముక్కోటి దేవతలు ప్రసన్నులైనారు. ఇన్నాళ్లూ, తాముపడిన రాక్షస బాధను మరువగలిగారు. ఆది దంపతులు ఒక్కటై దర్శనమిచ్చారు.

సమయం సందర్భాన్ననుసరించి, రతిదేవి త్రికరణ శుద్ధిగా మన్మధుణ్ని పునరుజ్జీవుణ్ని చేయమని-'కళ్యాణ' ని చేపట్టిన 'కళ్యాణ సుందరేశ్వరుని' ప్రార్థించింది.

రతిదేవిని ప్రసన్నంగా చూస్తూ, "నీ భర్త మన్మధుడు ఇది మొదలుగా లోకాలలో భోగసుఖాలనందించే నిమిత్తమై - జీవిస్తాడు. అయితే నీ భర్తను నువ్వు మాత్రమే చూడగలవు మిగిలిన వారెవ్వరికీ కన్పించడు. సకల జీవరాశులలోనూ కామవాంఛను ఉద్దీపనం చేసి అనంగుడైన నీ భర్త సృష్టికి తోడ్పడుతాడు." అని రతీదేవి ప్రార్థనను మన్నించి అనంగుడైన మన్మధుణ్ని తిరిగీ ఆమె పొందేటట్లుగా శివుడు అనుగ్రహించాడు.

ఈ పార్వతీ కళ్యాణ ఘట్టాన్ని ఎంతో విపులంగా రాయవచ్చు. పురాణ వ్యాస కర్తలు మొదలుకొని హరికథాదాసుల వఱకు ఈ ఘట్టాన్ని ఎంతో రక్తిగట్టించి-భక్తులకు అందజేస్తున్నారు. ఈ పార్వతీ పరమేశ్వర కళ్యాణం యొక్క ఘట్టాన్ని చదివినా వినినా సమస్త ఐశ్వర్యములు సిద్ధిస్తాయని ఆర్యులు ప్రవచించారు.

పార్వతీ పరమేశ్వరుల కళ్యాణం జరిగింది. పరమేశ్వరుడు పర్వతరాజు దగ్గఱ వీడ్కోలు పొందాక, 'పరాశక్తి' ని తోడ్కొని వృషభ వాహనారూఢుడై కైలాసం చేరాడు.

లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు!

సర్వేజనాస్సుఖినోభవన్తు!

మంగళంమహత్!

## కుమార సంభవము

చాలా కాలం సతీపతులుగా పార్వతీ పరమేశ్వరులు అద్భుతమైన ఉద్యానవనాల్లోనూ, కొండ చెరియలలోనూ-ప్రకృతీ పురుషులుగా కలిసి మెలిసి, కేళీ విలాసాలలో మునిగి తేలుచున్నారు. అందువల్ల సకల భువనాలలోనూ దంపతుల సరస సల్లాపములు, శృంగార భరిత మైన- లైంగిక పరమైన చేష్టలు పునరద్ధరింప బడనవి. శివానుగ్రహంతో మన్మథుడు రతీదేవిని క్షణాకాలమైనా విడువకుండా కామకేళీ విలాసాల్లో మునిగి తేలుతున్నాడు. అంతేకాకుండా అన్నిలోకాల్లోనూ జంటలలో తన కామబాణాన్ని నాటుతున్నాడు.

పార్వతీ పరమేశ్వరుల కళ్యాణం తిలకించిన దేవతలందరూస్వస్థానాలకు వెళ్లలేదు. కారణం శూరపద్ముడు మళ్ళీ తమల్ని హింసిస్తాడని భయపడ్డాడు. మహామేరు పర్వత గుహల్లో తలదాచుకొన్నారు. దేవతలు

సమావేశమై చర్చించుకొన్నారు. మళ్ళీ శివదర్శనం చేయాలని నిర్ణయించు
కొన్నారు. అందుకు గాను వాయు దేవుని తమతరఫున దూతగా పంపారు.
కానీ నంది వాయుదేవుని కైలాస మందిరంలోనికి అనుమతించ లేదు
చేయునది లేక వాయుదేవుడు వెనుదిరిగాడు. మళ్ళీ మేరుపర్వతంలోని
గుహకే మరలివచ్చాడు. దేవతలందరూ ఒక్కరుగా సమాయత్తమైకైలాసం
చేరారు. నందిని ప్రార్థించగా దేవతల రాకను గురించి మహేశ్వరునికి
విన్నవించాడు. ఈశ్వరుని అనుజ్ఞబడసిన నంది దేవతలను ఈశ్వర
సన్నిధికి గొంపోయాడు అక్కడ పార్వతీ పరమేశ్వరులు రత్నఖచితమైన
సింహాసనం మీద కూర్చొని దేవతలకు దర్శనం యిచ్చారు.

దేవతలు పరమేశ్వరుని ఎన్నోవిధాల స్తుతించి, "మహాదేవా! దేవ
సేనాధిపత్యం వహించే శక్తిమంతుడైన పుత్రుని ప్రసాదించు! అందువల్ల
మాకు రాక్షసులబాధ తొలగి మేము పూర్వంవలె మా స్వస్థానాలలో
వైభవోపేతంగా ఉండే వరం ప్రసాదించు" అని. వేడుకొన్నారు.

కరుణా సముద్రుడైన పార్వతీ రమణుడు తన స్వరూపాన్ని
విడిచాడు. తనయొక్క ఆరు ముఖాలతోను ఆరు త్రినేత్రాలతోనూ
దర్శనమిచ్చాడు. శివుని ఆరు ముఖాలలోని గుణాలు : 1. ఐశ్వర్యం
(ఆదిశక్తి), 2. వీర్యం (ఇచ్ఛాశక్తి), 3. కీర్తి (క్రియాశక్తి), 4. శ్రీ
(పరాశక్తి), 5. జ్ఞానము (జ్ఞానశక్తి), 6. వైరాగ్యము (కుండలినీ శక్తి),
ఇవన్నిచేరి దేదీప్యమానంగా ఆరు ముఖాలై ప్రకాశించుచున్నవి. తన
ప్రక్కన ఆసీనురాలైయున్న పార్వతీదేవిని యీ ఆరు శక్తులతో తదేకంగా
చూశాడు పరమేశ్వరుడు. వెంటనే ఈ ఆరుముఖాలలోని, మూడోనేత్రం
నుండి కోటి సూర్యసమానమైనదీ కాలాగ్నితుల్యమైనదీ అయిన తేజస్సు
వెలువడింది. ఈ తేజస్సు ఆరు రూపాలుగా వెలుపడిన తర్వాత, సకల
లోకాలను వ్యాపించింది. దానితీవ్రతను భరించలేని దేవతలందరూ తలో
దిక్కున పరుగిలిడినారు. ప్రళయకాలము సంభవించినదేమోనని
బ్రహ్మ, మహావిష్ణువులు మొదలుకొని అందరు దేవతన్ను భయపడ్డారు.
సర్వలోకములు గడగడా వణకినవి. చంద్ర సూర్యాదీ గ్రహములు
గతులు తప్పినవి.

శివుడు తన సహజ స్వరూపానికి మారాడు. అత్యంత తేజోవంత మైన తన ఆరు శక్తులరూపాల్ని తిరిగీ తనవద్దకురావాలని మనస్సులో అనుకున్నాడు అవి మళ్ళీ శివుని ముందుకు వచ్చాయి. తన తీవ్రతను శాంత సరళిలో మార్చుకొని వినయంగా పరమేశ్వరుని ముందునిలిచినవి

అప్పుడు 'ఏంజరుగుతుందో చూద్దా'మని తిరిగి వచ్చారు దేవతలు వారిలో అగ్నిదేవునీ, వాయుదేవుని ఈశ్వరుడు తన దగ్గరకు రమ్మని పిలిచి, "అగ్ని, వాయుదేవులారా! త్వరితగతిని ఈ తేజస్సును మీరు మీ చేతులలోనికి తీసికొని, దేవతల పరివారము మీ వెంటరాగా గంగానదిలో విడిచివేయండి. అలా అక్కడున్న 'శరవణ సరోవరం' లోకి చేర్చండి" అన్నాడు. శివాజ్ఞతో ఆ తేజోరాశులు కుంచించుకొని పోగానే, అగ్ని, వాయుదేవులా తేజోరాసుల్ని తమ చేతుల్లోకి తీసికొన్నారు. ఆ తేజో శక్తులను భరించే శక్తిని ప్రసాదించమని మహేశుని మనస్సులోనే వారు ప్రార్థించారు. వారికా శక్తిని శివుడనుగ్రహించాడు.

ఆ తేజోమయ శక్తుల్ని తల మీద మోశాడు అగ్నిదేవుడు. కొంత దూరం వెళ్ళాక వాయుదేవునికి అప్పగించాడు ఆభారాన్ని. అలాఇరువురూ తీసికొని వెళ్ళిన ఈ ఆరుశక్తుల్ని శివుడాజ్ఞమేరకు "శరవణ సరోవరాని" కి చేర్చాడు. త్రిలోకాలకూ, దేవతలకూ సర్వ శుభముయి చేకూరినవి. ఆ తేజో రూపములు ఆరు అందమైన బాలురుగా మారినవి. దేవతలందరూ భయభక్తులతో ఆ తేజో బింబాలైన కుమారులకు నమస్కరించారు.

బ్రహ్మదేవుడు ఆకాశంలోనూ, విష్ణుమూర్తి భూలోకంలోనూ, ఇంద్రాది దిక్పాలకులు తమ తమ దిక్కులలోనూ ఉండి ఆ తేజో రూపాలకు రక్షణగా నిలిచారు.

'శరవణ' అంటే రెల్లుగడ్డి పెరిగిన సరోవరము-ఈ తేజో శక్తులు గంగలో విడువబడినపుడు వాటి తీవ్రతకు గంగానది ఎండిపోయినది. అప్పుడు పరమేశ్వరుని కటాక్షంతో తిరిగీ జీవనదిగా మారి యథావిధిగా ప్రవహించింది. అప్పుడు హిమాలయ పర్వతశిఖరానిలో అత్యున్నతమైన 'శరవణ సరోవరాన్ని' ఆ అగ్నిరూపాలు ఒక్కసారిగా చేరినవి.

అవన్నీ ఒక్కొక్క శిశువుగా ఆ సరోవరంలోని ఆరు కలువ పూవులలో నిలిచింది. చెన్ను+కలువ=చెంగలువ; రాయడు=రాజు. కలువపూవుకు రాజు చంద్రుడు. 'చెను' అంటే అందమైన అని అర్థం, అందమైన కలువపూవులకో అందానికే అందమైన రాయడు=రాజు. ఈ 'చెంగలువరాయ'డే వ్యవహార రీత్యా చెంగ్రల్రాయుడు, చెంగల్రా యులు గా నామాంతరములై పిలువబడినది.

తమిళంలో 'మురుగు' అంటే 'అందము' అని అర్థమున్నది. ఈ చెంగల్వాలాయడే తమిళంలో 'సెందిల్' అని 'మురుగా' అని పిలువ బడుచున్నాడు.

ఒక్కో కలువ పూవులోనూ ఒక్కొక్క 'అందాల కుమారుడు'. ఇలా ఆరు మంది కుమారులేర్పడ్డారు. ఆ సమయంలో దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టి కురిసింది. దేవతలందరూ ఆ కుమారులను చూచి దివ్యానుభూతిని పొంది, ఆ శిశుమూర్తులకు భక్తి శ్రద్ధలతో నమస్కరించారు.

మహావిష్ణువు అక్కడుండిన ఆరు మంది కార్తీక కన్యలను పిలిచి, "కన్యలారా! శివకుమారులైన యీ ఆరు శిశుమూర్తులకు మీరు తల్లులై పాలిచ్చి పెంచండి" అని ఆజ్ఞాపించాడు.

శ్రీ మన్నారాయణుని ఆజ్ఞను మన్నించి ఆ ఆరు మంది కార్తీక కన్యలు ఒక్కొక్క కుమారుని తమ చేతులలోనికి తీసికొని వెంటనే వారిలో స్తన్యము తనంతట తానే ఉబికింది శివ తేజోరూపాలు అగ్నినే కాల్చ గలిగినవై లోకాలన్నింటినీ దహించే రీతిలో వ్యాపిస్తూ ఉండిన సమయంలో దేవతలందరూ పరుగులిడినట్లుగానే-పార్వతీదేవికూడా భయపడుతూ కైలాసాన్ని వీడి పారిపోయింది. తర్వాతకొంత సేపటికి కైలాసానికి వచ్చింది తిరిగి రాగానే జరిగిందంతా తన నాధుని ద్వారా తెలిసికొన్నది. ఆమె అలాభయపడి పారిపోయిన సమయంలోనే తనకాలి అందెలలోని నవరత్న ఖచ్చితమైన పూసలనుండి, రత్నములన్నీ (సరమునుండి) తెగిపోయి

చెదరి పడిపోయినవి. ఈ తొమ్మిది రత్నములే 'నవవీరులు' గా (తొమ్మిది మంది కుమారులు) ఉద్భవించినారు చెంగల్వరాయునికి ఈ తొమ్మిది మంది అనుచరులు సేవలందించు వారైనారు.

| | నవవీరుల పేర్లు | వారి తల్లుల పేర్లు | నవరత్నముల పేర్లు |
|---|---|---|---|
| 1. | వీరబాహుడు | మాణిక్యవల్లి | కెంపు |
| 2. | వీరకేసరి | తరళవల్లి | ముత్యము |
| 3. | వీరమహేంద్రుడు | పౌష్యవల్లి | పుష్యరాగము |
| 4. | వీరాంతకుడు | ప్రవాళవల్లి | పగడము |
| 5. | వీరమహేశ్వరుడు | గోమేధతిలక | గోమేధకం |
| 6. | వీరరాక్షసుడు | వజ్రవల్లి | వజ్రము |
| 7. | వీరపురంధరుడు | వైడూర్యవల్లి | వైఢూర్యము |
| 8. | వీరధీరుడు | నీలవల్లి | ఇంద్రనీలం |
| 9. | వీరమార్తాండుడు | మరకతవల్లి | పచ్చ (మరకతం) |

పార్వతీదేవి శివతేజోశక్తులైన తన కుమారులకు కన్నతల్లిగా పాలిచ్చి పెంచలేక పోయినందుకు కోపించింది. దేవతలందరూ 'శరవణ సరోవరం' దగ్గఱ చేరి తన శిశువులైన ఆరు కుమారులకున్నూ కాపలాగా నిలువడమే గాకుండా, కార్తీక కన్యలను పిలిపించి వారిచే పాలిచ్చి పెంచేలా చేసినారని దేవతల మీద ఎనలేని ఆగ్రహం కలిగింది.

"నాయందు పుత్రుడు ఉదయించడానికి అడ్డుపడటానికి కారణమైన ఓ దేవతలారా! మీయందరికి సంతానభాగ్యము లేకుండా పోవుగాక" అని దేవతలను శపించింది. ఇది వఱకే సతీదేవిగా దక్షయజ్ఞకాలమందు దేవతలకు శాపమిచ్చినదే కదా!

శివుని చూచి, "నాథా! నీ తేజో శక్తుల్ని చూచి భయపడి మన అంతఃపురంలోనికి పారిపోయాను. ఆ తేజోబలం తగ్గినది చూచినవెంటనే మళ్ళీ మీదగ్గఱకు వచ్చాను. నన్ను అనుగ్రహించండి " అని ప్రార్థించింది. కరుణా మూర్తియైన పరమశివుడు పార్వతిని తన ప్రక్కన నిలుపుకొన్నాడు. దేవదేవుడు దేవిని చూచి," మన కుమారుని కైలాసానికి తోడ్కొని రావలయును. అందుకు సిద్ధపడుమ" నిచెప్పాడు. పార్వతిని

పిలుచుకొని ' శరవణసరోవరా ' నికి చేరాడు. పార్వతిని చూచి "నీ కుమారులను తీసికొనిరమ్మ్మ" అని సెలవిచ్చాడు పరమేశ్వరుడు. అప్పుడు శివాని 'శరవణ సరస్సు'లో చెంగలువలలో ఉంటున్న ఆరు శిశుమూర్తులను తన చేతిలోకి తీసికొంటూ పెల్లుబుకుతున్న మాతృప్రేమతో ఒక్కటిగా చేర్చినది. తనలో ఉబుకుతున్న జ్ఞానక్షీరాన్ని ఒక్క శరీరంగా మారిన 'షణ్ముఖు'నికి అందించింది. ఆరుముఖాలూ, ఒక్క శరీరమూ, పన్నెండు చేతులుగలవాడే షణ్ముఖుడని పిలుపబడుచున్నాడు.

పార్వతీదేవి యొక్క జ్ఞానక్షీరమును గ్రోలిన 'షణ్ముఖుడు' జగజ్జనని నుండి పొందిన జ్ఞాన సారమంతా తనలో ఇముడ్చుకొనినందున ఆమె తన కుమారునికి "స్కందుడని" పేరిడినది. ఈ పేరునే తమిళంలో 'కందన్' అని వ్యవహరించుచున్నారు. పార్వతి 'స్కందుని' తన రెండు చేతులలో తీసికొని శివుని చెంతకు వచ్చింది. పార్వతీదేవిని చూచి శివుడు "దేవీ! చెంగల్వారాయడైన మన కుమారుని అందచందాలు సహస్రకోటి సూర్యసమానమైనవి. ఈ కుమారునివల్ల సకలలోకములు నిశ్చింతగా ఉండనున్నది. వెయ్యిన్ని ఎనిమిది అండములను శాంతియుతంగా పరిపాలించక అందరినీ హింసిస్తున్న శూరపద్మ సోదరత్రయాన్ని మన ఈ కుమారుడు నిర్మూలిస్తాడు. అందువల్ల అన్నిఅండాలలోనూ సుఖ శాంతులు వెల్లివిరిస్తాయి. తద్వారా నీవు వీరమాతవు అగుచున్నావు. నీ రత్నాల సరాల నుండి పుట్టిన 'నవవీరకుమారులు' ఈ స్కందుని నాయకత్వంలో అనుచరులుగా వుంటారు. వారికి చెరొక వీరఖడ్గాన్ని ప్రసాదిస్తున్నాను. స్కంధ పరివారంలో యీ నవవీరులతో బాటు అసురులను సంహరించే నిమిత్తమై లక్షవీరులు మన "స్కందు"ని వెంటవుంటారు. నీ పుత్ర పారవశ్యంతో ని వక్షోజాలనుండి స్రవించిన క్షీర బిందువులు మన 'కుమారుని' నోటిలో పడుతున్నప్పుడు, కొన్ని యీ 'శరవణ సరస్సు' లో చిందినవి. అందువల్ల పరాశరముని యొక్క శాపంవల్ల మత్స్యరూపాలు పొందిన ముని కుమార్లకు శాపవిమోచనం కూడా లభించింది. నీ జ్ఞాన క్షీరాన్ని గ్రోలిన మన 'కుమారుడు' జ్ఞానముతో బాటు సమస్త విద్యలను పొందిన వాడయినాడు. అందువల్ల 'సుబ్రహ్మణ్యు' డయినాడు. దేవీ! మన 'కుమారుని' నా చేతు లో

ఉంచు"మని పార్వతీదేవితో అన్నాడు జగదీశ్వరుడు. పార్వతీదేవి నుండి గ్రహించిన 'స్కందు'ని యెత్తి ముద్దాడి శిరము మూర్కొనినాడు.

కార్తీక కన్యలు ఆదిదంపతుల కుమారునికి కొంతకాలమైనా తల్లులుగా ఉండగలిగిన భాగ్యానికి మురిసిపోయారు. దేవతలందరూ నమస్కరిస్తూనిలబడ్డారు.

అప్పుడు శివుడు, "ఈ కార్తీక కన్యలచే మన కుమారుడు పెంచ బడినందువల్ల 'కార్తికేయు'డని ప్రసిద్ధి చెందగలడు. కార్తీకమాసంలోను కృత్తికానక్షత్రదినాలలోనూ వ్రతనిష్ట సలిపి 'కుమారు'ని సేవించేవారికి సకల సుఖాలు లభిస్తాయ"ని చెప్పాడు. మళ్ళీ శివుడే యిలా అన్నాడు. "అంతేగాకుండా గంగానది ప్రవాహంలో ఎదురీతగా కొట్టుకొని వచ్చిన 'శివవీర్యతేజోమయుడు' కాబట్టి 'గాంగేయుడు' అని కూడా ఈ 'కుమా రుడు' పిలువబడుతాడు. నా నుండి వెలువడిన తేజోపుంజాలు 'అగ్ని' వాయు'దేవుల మూలంగా 'ఆకాశం' నుండి 'భూమి' కీ తద్వారా భూమి లోని 'గంగాజలం' మీదికి చేరినందున పంచభూతాలూ నావశమైయున్నట్లే ఈ తేజోమూర్తికికూడా వశమైనవి. వేయేల? ఒక్క మాటలో చెప్పాలంటే శక్తిస్వరూపమైన పార్వతీదేవినీ-త్రిగుణాతీతమైన 'సత్' 'చిత్' ఆనంద 'మూర్తియైన నన్నూ-వేర్వేరుగాగానీ, ఆదిదంపతులమైన మా ఇద్దరినీ కలిపి పూజిస్తే కలుగు సమస్త సౌభాగ్యములు ఒక్క 'సుబ్రమణ్యే'ని పూజించి నంతనే భక్తులకు కలుగుతాయి! ఈ స్కందుని స్వరూప విశేషాలువినుము దేవీ!

## జ్ఞాన శక్తి సుబ్రహ్మణ్యుడు

ఒక్క ముఖము, రెండు కళ్ళు, జట, తెల్లజిల్లేడుమాల, రత్న కిరీటము, నాలుగు చేతులలో శక్తిశూలమూ, వజ్రము, కుక్కుట ధ్వజమూ, అభయహస్తముతో కన్పట్టి ధవళ వర్ణంలో ఉంటాడు.

## 2. స్కంద సుబ్రహ్మణ్యుడు

ఒక్క ముఖము, రెండు కళ్ళు, నాలుగుచేతులలోనూ కుక్కుట ధ్వజము, అభయము, వరదము, వజ్రము, శ్వేతపద్మమునందాసీనత, శిరోజములను కొద్దిగాతాకునదైన పుష్పమాల, జింకచర్మధారణ, మొల త్రాడు, రత్నాభరణములు, సాంబ్రాణిపొగ వంటి శరీరఛాయ, ప్రభ చుట్టూ సూర్యప్రకాశవలయము ('ప్రభ' అనగా శిరస్సువెనుక నుండు తేజము.)

## 3. దేవసేనాపతి

ఒక్క ముఖము, రెండు కళ్ళు, నాలుగు కరారవిందములలో శంఖము, చక్రము, వరదము, అభయము, సర్వాభరణభూషితమైన అలంకారము, సుగంధలేపనము, పొగవంటి మేనివర్ణం, తెల్లనిజంధ్యము చిరునవ్వులు చిందే ముఖారవిందము.

## 4. గాంగేయ సుబ్రహ్మణ్యుడు

ఒక ముఖము, త్రినేత్రములు, దానిమ్మపూవులాంటి శరీరఛ్ఛాయ కిరీటము, నీలోత్పల పుష్పము ధరించినవాడు, నాశనము లేనివాడు, దక్షిణ హస్తాలలో గొడ్డలి, పూర్ణకుంభము, వామహస్తాలలో కుక్కుట ధ్వజము మొదలగునవి కలిగిన స్వర్ణమయమైన రూపము కలవాడు.

## 5. తారకారి

ఒక ముఖము, త్రినేత్రములు, గజారూఢుడై పిలసిల్లువాడు, దక్షిణ హస్తాలలో అభయముద్ర, కరవాలము (శక్తి), వేలాయుధము (బరిశె), వామ హస్తాలలో కుక్కుట ధ్వజము, డాలు, రుద్రాక్షమాల కలవాడు.

## 6. షణ్ముఖుడు

ఆరు ముఖములు కలవాడు, పన్నెండు చేతులు కలవాడు, వరుస క్రమముగా ఆచేతులలో బరిసె (వేలాయుధము,) బాణము, కత్తి, చక్రము, పాశము, అభయముద్ర, కుక్కుటధ్వజము, విల్లు, డాలు, శంఖము, వరదముద్రతోబాటు సర్వలక్షణాలంకృతులైన జయ, (వల్లీ) విజయ (దేవసేన) అనే యిరువురు ధర్మపత్నులతో కూడినవాడై నెమలి వాహనమందు అమరినవాడు.

## 7. కుమార స్వామి

ఒక ముఖము, అందమైన పూలగంపవంటి కిరీటము, కుడిచేతులలో శక్తి వేలాయుధము, అభయముద్ర, ఎడమ చేతులలో వరదముద్ర వజ్రము, కంఠసీమను తామరపూల సంరతో అలంకరించి యుండు శిశురూపము.

## 8. శౌరనేయ సుబ్రహ్మణ్యుడు

నాలుగు ముఖములు, ఎనిమిది నేత్రములు, చెంగలువ యందు అమరియుండువాడు. కుడికాలు కొద్దిగా వంగియుండగా, ఎడమకాలిని క్రింద ఊనినవాడు, కుడిచేతులలో శక్తి, తామర, పూలబాణము, అభయ ముద్ర, ఎడమ చేతులలో వజ్రము, చెఱకు విల్లు, శూలము, వరదముద్ర.

## 9. అగ్నిజాత సుబ్రహ్మణ్యుడు

ఒక ముఖము, ఎనిమిది కరములు కలవాడై కుడిచేతులలో హోమానికి వాడునట్టి గరిటె, అక్షమాల. కత్తి, స్వస్తికము, ఎడమ చేతులలో కుక్కుటధ్వజము, డాలు, వజ్రము. ఘృతకలశము (నెయ్యి పాత్ర), అగ్నిలో ఉద్భవించిన రూపము కలవాడై, హోమవిధిని నిర్వర్తించు లక్షణములు కలవాడు.

## 10. శరవణభవ సుబ్రహ్మణ్యుడు

ఒక ముఖము, ఆరు హస్తారవిందములలో చెఱకు విల్లు, పూల శరము, కత్తి, డాలు, వజ్రము, కుక్కుట ధ్వజము కలవాడు. ఉదయ భానుని తేజోరూపము కలిగి విభూతిరేఖలు దాల్చినవాడు. అరుణ శరీర కాంతితో నిండినవాడు కలువలో ఉదయించువాడు.

## 11. శిఖివాహనుడు

ఒకముఖము, త్రినేత్రములు, నాల్గు చేతులలోనూ అభయవరద ముద్రలూ, పాశం, అంకుశం, ప్రజ్వలించు శోభాయమానమైన పురి విప్పిననెమలితో ఇంద్రనీలరథారూఢుడై చెంగలువ వంటి శరీరచ్ఛాయ కలిగి సకలభువనములు చుట్టివచ్చువాడు.

## 12. క్రౌంచ భేదసుబ్రహ్మణ్యుడు

నాలుగు దివ్యహస్తములు కలిగినావాడు. అవి వరద, అభయ ముద్రలు శోభింపగా—పూలబాణము—చెఱకు విల్లు విరాజిల్లుచుండ —త్రినేత్రుడై, శిఖివాహనముతో సింహాసనారుఢుడై యుండువాడు. శర ణాగత రక్షణయే తన కర్తవ్యమని కన్పట్టు ముఖారవిందము కలవాడు. క్రౌంచమును చీల్చు రెండు చేతులు—క్రౌంచభేద స్వరూపము. ఎర్రని శరీరకాంతిపుంజములతో శోభించు వాడు.

## 13. కార్తికేయుడు

ఒక ముఖారవిందము, శిరమందు బిల్వదళములు ధరించువాడు. త్రినేత్రములు. పదిచేతులలో శక్తి వేలాయుధము, శూలము, చక్రము, అంకుశము, అభయము—వరదము, తోమరాయుధము (బరిశెవంటిది), పాశము, శంఖము, వజ్రము, నెమలివాహనము, సర్వాలంకారములతోను ఉదయ సూర్యుని వంటి ప్రకారముతో ఎర్రని శరీరకాంతులు నిండిన వాడు.

## 14. దేశికుడు

ఆరు దివ్యహస్తములు, ఒకముఖము, పూలగంప బోర్లించగా కన్పడునట్లుండు కిరీటము, శక్తివేలాయుధము, రుద్రాక్షమాల, వరద-అభయముద్రలతో నిండినవాడు.

## 15. బ్రహ్మచారి వైగమేయుడు

ఉదయకాంతులీను భాస్కరతేజము గల ప్రభుమూర్తి. రెండు కళ్ళు, రెండు చేతులు కలవాడు. కుడి చేతిలో దండము, ఎడమ చేతిలో వజ్రము ధరించినవాడు. జంధ్యము ధరించినవాడు. కృష్ణాజినము(జింక చర్మము)కలవాడు. గోచికట్టి--నడుముకు వస్త్రాలను చుట్టియుండగా ఎర్రని తామరయందు ఆసీనుడైనవాడు. చతుర్వేదములనే తన స్వరూపముగా ధరించినవాడు.

## 16. గుహుడు

రత్నాభరణములతో అలంకరింపబడినవాడు. రత్నఖచితమైన కిరీటము ధరించి, త్రినేత్రములు, నాలుగు దివ్య హస్తారవిందములలో కుడిభాగమునందు శూలము, వజ్రము, ఎడమభాగమునందు వరద-అభయ ముద్రలూ, ధవళవస్త్రము, సర్వులను రక్షించుటయే లక్ష్యముగా గలవాడై, కళ్యాణోత్సవ విగ్రహరూపముతో అలరారుచూ, ఎడమవైపున వల్లీదేవిని అమర్చుకొని విభూతి రూపమున విలసిల్లువాడు.

"కళ్యాణీ! ఇటువంటి రూప విశేషములు కలిగిన మన కుమారుని అర్చించి పూజించువారిని సకల సౌభాగ్యములు లభించునని వేరే చెప్పవలెనా? నాలోనే సకల భువనభాండములు ఉన్నవి. నా యంతటివాడై, నా ప్రతిరూపమై, నీ శక్తిని కూడా గ్రహించినవాడైన యీ స్కందుడు దేవసేనాధిపత్యము వహించి, శూరపద్మాది రాక్షసులను సంహరింపగల సమర్థుడవుతాడు" అన్నాడు పరమేశ్వరుడు పార్వతీదేవితో.

ఇదివిన్న పార్వతీదేవితోబాటు అక్కడ వుండిన బ్రహ్మాదిదేవతలు ఎంతో ఆనందించారు. శివుని చేతుల్లో చిద్విలాసంగా నవ్వుతూ, అందరినీ ప్రసన్నంగా చూస్తున్నాడు సుబ్రహ్మణ్యుడు. దేవతలు నమస్కరించారు శివుని అనుమతి పొంది తమతమ నెలవులకు మరలి వెళ్ళారు. గౌరీ పశుపతులు తమ కుమారునితో కైలాసానికి మరలి వెళ్ళారు.

## శివకుమారుని లీలలు

బాల్యంలోనే శివకుమారుడు ఎన్నో లీలలు చూపుతున్నాడు. ఉమా దేవితోబాటు కైలాసమందున్న ప్రమథగణాలు మొదలుకొని ఋషిగణాలు కూడా స్కంధుని లీలలను చూచి విస్మయమొందుచున్నారు.

గారాబంగా పెరుగుతున్నాడు గాంగేయుడు. కాలిఅందెల 'ఘల్లు ఘల్లు'మనే శబ్దాలు సంగీతఝరిలాగా స్వరయుక్తంతో వీనుల విందు కలి గిస్తున్నవి ప్రకాశించే కర్ణకుండలంతోనూ, నడుము చుట్టూ ఉన్న వడ్డా ణాకిని సొగసునిస్తున్న చిరుగంటల రవళితోనూ అందర్నీ ఆకర్షిస్తున్నాడు బాలసుబ్రహ్మణ్యుడు.

తటాకాలలో, నదులలో, పూల ఉద్యానవనాల్లో, కొండల్లో, విశ్వం లో అన్నిదిక్కులా తానై చరిస్తున్నాడు. ఒక్కొసారి వృద్ధుడిగా విహరిస్తు న్నాడు, మరోసారి ఆరుముఖాలతోనూ, పన్నెండు చేతులతోనూ ముద్దులు మూటగట్టే బాలకుమారుడుగా దర్శన మిస్తున్నాడు. నడచి వెళ్తుంటాడు మరోచోట, ఒకటి తర్వాత ఒకటి సుశ్రావ్యంగా సంగీతవాయిద్యాలు, వాయిస్తున్నాడు ఇంకొకచోట వీరుడిగా, శూరుడిగా, యోధుడిగా కవచ కృపాణాలతో క్షత్రియుడిలా స్వైర విహారం చేస్తున్నాడు.

ఇవన్నీ లీలావినోదంగా చేస్తున్న బాలసుబ్రహ్మణ్యుని చూస్తున్న పార్వతీదేవి—మాతృహృదయం ఉప్పొంగిపోతున్నది. అది చూచి శివుడు పార్వతితో యిలాఅన్నాడు.

"ఒకప్పుడు నాకుండిన ఆరుముఖాలతే మనకుమారస్వామికి యిప్పుడున్నా ప్రతిరూపాలయినవి. మనయిరువురికి సంబంధపడిన తారకబ్రహ్మ బీజాక్షరములే ఆరు అక్షరముల మంత్రమయినవి. ఓం'శరవణభవః' అను మంత్రాన్ని ఉపాసించువారిని సుబ్రహ్మణ్యుడు స్వయంగా రక్షించడానికి ఆయత్తమవుతాడు. వాడికీ మనకూ బేధంలేదు. మనమెలా సర్వత్రావ్యాపించియున్న ఆదిదంపతులమో—అలాగే తానుకూడా అంతటా నిండియుండి—మనం చేస్తే సర్వకార్యాలనూ తా స్వతంత్ర ప్రతిపత్తితో చేయగలుగుతాడు అయినా వినయ సంపన్నుడై మన ఆశీస్సులు కోరతాడు. తన్ను ఆరాధించు భక్తులకు సకల శుభములను, ఐశ్వర్యములను చేకూరుస్తాడు. ఇల్లూ—వాకిలీ—భూమి—ఆభరణములూ ఇష్టజన—బంధుత్వమూ—శత్రుక్షయమూ—భక్తీ, జ్ఞానమూ, వైరాగ్యమూ అనే ప్రకృతి వికృతి భోగాల నిచ్చి, మోక్ష సామ్రాజ్యాన్ని కూడా యివ్వగల సమర్థుడు మన కుమారస్వామి, ఇంకా చతుర్ముఖుడైన బ్రహ్మదేవుని మన యీ షణ్ముఖుడు ప్రణవ మంత్రమునకు సరియైనవివరణ చెప్పమని ప్రశ్నించి అందుకుసృష్టికర్తయైన బ్రహ్మదేవుడు సమాధానంచెప్పలేక పోయినప్పుడు అతన్నిబంధించి చెరలోవేస్తాడు, తానే 'సుబ్రహ్మణ్యుడు' అయినందువల్ల బ్రహ్మకన్నా మిన్నగా సృష్టికర్తయై తనవిధులను సలక్షణంగా నిర్వహిస్తాడు. అసుర సంహారం చేస్తాడు. దేవతలకు సేనాధిపత్యం వహించి, వారిని ప[illegible]స్తాడు.

లోకాలన్నింటినీ బంతుల్లాగా ఆడుకోగలడు. అన్ని పర్వతాల్లనూ ఒక్కటిగా చేర్చగలడు. సముద్రాలన్నింటినీ ఏకం చేసేయగలడు. చంద్రమండలంలో సూర్య మండలాన్ని మిళితం చేయగలడు. హిమాలయాలను భూమిలోనికి చొచ్చుకు పోయేలాగా చేయగలడు. పర్వతాలలో ఉద్భవించే జ్వాలలను, అడవుల్లో వ్యాపించే దావాగ్నిని— ఆకాశగంగను తెచ్చి అర్పించగల సమర్థుడు!"

ఇవన్నీ బాల సుబ్రహ్మణ్యుడు చేస్తున్నాడు. ఇదంతా చేస్తున్న దెవతో రాక్షసులకు అంతు చిక్కడంలేదు. ఎందెందు వెదకినా కార్తికేయుని కాన లేకున్నారు. ఇది త్రిమూర్తులకే అంతు చిక్కని లీలలని భ్రమించారు రాక్షసులు. ప్రజలు మాత్రం యీలీలలను చూసిన

రాక్షసభాధనుండి రక్షింపబడే 'శక్తి' ఉద్భవించిందని మురిసిపోయారు కానీ అజ్ఞానులై దేవతలు మాత్రం అదృశ్యుడైన సుబ్రహ్మణ్యుడు చేస్తున్న లీలలని తెలియక. పోరాడి ఓడిపోయారు. చావుతప్పి పరుగులిడారు. అదృశ్యంగా సుబ్రహ్మణ్యునితో పోరాడిన దేవతలలో చాలామంది పారి పోగా మిగిలినవారు మరణించారు. ఈవిషయం నారదమహర్షి దేవ గురువైన బృహస్పతితో చెప్పి వెళ్ళాడు. యుద్ధభూమిలో విగత జీవులైన దేవతలను చూచి 'గురువు' హృదయం తల్లడిల్లింది.

"దేవతలు అజ్ఞానంతో చేసిన యీ దుష్కార్యమును సైరించి వారిని బ్రతికింపు "మని బాల సుబ్రహ్మణ్యుని బృహస్పతి వేడు కొన్నాడు. చిరునవ్వులు చిందిస్తూ కార్తికేయుడు గురువు ముందు ప్రత్యక్షమయ్యాడు.

"దేవగురూ! ఇంద్రాది దేవతలు నేనెవరో తెలిసికొనలేక మూర్ఖులై ప్రవర్తించారు. నా శక్తి సామర్థ్యాలు వారికి తెలియాలనే వారితో అజ్ఞాతంగా యుద్ధం చేశాను. ఇకనైనా నన్ను బాలుడని భావింపకుండా గౌరవి స్తారనే ఆశిస్తాను. ఇంద్రాది దేవతలు పునర్జీవులయ్యెదరు గాక!" అంటూ వారికి ప్రాణదానం చేశాడు శిఖివాహనుడు.

దేవతలందరూ పునర్జీవులై లేచి గాంగేయుని పలువిధాలా స్తుతించి, "స్వామీ! నీవు బాలుడవని ఎంచి తప్పు చేసినందుకు మమ్మల్ని తగిన రీతిగానే దండించావు. నీ విశ్వరూపం చూచితరించేభాగ్యం మాకు కలుగ నిమ్ము" అంటూ వినమ్రులై నమస్కరించారు.

## బాలసుబ్రహ్మణుని విశ్వరూప ప్రదర్శనము

బాలసుబ్రహ్మణ్యుడు దేవతల మొరాలకించి తన విశ్వరూపాన్ని వారికి చూపాడు. అయితే వారివల్ల ఆయన పూర్తిస్వరూపాన్ని చూడడం సాధ్యం కాలేదు. పాదాలనుండి మోకాళ్ళ వఱకు చూడడానికే దేవత లకు సాధ్యం కాలేదు. బ్రహ్మదేవుడు, నారాయణుడు. ఇంద్రాది దేవత

లందర్నీ తనలోనే ఇముడ్చుకొన్న విశ్వరూపం వారు పూర్తిగా చూడలేక పోయారు. తనలోనే అష్టదిక్కులనూ, పదునాలుగు లోకాలనూ, సప్త సముద్రాలనూ, సమస్తమైన ప్రాణులనూ, దేవతలనూ, యక్ష, గంధర్వ, కింపురుషాదులనూ తన విశ్వరూపం ద్వారా ప్రదర్శించాడు. జగదీశ్వరుడు తన ప్రాణంగానూ, జగదీశ్వరి తన ఆత్మగానూ వారికి కన్పింప జేశాడు.

బాలసుబ్రహ్మణ్యుని అంగాంగమందు కనిపించిన పదునాలుగు లోకములు ఇలా ఉన్నవి :

## ఊర్ధ్వ లోకములు

1 భూలోకం—గుదమందు
2. భువర్లోకం—గుహ్యమందు
3. సువర్లోకం—నాభియందు
4. మహర్లోకం—హృదయమందు
5. జనలోకం—కంఠమందు
6. తపోలోకం—భ్రూమధ్యమందు
7. సత్యలోకం—లలాటమందు.

## అధోలోకములు

1. అతల—అరికాళ్ళయందు
2. వితల—మీగాళ్ళయందు
3. సుతల—మడిమలందు
4. తలాతల—పిక్కలందు
5. రసాతల—మోకాళ్ళయ దు
6. మహాతల—తొడలయందు
7. పాతాళ—గుదమునకు క్రింది భాగమందు.

## సప్త సముద్రములు

1. లవణ—మూత్రము
2. ఇక్షు—స్వేదము(చెమట)
3. సుర—ఇంద్రియము
4. సర్పి—శోణితము
5. దధి—శ్లేష్మము
6. క్షీరం—చొల్లు
7 శుద్ధోదకము—కన్నీరు

## పంచజ్ఞానేంద్రియములు

1. త్వక్కుకు విషయం—స్పర్శము, వాయుసంబంధము, శీతలము, ఉష్ణము
2. చక్షువుకు-దృష్టి, అగ్నిసంబంధము: సమస్తప్రపంచములచూచును
3. శ్రోత్రము—శబ్దము, ఆకాశము: సకలధ్వనులను వినును.
4. జిహ్వ—రసం- అప్పుతో కూడుకొని నానారుచులను నెరుంగును (అప్పు = నీరు)
5. ఘ్రాణము—గంధము: పృథ్వితో సంబంధమై సుగంధ దుర్గంధముల నెరుంగును.

## జ్ఞానేంద్రియ పంచకలీనము

1. స్పర్శము—వాయువునందు, చర్మమునందు.
2. రూపము—అగ్ని, కన్నులందు.
3. రసం—ఉదకమందు, నాలుకయందు.
4 గంధం—పృథ్వినందు, ముక్కునందు
5. శబ్దము—ఆకాశమందు, చెవియందు.
6. వచనము—ఆకాశమందు, నోటియందు
7. గమనము—వాయునందు, పాదములందు.

## అంతఃకరణ చతుష్టయము

1. మనస్సు-సంశయించును. 2. బుద్ధి-నిశ్చయించును.
3. చిత్తము-చింతనచేయుచుండును
4. అహంకారము-నేను అని పలుకుచుండును.

## షడూర్మ్ముల వివరణము

1. ప్రాణధర్మములు—ఆకలి,దప్పి
2. మనోధర్మములు—శోకము, మోహము
3. దేహధర్మములు—జననము,మరణము.

## షడ్భావములు

1. అస్తి-గర్భమందుండుట. 2. వర్ధితే-పెరుగుట.
3. యపక్షయ్యతే-కృశించుట 4. జాయతే-పుట్టుట
5. పరిణమితే-వృద్ధిపొందుట 6. వినశ్యతే-నశించుట

## తాపత్రియములు

1. ఆధ్యాత్మిక తాపము—తలనొప్పి, కడుపునొప్పి, చలి,జ్వరములు.
2. అధిభౌతిక తాపము—చోర, వ్యాఘ్ర, సర్ప, వృశ్చిక, పిపీలకాదుల వల్ల వుపద్రవములు.
3. అధిదైవికతాపము—ఎండ, గాలి,వాన, పిడుగు వల్ల కలుగు ఉపద్రవములు.

ఇవన్నీ పంచకృత్యములనెడు పరబ్రహ్మము యొక్క సృష్టి స్థితి సంహార తిరోధానానుగ్రహములకు కారణుడుగా శ్రీసుబ్రహ్మణ్యేశ్వరుడు గోచరించుచున్నాడు. పంచకర్తలు: బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, సదాశివుడు. వీరికి అతీతుడుగా దృగ్గోచరమగు చున్నది శ్రీసుబ్రహ్మణ్యస్వామి విశ్వరూపప్రదర్శనము.

వేదము, కాలము, వస్తువు వీటిచేత వేరు పరుపబడనివాడును, చీకటిని సూర్యునివలె అజ్ఞాననాశకుడును, ఉత్తమమైన బ్రహ్మ జ్ఞానము చేత మాత్రమె తెలియదగినవాడును, తర్కశాస్త్రమందలి ప్రత్యక్షాది ప్రమాణములచేత తెలియదగినవాడును, స్థూల సూక్ష్మకారణోపాధులు లేనివాడును, విభాగింపబడుటకు వీలుకాని స్వరూపుడైఉన్నాడు. విశ్వరూపమూర్తిలో దర్శనమిచ్చుచుండిన శ్రీసుబ్రహ్మణ్యేశ్వరస్వామి.

ఓంకారము సాగరము వంటిదిగానూ, వేదములన్నీ నురుగుల వంటివి గానూ దేవసేనాధునిలో కన్పించుచున్న సప్తసముద్రములలో గోచరించుచున్నవి.

దేవతలందరూ విస్మయులై శరీరములు పడకుచుండ "అహా! శివకుమారుడు బాలుడేకదాయని భ్రాంతిలో పడినామే! ఎంతటివాడో పూర్తిగా తెలిసికొనుటకు ఆ ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులకే తప్ప మరెవ్వరికి అంతుచిక్కని శక్తిసంపన్నుడీ శక్తి కుమారుడు!" అని లోలోన అనుకొనుచూ, బాహ్యముగా "స్వామీ! నీ పూర్తి విశ్వరూపాన్ని మా చక్షువులు చూడలేకున్నవి! దయచేసి మమ్మల్ని పునీతుల్నిచేయ డానికి నీ దివ్యదర్శనాన్ని సంపూర్ణంగా మా కళ్ళకు కనిపింపచేయుము" అని వేడుకొనిరి.

శ్రీ సుబ్రహ్మణ్యుడు వారికి దివ్య చక్షువులను ప్రసాదించాడు. ఆయన కరుణతో అనుగ్రహించినందువల్ల పైన జెప్పబడిన సమస్త విశేషములను చూడగలిగినారు. వారికి యింకా అర్థం కాని వివరణలను క్రింది విధంగా ఉపదేశించినాడు.

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని నీతి, ధర్మ, భక్తి, జ్ఞాన వైరాగ్య ఉపదేశములు

దేవతలారా! ఆత్మకు విచారము కలుగనీయకూడదు. విచారము వలన చాలా నష్టములు కలుగును. క్రోధావేశమున ఉన్న సర్పము ఎట్లయితే మానవుని కఱచుచున్నదో, అట్లే విచారము ఆత్మధారిని నాశనము చేయుచున్నది.

ఏ ఆత్మధారికైతే నిరుత్సాహము, దైన్యము, విచారము కలుగుచుండునో అప్పుడు సర్వకార్యములు చెడిపోవుచుండును. మరియు ఆపదలలో చిక్కుకొనుచుండును.

తొల్లి దక్షయజ్ఞమునకు ఏగిన కారణాన మీరు యీ దీనావస్థకు లోనయి పరితపించు చున్నారు. సర్వేశ్వరుని చిద్విలాసమును తెలియక, ఆయన ఉనికిని గుర్తించని దక్షుని ఆహ్వానమును మీరు మన్నించి, యజ్ఞవాటికకు ఏగుదెంచినందు వల్లనే, ఆ అకృత్యమును ఆపలేని కారణాన రాక్షసభీతితో తమ తమ నెలవులు తప్పి విచారించు చున్నారు. ఇంకను ఆత్మతత్త్వవిచారమును చెప్పెద వినుడు.

కాలత్రయము—భూతము, భవిష్యత్తు, వర్తమానము.
శక్తిత్రయము—ప్రభుశక్తి, ఉత్సాహశక్తి, మంత్రశక్తి.
ధనగతిత్రయము—దానము, భోగము, నాశము.
తాపత్రయములు—ఆధ్యాత్మికము, అధిభౌతికము, అధిదైవికము.
క్రియాత్రయము—మణి, మంత్రము, ఔషధము.
త్రిమూర్తులు—బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు.
త్రిగుణములు—సత్త్వ, రజో, తమోగుణములు.
అవస్థాత్రయము—జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ
చతుర్వేదములు—ఋగ్, యజుర్, సామ, అథర్వణవేదములు.
సేనాంగ చతుష్టయము—రథ, గజ, తురగ, పదాతి దళములు.
చతుర్విధోపాయములు—సామము, దానము, భేదము దండము.
పురుషజాతి చతుష్టయము—భద్రుడు, దత్తుడు, కూచిమారుడు,
పాంచాలుడు
స్త్రీ జాతి చతుష్టయము—పద్మిని, హస్తిని, చిత్తిని, శంఖిని

నేను 'సుబ్రహ్మణ్యుడ'ను, సర్వము నేనై, సర్వాకారములునానై ఏకమై, సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేని సత్యము నేనై, శాశ్వతమై, పరిశుద్ధమై వేదవేద్యమై, సాకారమై, నిరాకారమై వెలుగుచున్న ఆ పరబ్రహ్మము నేనే అగుచున్నాను.

సత్యజ్ఞానానంద స్వరూపమై, కళాతీతమై, నామరూపక్రియలు లేనిదై, నిర్వికారమై, ప్రత్యగాత్మ స్వరూపమై, సర్వోత్కృష్టమై, అవాఙ్మానసగోచరమై, నిత్యమై, నిఖిలమై వెలుగుచున్న ఆ పరబ్రహ్మము నేనే అగుచున్నాను.

దృష్టి, ద్రష్ట, దృశ్యములనెడి త్రిపుటిని మీరినదయి, యిట్టి దట్టిదని చెప్పనలవిగానిదయి, అఖండ సచ్చిదానందమై, ఎరుకమరుపులు లేనిదయి, జీవ వికారములులేనిదయి, స్వయం ప్రకాశమయి, బట్ట బయలయి, సత్తామాత్రమయి, సమరసమయి, ఏకమయి, పరిశుద్ధమయి ఏ పరబ్రహ్మము ప్రకాశించుచున్నదో ఆ పరబ్రహ్మము నేనే.

ఖండాఖండములు కానిదయి, హెచ్చుతక్కువలు లేనిదయి, బ్రహ్మానందమయి, అద్వితీయమై (తనకు రెండవది లేనిదయి), పరిశుద్ధమై, వేదవేద్యమై, యేపరబ్రహ్మము భాసిల్లుచున్నదో ఆపరబ్రహ్మమును నేనెయగుచున్నాను.

దేహమును నేను, యింద్రియములు నేను' అంతః కరణమును నేను, మనస్సు నేను, అహంకారమును నేను, ప్రాణవర్గమును నేను, సమస్త జీవరాశులు నెను, క్షేత్రవిత్తాదులు నేను, కర్మను నేను, సాక్షిని నేను, ప్రత్యగాత్మయగు పరబ్రహ్మమును నేను.

నాకంటె అన్యముగా అణుమాత్రవస్తువైనను లేదు. అద్దమందలి ప్రతి బింబము రీతిగా జ్ఞానానంద పరబ్రహ్మమగు నాయొక్క ప్రతి బింబములే ఈ చరాచర జగత్తును నెనె.

నాలోనెనై, మీలో నేనై, అన్న నెనే అయివున్నాను. బ్రహ్మ, విష్ణువు, శివుడు, తొమ్మండుగురు ప్రజాపతులు, దేవేంద్రుడు, కుబేరుడు, మృత్యువు, యముడు చంద్రుడు, సూర్యుడు, సముద్రుడు, పితృదేవతలు, అష్టవసువులు, సాధ్యులు, అశ్వినీ దేవతలు, మరుత్తులు, మనువు అగ్ని, వాయువు మొదలగువారిలోని అంతర్యామియైన నెను వసంతాది ఋతువులకు కారణభూతుడనగుచున్నాను.

"ద్యౌస్సచంద్రార్క నక్షత్రం ఖందిశో భూర్మహోదధిః, మహ దేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః" అని చెప్పబడు స్వర్గము, చంద్ర సూర్యనక్షత్రాదులతోనుండు ఆకాశము, దిక్కులు, భూమి, సముద్రము ఇవన్నియు నాచే నిలిచియున్నవి.

"యసర్వజ్ఞ స్సర్వవిత్" అనిశ్రుతి చెప్పినవిధంగానే సర్వజ్ఞుడను నేనగుచున్నాను. సర్వోద్భవుడనై సమస్త మంగళములకు నేనే కారణాధికారినగుచున్నాను దేవాసుర నమస్కృతుడను, నాతేజముచే ఇతర తేజములను మఱుగుపఱచువాడను, భువనేశ్వరుడను నేనే యగుచున్నాను.

త్రిమూర్తులను పూజించినా, త్రిశక్తికారూపులైన మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళిని పూజించినా ఆ పూజాఫలము వారి మూలముగా నేనే ఒసగు శక్తిమంతుడనై యున్నాను.

'ఏకత్వములో భిన్నత్వము' నేనే 'భిన్నత్వములోఏకత్వము 'నేనే. కావున ఓ బ్రహ్మ విష్ణు మహేంద్రాది దేవతలారా! నాఈ విశ్వరూపమును చూచితరించిన మిమ్ములను ఉద్ధరించు దేవసేనాపతిగా మీకు తోడ్పడు టకై వచ్చినాను. 'శివుడు' నేనే అయివున్నాను. 'శక్తి' ని నేనే అయి వున్నాను. మీకు జ్ఞాననేత్రము నొసంగిన నేను నా ఈ విశ్వరూపమును మఱుగుపఱుచుచున్నాను అంటూ షణ్ముఖుడు తన విశ్వరూప ప్రదర్శ నను చాలించినాడు.

పరమ సంతోషభరితులైనారు దేవతలు. సుబ్రహ్మణ్యుని పలు విధాల స్తోత్రము చేసినారు. నారద తుంబురులు పాడినారు. అచ్చరులు నాట్యమాడరి.

అప్పుడు ఇంద్రుడు షణ్ముఖుని మనసారా ధ్యానించి, ప్రణా మములర్పించి, "కరుణాసాగరా! అన్నీతెలిసిన సర్వజ్ఞుడవునీవు. అయినా తల్లిపాలకై పరితపించే బిడ్డవలె నిన్ను అర్థించుచున్నాను. శూరపద్ముని ఆగడములు మితిమీరినవి. వాని బానిసలై వూడిగములు చేయవలసిన దుస్థితిలో ఉన్నమాకు నీవే అభయమొసంగి, మమ్ములనుకాపాడవలెను" అని ప్రార్థించాడు.

అందుకు సుబ్రహ్మణ్యుడు 'తథాస్తు!' అని పలికి తనతో యుద్ధము చేసి అసువులు బాసిన దేవతలందరికీ ప్రాణ, జ్ఞానములనిచ్చి వారిని కృతార్థులను చేసినాడు. అందరూ ఉల్లాసమనస్కులైనారు. "రాక్షసబాధ తొలగిపోయినది. మనకిక శూరపద్ముడి గురించి భయభ్రాంతులు ఉండ" వని ప్రగాఢమైన విశ్వాసము కలిగియున్నారు.

## స్కందగిరి

తర్వాత శివకుమరుడు కైలాసమందున్న తన మాతా పితలను చూడనెంచి బయల్దేరినాడు. అతని వెంట బ్రహ్మాది దేవతలు రాగా.

కైలాస శిఖరాలలో ఒక పర్వత శిఖరాన్ని సుబ్రహ్మణ్యుని నివాసానికి యోగ్యమైనదని యెంచి, విశ్వకర్మను పిలిచి బహుసుందరమైన ఒక పట్టణాన్ని నిర్మించమని ఆదేశించినారు. విశ్వకర్మ తన చాతుర్యంతో సుందరమైన, దివ్యమైన పట్టణాన్ని నిర్మించాడు

బ్రహ్మ విష్ణ్వాది దేవతలు సుబ్రహ్మణ్యున్ని ఉచితాసనం మీద కూర్చొండనిచ్చి, వేదోక్తంగా తమ సేనాధిపతిగా పట్టాభిషేకం చేసినారు. అప్పటినుండి ఆ 'స్కంధగిరి' సుబ్రహ్మణ్యుని నివాసమైనది. శివబాలుని అనుమతి పొంది, దేవతలు సంతోషభరితులై తమ తమ నెలవులకు వెళ్ళగా, సుబ్రహ్మణ్యుడు'స్కంధమల' యందు నివశించుచుండెను.

## మేషవాహనము

ఇట్లుండగా పరమశివుని ప్రీత్యర్థము నారద మహర్షి ఒకయాగము చేసెను. ఆ యజ్ఞానికి మునిశ్రేష్ఠులూ, దేవతలూ విచ్చేసినారు. ఉన్నట్లుండి యాగగుండంలో అద్భుతంగా ఒక మేక ఆవిర్భవించింది. అది భయంకరంగా ఉండటం చూసి, అక్కడ చేరినవారందరూ ప్రాణభీతితో పరుగిడసాగారు. అది పెనుశబ్దంతో వారిని తరుమసాగింది. లోకమంతా చుట్టి అనేక మందిని సంహరించింది. నారదాది మునివర్యులు కైలాసానికి పరుగిడినారు. దారిలో శ్రీ స్కంధమలలోని సుబ్రహ్మణుని చూచి జరిగింది చెప్పారు.

శివబాలుడు వారిని చూచి, "భయపడకండి!" అని అభయమిచ్చాడు. వీరబాహుని చూచి, "ఆమేకపోతుని పట్టుకుని ఇక్కడకు తెమ్ము!" అని ఆజ్ఞాపించాడు. వీరబాహు లోకాలన్నింటినీ చుట్టి వస్తున్నాడు. ఎక్కడ వెదకినా ఆమేకపోతు కనిపించకపోగా చివరకు బ్రహ్మదేవుని నివాసమైన సత్యలోకమునకు వెళ్ళి వెతకినాడు సత్యలోకంలో అతిభీకరంగా నిలిచియున్న ఆమేకపోతుని చూశాడు. వెంటనే దాని కొమ్ములను పట్టుకున్నాడు. వీరబాహుని శక్తి ముందు మేషము నిలువలేక పోయినది. దానిని యీడ్చుకుంటూ 'స్కంధగిరి' లోని సుబ్రహ్మణ్యుని ముందు నిలబెట్టాడు.

సుబ్రహ్మణ్యుడు నారదుని చూచి, మునీంద్రా! మేషము నా అధీనములో ఉన్నది. మీరు యజ్ఞకార్యాన్ని నిర్విఘ్నంగా నెరవేర్చడానికి వెళ్ళండి!" అనిచెప్పాడు. నారదుడు సంతోషించి మళ్ళీ యాగశాలకు వెళ్ళాడు. దేవతలు సుబ్రహ్మణ్యున్ని చూచి, "దేవా! ఈ మేషాన్ని తాము తమ వాహనంగా ఉంచుకోండి" అని మొరలిడినారు.

సుబ్రహ్మణ్యుడు వారి అభ్యర్థనను మన్నించి మేషవాహనుడయి వారికి దర్శనమిచ్చినాడు. అప్పటికప్పుడే మేషవాహనుడయిన శక్తి కుమారుడు లోకాలన్నింటినీ చుట్టి వచ్చినాడు.

## ప్రణవార్థము

'గుహుడు' బాలుడైనా అనేకమైన అద్భుతాల్ని యిలా చేస్తున్నాడు ఇలా వుండగా ఒకనాడు కైలాసమందు శివదర్శనార్థమై వచ్చిన చతుర్ముఖుని చూశాడు. దేవతలను తోడ్కొని వస్తున్నాడు బ్రహ్మదేవుడు. ఎదురుగా తాను ఉన్నానని గుర్తించకుండా 'సఃవ' కైలాసాంతరాగానికి దేవతలకు నాయకత్వంవహించి వెళ్తున్నాడు. బ్రహ్మదేవుని తిరస్కారాన్ని గ్రహించాడు కార్తికేయుడు. 'ఇలారా!' అని బ్రహ్మని పిలిచాడు. దాపునకు వచ్చాడు బ్రహ్మదేవుడు. సాగిలపడి తనకు నమస్కరించ లేదు చతుర్ముఖుడు. అంజలి ఘటించి తన ముందు నిలబడలేదు. వాణీపతి యొక్క అంతరంగాన్ని గ్రహించిన షణ్ముఖుడు చతుర్ముఖుని చూచి, "నీవు చేయుపనియేమి?" అని ప్రశ్నించాడు.

"నేను ప్రాణకోటిని సృష్టించువాడను. పరబ్రహ్మయైన శివాజ్ఞ బడసి సృష్టి కర్తగా ఉన్నాను" అని ప్రత్యుత్తరమిచ్చాడు విధాత.

"అలాగా! అయితే చతుర్వేదములలో ఒక్కటైన ఋగ్వేదం గురించి చెప్పుము" ని చతుర్ముఖుని ఆదేశించాడు షణ్ముఖుడు.

ఋగ్వేదం గురించి చెప్పడానికి ఉద్యుక్తుడైన బ్రహదేవుడు, "ఓం" అని ప్రారంభించాడు వెంటనే శివశక్తి బాలుడైన సుబ్రహ్మణ్యుడు, "అగు! 'ఓం' అనే ప్రణవాన్ని వివరింపుము!"అని ఆజాపించాడు.

ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నాడు బ్రహ్మదేవుడు. తటపటా యిస్తున్నాడు. తారకమంత్ర రహస్యాన్ని తెలియదని చెప్పలేక శివకు మారుని ముందు తలవంచాడు బ్రహ్మ.

"ఓం కారం గురించి తెలియని నువ్వుసృష్టికర్తగా నీ విధులను ఎలా నిర్వహించగలవు?" అని చెబుతూ అక్కడ ఉన్న తన పరివారాన్ని చూచి, "ఈ చతుర్ముఖుని బంధించి చెరసాలలో వేయండి" అని ఆదేశ మిచ్చాడు. బ్రహ్మస్కందమలలో బందీ అయినాడు. తదుపరి శ్రీసుబ్రహ్మణ్యేశ్వరుడు ఏకముఖుడై, నాలుగు హస్తములూ, జపమాలా, కమండలమూ ధరించినవాడై సృష్టి బాధ్యతను తానే వహించి, బ్రహ్మకన్నా మిన్నగా సకల జీవకోటిని సక్రమంగా సృష్టిస్తున్నాడు. ఇలాచాలాకాలం జరుగుచుండగా, నారాయణుడు దేవతలు వెంటరాగా కైలాసవాసుని దర్శించడానికి యేతెంచినాడు.

నంది అనుమతి బడసి కైలాసపతిని చేరాడు నారాయణుడు. సర్వజ్ఞుడై న పరమ శివునికి నారాయణాది దేవతల రాకకు కారణం తెలియనిదికాదు. అయినా అడిగాడు. "పరంధామా! నీరాకలోని విశేషమేమి?"

లక్ష్మీపతి ఉమాపతిని చూచి, "సర్వేశ్వరా! నీకు తెలియనిదేమి ఉన్నది? వాణీపతియైన బ్రహ్మదేవుని సుబ్రహ్మణ్యుడు చెరబెట్టాక. సరస్వతీదేవి బ్రహ్మను గురించి విచారించుచున్నది. కనుక బ్రహ్మదేవుని విడిపించవలయునని ప్రార్థించు వారము" అన్నాడు.

పరబ్రహ్మ 'బ్రహ్మ' కు పట్టిన గతిని తలచి, చిరునవ్వునవ్వాడు. నారాయణాది ప్రముఖులు తోడురాగా 'స్కందగిరి'కి వచ్చాడు. శివకుమారుడు ఆదిదేవుడైన తన తండ్రి ఎదుట సవినయంగా నమస్కరించి నిలబడ్డాడు. తన మామయైన నారాయణుని ఉచితరీతిని పలకరించాడు ఇంద్రాది దేవతలనూ, నారదాది మునీంద్రులను కుశలమడిగి అందరినీ ఉచితాసనాలలో కూర్చోమని కోరాడు.

జగదీశ్వరుడు కుమారస్వామిని చూచి "కుమారా! సృష్టికర్తయై, త్రిమూర్తులలో ఒకడైన 'విధాత'ను నీ చెరనుండి విడిచివేయుము!" అన్నాడు.

"ప్రణవార్థాన్ని వివరించడం చేతగానివాడా సృష్టి కార్యక్రమాన్ని నిర్వర్తించడము? తనకు తెలియని విషయాన్ని 'తెలియద'ని వినయంతో ఒప్పుకొనేవాడే సమర్థుడు కాగలడు! కానీ తన అజ్ఞానానికి సిగ్గు పడుతున్నాడే తప్ప వినయశాలికాడీ బ్రహ్మ! పైగా అహంకారపూరితుడు! అందువల్లనే నాబందీయైనాడు" అన్నాడు శక్తిబాలుడు.

వెంటనే శివుడన్నాడు "కుమారా! నీవుచేయునది మంచిదికాదు. నందిని పంపినా తిరస్కరించినావు. ఇప్పుడు నేనే వచ్చి అడుగుతున్నాను. కాదంటావా?"

తండ్రి కోపంగా ఉన్నాడని గ్రహించిన కుమారస్వామి, "తండ్రీ! బ్రహ్మదేవుని విడుదల చేయమని తాము ఆజ్ఞాపిస్తే కాదనగలనా?" అన్నాడు. వెంటనే తన పరివారంలోని భూతగణాలను పిలిచి సత్య లోకాధిపతియైన 'విరించి' ని పిల్చుకొని రమ్మన్నాడు.

చెరనుండి విడిపించబడ్డాక బ్రహ్మదేవుడు శివుడు ముందుకు. తీసుకొని రాబడినాడు. పరమేశ్వరునికి సాగిలబడి నమస్కరించి నిలబడ్డాడు. బ్రహ్మదేవుడు కైలాసపతియైన శివునితో "సుబ్రహ్మణ్యుడు నన్ను చెరలో వేయించిన తర్వాత నాలోని అహంకారం నశించింది" అన్నాడు "నీ సృష్టికార్యక్రమాల్ని నీవే నిర్వర్తించు" మని బ్రహ్మను అనుగ్రహించాడు పరబ్రహ్మ.

తర్వాత కుమారుని తన తొడమీదకూర్చొబెట్టాడు. "చతుర్ముఖునికి తెలియని ప్రణవమంత్ర రహస్యాన్ని నీవేచెప్పుము" అని అడిగాడు త్రినేత్రుడు.

"తండ్రీ! ప్రణవ మంత్రరహస్యాన్ని బహిర్గతంగా వివరించడం సరికాదు. నియమానుసారంగా తారకమంత్రాన్ని వివరిస్తాను. నేను. గురుస్థానంలో ఉంటాను. తాము శిష్యరీతిని నానుండి ఆ రహస్యాన్ని సవివరంగా తెలిసికొనవచ్చును." అన్నాడు కుమారస్వామి. స్వాములకే స్వామియైన జగదీశ్వరుడు'వల్లె' యన్నాడు.

"ఆయిదే నావెంట రండి!" అని ఆహ్వానించాడు. బ్రహ్మాది దేవతలు అనుసరించగా కుమారస్వామి కుంభకోణం సమీపంలో ఉన్న 'స్వామిమల' అనే ప్రదేశానికి మహేశ్వరునితోడ్కొని వచ్చాడు.

కుమారస్వామి 'గురుస్వామి' రూపంలో ఆసీనుడైనాడు. మెడలోనూ, భుజాలకున్నూ, మణికట్టులకున్నూ రుద్రాక్షలు ధరించినవాడై కాషాయాంబరాలు ధరించాడు సుబ్రహ్మణ్యుడు. ఈ రూపాన్నే 'కుమారగురు' అనియూ, 'జ్ఞానపండితుడు' అనియూ ద్రవిడ భాషలలో ఒక్కటైన తమిళభాషలో చెప్పబడినది.

శిష్యోరికం చేయువచ్చిన తారకబ్రహ్మమూర్తియైన, పరబ్రహ్మ, దక్షిణామూర్తి సనక, సనందన, సనత్కుమార, సనత్‌సుజాతు, పరసర ప్రజాపతులకు తన మౌనవ్యాఖ్యతోనె జ్ఞానోపదేశాన్ని గావించిన ఆ సదాశివుడె యిప్పుడు తన ప్రతిరూపమైన 'కుమారగురుస్వామి' కి శిష్యుడైనాడంటే, శివలీలలను అర్థం చేసికొనుట అంత సులభమైన విషయంకాదు. బాలుడైన 'కుమారగురువు' 'జ్ఞానవృద్ధునివలె' 'పండితప్రకాండునివలె' 'సర్వజ్ఞుని' భంగి కళాకాంతులీనుతూ, అనంతకోటి భాస్కర సదృశమైన తేజోవిరాజితుడై ఆసనం అలంకరించి వున్నాడు.

మాయామోహిస్వోతుడైన నారాయణుడు, సృష్టినాథుడైన విధాత, సురలోకపతి దేవేంద్రుడు, నారద తుంబురాది గానకళానేవిదులూ, రంభాదినాట్యవిధుషీమణులూ, అందరూ దూరంగా కైమోడ్చి నిలబడ్డారు.

జగదీశుడు కుడిమోకాలిపై అనుకుంటూ, ఎడమ అరచేతిని కుడిమోచేయి క్రింద ఆచ్చాడు. కుడిఅరచేయిని తన ముక్కుపైఉంచాడు. శిష్య భంగిమలో తన క్రింద కూర్చొనిన పరమశివుని చెవిలో తారక బ్రహ్మ మంత్రమగు ప్రణవ రహస్యాన్ని సాకల్యంగా వివరించిచెప్పాడు జ్ఞానపండితుడు. "అకార ఉకారో మకార ఇతి త్ర్యక్షరం ప్రణవమ్" అనేది చక్కగా, విస్తారంగా చెప్పిన కుమారుని చూచిన తండ్రి పులకాంకితుడయినాడు.

శివుడు ముఖ్యమూసికొని ప్రణవ రహస్యాన్ని వింటున్నంతసేపు సకల భువనములు నిశ్చలమైనది. సమస్త జీవకోటి ఎలాఉన్నదో అలాగే నిలచిపోయింది. శివచైతన్యం సర్వభూతకోటికిన్నీ చైతన్యాన్ని, జీవాన్నీ ప్రసాదిస్తున్నది. కొంతసేపలా స్తంభించియుండిన లోకాలన్నీ మరలా యథాతథంగా చైతన్యవంతమై, ఏమిజరిగిందో తెలియకుండానే కాల వాహినిలో తమ వంతు పాత్రధారణ చేయసాగింది.

కుమారుని శక్తిసామర్థ్యాలను పలువురు హర్షించి శ్లాఘించినపుడు ఏ పితృ హృదయమైనా ఆనందడోలిక లూగుతుంది. సర్వేశ్వరునికి కూడా అలాగే ఉన్నది అయినా శిష్యస్థానంలో తనను క్రింద కూర్చోనిచ్చి, తన కుమారుడుపైన పీఠంలో కూర్చోవడమే గాకుండా ఎడమ పాదాన్ని కుడిమోకాలిపై ఉంచి, కుడి చేతిలో అభయ ముద్రను చూపుతూ గురు స్థానాన్ని అలంకరించడం చేత, జ్ఞానగురువైన సుబ్రహ్మణ్యునికి, ఏ ఆల యంలోనూ నిలబడిఉండేలా తప్ప కూర్చొని వున్నభంగిమలో **(Sitting Posture)** ఉండరాదని శివుడు శాపమిచ్చాడని కొందరు చెప్పియున్నారు ఇది నిజమో కాదో గానీ మనం సందర్శించే సుబ్రహ్మణ్యాలయాల్లో **(Standing Posture)**నిలిచిఉన్న భంగిమలోనే కుమారస్వామి దర్శన మిస్తున్నాడు కాబట్టి, శివుడలా సెలవిచ్చియుండవచ్చునని భావించుట సరియే!

కలియుగంలో శ్రీసుబ్రహ్మణ్యస్వామిని ఆరాదించే వారికి పూర్వ జన్మ సుకృతం వుండితీరాలి. అలా నిర్మలమనస్కులై ఆయనను ఆరా ధించిన భక్తకోటిని ఆయన తప్పకరక్షించి తీరుతాడని తమిళంలోని 'ఆశిరి యర్ విరుత్తం' అనే గ్రంథంలో చెప్పియున్నారు.

ఇందుకు నిదర్శనంగా ఒక గాథ ఉన్నది. సర్వేశ్వరుడైన కైలాస పతిని మాత్రమే స్తుతించి, కుమారస్వామిని తలంపని 'నక్కీరుడు' అనే పండితవర్యుని ఎలా అనుగ్రహించాడో ఇప్పుడు తెలుసుకుందాము

'నక్కీరుడు' తమిళవాఙ్మయ సంఘాధ్యక్షుడుగా ఉన్న తరు ణంలో 'తిరుప్పఅంగున్రం' అనేవూరిలో(ఇప్పుడది సుప్రసిద్ధ సుబ్రహ్మణ్య

క్షేత్రము ) తటాకానికి ఎదురుగా ఒడ్డుమీద ఆసీనుడై, జపమాల త్రిప్పుతూ ధ్యానంలో ఉండినాడు. అప్పుడు రావిచెట్టుయొక్క ఆకు విలక్షణంగా అర్ధభాగం చేపగానూ, మరో సగభాగం పక్షిగానూ రూపం మారి, ఒకదానినొకటి యీడ్చుకుంటూ తటాకంలో కదులుతోంది. జప మాలను త్రిప్పడం మఱచిపోయి నక్కీరుడు దానినే నిశితంగా చూడ నారంభించాడు. వెంటనే వాటి శరీరాలను విభజించాలనే సంకల్పం కలిగింది నక్కీరునికి. వాటి శరీర కండరాలను గిల్లి వేరుచేశాడు. వెంటనే అవి మరణావస్థ పొందిన కొన్ని క్షణాల తర్వాత చనిపోయినవి. 'ఈ మహాపాపాన్ని ఎందుకు చేశాను?' అని కుములుతున్న నక్కీరుని, శివ కుమారుని భూతగణాధిపతి బంధించి, ఒక కొండగుహకు చేర్చాడు. ఆ గుహలో గర్గిముఖి అనే గుర్రం మొహంవున్న అడ భూతముఅప్పటికే 999 మందిని బంధించియున్నది. నక్కీరుని రాకతో బందీల సంఖ్య వెయ్యి అయినది. ఆ భూతానికి 1000 మందికి తక్కువలేకుండా ఆహారం తీసికొనే పద్ధతి వున్నది.

"ఈ నక్కీరుడొకడు చేరాక మనం వెయ్యిమంది అయినాము. ఇక మన ప్రాణాలు మనవి కావ"ని అక్కడ బందీలయిన వారందరూ శోకించుచుండిరి.

"నేను శివుణ్ణు స్తుతించి, సుబ్రహ్మణ్య స్వామిని స్తుతించక పోవడం వల్లనే నాకీ దుర్గతి పట్టినది" అని వగచుచూ నక్కీర కవి సుబ్రహ్మణ్యునిపై పాడాలని ప్రయత్నించగా, శంభునందనుడు తానే నక్కీరునికి పాటలోని మొదటి పదాల్ని యిలా అందించాడు.

"ఉలగం వువప్ప..." అని అందించిన వెంటనే నక్కీరకవి "తిరుమురుగాత్రుపడై" అనే స్తోత్ర మాలతో శ్రీ సుబ్రమణ్యస్వామిని కీర్తించాడు. ఆ కీర్తనలను విని ఆనందించిన సుబ్రహ్మణ్యుడు తన చేతిలోని బరిశెను (వేలాయుధం అని తమిళంలో చెప్పబడుతున్న శక్తి అయుధమిది) ప్రయోగించగా, ఆశూలాయుధము ఆ గుహను భేదించు కొంటూ వెళ్ళి గర్గిముఖి అనే అభూతాన్ని సంహరించి, నక్కీరునితోబాటు యితర బందీలను గుహనుండి తప్పించినది.

'స్వామి'కే 'నాథుడు' అయిన కుమారగురువు ప్రణవార్థాన్ని అలా పరమేశ్వరునికి ఉపదేశించిన తర్వాత "స్వామినాథుడు" అనే పేరు కలిగి, స్వామిమలలో తన దేవేరులైన వల్లీ దేవసేనాసమేతంగా నుంచున్న భంగిమలో దర్శనమిస్తూ, భక్తులకు జ్ఞానోపదేశము కావిస్తున్నాడు.

## ఇద్దరు కన్యారత్నములు

గురూపదేశం పొందినట్లుగా ఓంకారమే స్వరూపంగా గలిగిన కైలాసనాథుడు స్వామి నాథుని తోడ్కొని కైలాసం చేరాడు.

అప్పుడు వైకుంఠంలో నారాయణుని పుత్రికలైన, అమృతవల్లి (దరిమిలా 'దేవసేన' అనే పేరుగాంచినది), సుందరవల్లి (మరుజన్మ యెత్తి 'వల్లిమల'లో 'శ్రీవల్లి' గాపేరుగాంచినది) అనే కన్యారత్నములు ఇర్వురూ శ్రీ సుబ్రహ్మణ్యుని వివాహమాడాలనే సంకల్పంతో తపస్సు చేయుచుండిరి.

అమృతవల్లి తదేక ధ్యాన నిమగ్నయై నిరంతరం శ్రీ సుబ్రమణ్యే శ్వరుని, తన ప్రాణేశ్వరునిగా భావించినదై అతని పదరాజీవములనే స్మరించుచూ తపస్సు చేసినది.

సుందరవల్లి తనకు తోచినప్పుడు సుబ్రహ్మణ్యారాధన చేయుచూ, తతిమా వేళలందు ఆటపాటలందు లీనమైయుండినది.

ఇలా పదివేల సంవత్సరములు జరిగినవి. అప్పుడు ఆ కన్యారత్న ముల ముందు కార్తికేయుడు ప్రత్యక్షమైనాడు.

"కన్యామణులారా! మీరు యుక్తవయస్కులైయుండియూ, ఏమి కోరి నన్నారాధించు చున్నా" రని వారిని అడిగాడు.

"కరుణా సముద్రా! మాఇరువురినీ నీ సహధర్మ చారిణులుగా స్వీకరించి మమ్ములను కృతార్థులను చేయు" మని నుడివారు.

"విష్ణుసుతలారా! మి అభీష్టము నెరవెరుటకు మరికొంత వ్యవధి యున్నది. అమృతవల్లీ! నీవు నీ పెద్దనాన్న అయిన దేవేంద్రుని కడకు

వెళ్లుము. ఇంద్రకుమారిగా ఇంద్రునికడ కొంత కాలము ఉండుము. కొన్నాళ్ళలోనిన్ను నేను పరిణయమాడెదను సుందరవల్లీ! నీవు నిరంతర ధ్యాననిమగ్నురాలవై నన్ను ధ్యానించలేదు. కావున భూలోకమునశివముని తపమాచరించు పుణ్యస్థనంలో ఆయన పుత్రికగా జన్మించుటకు ముందు అక్కడ ఇరవైవేల సంవత్సరములు నన్ను ధ్యానించి తపమాచరించు చుండుము. నేను నిన్ను పాణిగ్రహణమొనర్చుటకు వచ్చెద" నని అంతర్హితుడాయెను.

విష్ణుదేవుని పుత్రికలైన అమృతవల్లి, సుందరవల్లి అనే కన్యామణులలాగే ఒకరు దేవేంద్రుని దత్తపుత్రిగానూ, మరొకరు శివముని పుత్రిగా పెరుగుతున్నారు. దేవేంద్రుడు అమృతవల్లిని ఐరావతమనే తెల్ల ఏనుగు కు అప్పగించాడు. అప్పటినుండి అలలనామణి ఆ ఐరావతం యొక్క పోషణలో ఉండగా, సుందరవల్లి భూలోకంలో భారతదేశమందలి దక్షిణాపథంలోని (రాయవెల్లూరు సమీపం) 'వల్లిమల' అనే కొండపై విష్ణుమూర్తి 'శివముని' అనే నామధేయంతో తపస్సు చేస్తూ ఉండగా— అముని ఎదుట లక్ష్మీదేవి జింక రూపంలో సంచరించుచుండెను. ఆయన ఆజింక సౌందర్యాన్ని చూచి మోహించిన వెంటనేఅ జింక సద్యోగర్భాన్ని దాల్చి అడశిశువును ప్రసవించినది తనలాగా లేని ఆశిశువుని చూచి అ జింక భయపడి పారిపోగా, తన తపస్సుకు భంగం కలిగిందని చింతించి శివముని మరోచోటికి వెళ్లిపోయాడు.

తమిళంలో 'వెళ్లికియంగు' అంటే రాయలసీమ వారి వ్యవహార' భాషలో 'గెణుసుగడ్డ' యనీ—సర్కారీ వారి వాడుకలో 'చిలగడ దుంప యనీ' అర్థము. వళ్లిమల లో గోతులు త్రవ్వి ఆ గోతులలో అదుంపలను నిలవ యుంచడం అప్పటి వారి వాడుకైనందున, ఆ 'వళ్లీ' దుంపలలో సుందరవల్లి ఆడశిశువై జన్మించి యుండగా, ఇంద్రుడు గిరిజన నాయకుడై ఆ కొండ పరిసర ప్రాంతానూ పాలించుచుండెను. తన పరివారంతో అచ్చట తిరుగుచుండగా శిశురోదనము వినిపించి 'వల్లిని' కనుగొన్నాడు. సంతానా పేక్షతో అలమటించుచుండిన అతడు ఆ శిశువుని తన భార్యకిచ్చినాడు. అప్పటినుండి ఆ శిశువు ఆ కొండలలో పెరిగి పెద్దదైనది. ఆ కొండలోనే

ఉత్తర దిశన 'పర్వతరాజుగుండు' అనే పవిత్రమైన చోటునందు సూర్య రశ్మిసోకని జలాశయమున్నది. ఈ జలాశయమ్మునకు ఆగ్నేయ దక్షిణము నందు వినాయకుని ప్రతిబింబించే సహజ శిలాగణపతి ఉన్నది. తూర్పు భాగాన 'తిరుప్పుగళ్ స్వామి ' వారి సమాధి భూగర్భమందున్నది. ఒక రాతి మందిరముగా, పైన బండ కప్పుగా అమరిన యీసమాధికి ఎందరో భక్తులు వచ్చి పూజలు చేసి తమ గురుభావాన్ని ఉద్దీపనం చేస్తూ, సంవత్సరానికొక్కసారి అన్నదానములు, సమాధిపూజలు చేస్తుంటారు. ఈ 'తిరుప్పుగళ్' స్వామి–శ్రీ సుబ్రహ్మణ్యస్వామిని [శ్రీ అరుణగిరినాథస్వామి కీర్తించి పాడిన] 'తిరుప్పుగళ్' అనే గ్రంథంలోని పాటలను తంబురా మీటుతూ శ్రావ్యంగా పాడేవారు.

నేను శిసువుగా ఉన్నప్పుడు శ్రీ తిరుప్పుగళ్‌స్వామి వారి పొట్టమీద కూర్చొని ఆయన నన్ను ముద్దాడారని మాయింటిలో చెబుతుంటారు. నా భాగ్యమని భావిస్తే అతిశయోక్తి కాదను కుంటాను. మహానుభావులైన మహర్షులను సందర్శించడం విశేషమైన పుణ్యఫలమని చెబుతారు. వారితో సంభాషించడం కూడా అంతే కదా! ఇక స్పర్శన భాగ్యం గురించి వేరే చెప్పాలా? అందుకానేమో నాకీ గ్రంథరచన చేసే భాగ్యం లభించింది.

'వళ్లిమల' యొక్క ప్రాశస్త్యం మాటలకతీతమైనదని అనుభవజ్ఞులు చెప్పియున్నారు. భారతదేశమందలి అన్నిపుణ్యక్షేత్రాల మహిమలను ఒక్క యీ క్షేత్రమందే కనుగొనవచ్చునన్ని కూడా చెప్పియున్నారు. కనుక భక్తులు తమ అభీష్టసిద్ధికోసం–ఐహిక–పారమార్థిక సౌఖ్యంకోసం యీక్షేత్రాన్ని సేవించి తరించవచ్చునని నా ప్రార్థన.

## యుద్ధారంభము
## దేవతలు మొరలిడుట

శూరపద్మాసురుడు మొదలుగాగల రాక్షసుల అగడమ్ముల నుండి విముక్తిని పొందాలని ఎన్నో సంవత్సరాలనుండి దేవతలందరూ బాధపడుతూ వున్నారు. శివపార్వతుల కళ్యాణం అయింది గనుక కుమార

సంభవంతో తమ కష్టాలు గట్టెక్కి పూర్వవైభవం తో స్వతంత్రముగా. విలాసవంతంగా సమస్త భోగాలనుభవిస్తామని ఎదురు చూస్తున్నారు, స్కందుడేమో శూరపద్ముని సంహరించడానికి యింకా సమాయత్తం కావడం లేదని విచారించి, దేవతలందరూ కైలాసానికి చేరారు. నందీశ్వరునికి మ్రొక్కి శివదర్శనానికి అనుమతి వేడినారు.

"దేవతలారా! సర్వేశ్వరుని దర్శించు సమయమిది కాదు. అందు వల్ల తాము మరికొంత కాలమిక్కడే వుండండి. అవకాశం చిక్కినప్పుడు మిమ్ములను పరమేశ్వరుని వద్దకు గొంపోయెద" నని నందిపలికెను. తదుపరి దేవతలందరూ కైలాసప్రవేశ ద్వారము సమీపమున నిలిచి యుండిరి

చాలాకాలము గడచినది మరలా నందిదేవుని కడకేగి నమస్కరించినారు. మహేశ్వరుని దర్శనం చేయ తోడ్పడమని నందిని వేడుకొన్నారు. దేవతల మనోవిచారము పోగొట్టవలెనని నంది సుముఖుడై— కైలాస మందిరము లోపలికి వెళ్లి జగదీశుని పాదములకు ప్రణమిల్లినాడు.

"దేవాధిదేవా! సర్వేశ్వరా! దేవతలందరూ తమ దర్శనార్థమై చాలా కాలము ప్రవేశద్వారము కడ కైమోడ్చి మిమ్ములను శరణాగతికోరి నిలిచి యున్నారు. శూరపద్మాసురుని దురాగతములచే శక్తిహీనులై, తమ బలము కోల్పోయి, నిర్వీర్యులై, నిస్తేజులై, పదవీభ్రష్టులై పరితపించుచున్నారు. వారిని తమ దర్శనార్థమైగొని తేవ అనుమతించవలెను" అని విన్నవించెను. పరమేశ్వరుడు 'వల్లె' యనగానే, నందీశ్వరుడు దేవతలను కైలాసాంతర్భాగాన కొలువునకుగొని తెచ్చెను సదాశివునికి సాష్టాంగ దండ ప్రణామము లర్పించి, వేద మంత్రములు పఠించి, లోకేశ్వరుని ప్రసన్నుని జేసికొనిరి దేవతలు. స్తోత్రప్రియుడైన గిరిజాపతితో అసురుల దుర్మార్గాల నుండి కాపాడమని ప్రార్థించారు.

పరమేశ్వరుడు వారి మొరలనాలకించి తద్విషయమై పార్వతీ దేవితో చాలాసేపు చర్చించాక. కుమారస్వామిని దగ్గఱదీసి శిరము మూర్కొనుచూ, "సుబ్రహ్మణ్యా! నీవు తక్షణమే నా అజ్ఞానుసారముగా

బయల్దేరి ఘోరకంటకులైన శూర, సింహముఖ, తారకాది అసురులను దునిమి—రాక్షస నిర్మూలనము గావించి, విజయుడవై రావలె" నని కుమారుని కౌగలించుకొనుచూ పలికెను.

తదుపరి తన అధీనములోనుండు పదకొండు రౌద్రాస్త్రములను శిఖి వాహనునికిచ్చెను. అంతేగాకుండా అతిభయంకరమైన శక్తివంతమైన దివ్యాయుధములనెన్నో ఇచ్చెను. తోమరమూ, పెద్ద కత్తి, శ్రేష్ఠమైన వజ్రాయుధము, ధ్వజాయుధము, బాణము, అంకుశము, కమలాయుధము, కోదండము, బరిశె, ఘంటాయుధము,—యిత్యాదులున్నూ—శక్త్యాయుధము సహా శ్రీసుబ్రహ్మణ్యునికిచ్చి అనుగ్రహించెను. ఇకగాక స్వర్ణ కవచము, దివ్యరథము, అంబులపొది, కత్తి మొదలుగా అనేక మిచ్చెను పార్వతీపరమేశ్వరులు తమ శిరము మూర్కొనుచూ — ఆలింగనము చేసికొని ముద్దాడిరి. ఎటువంటి వరప్రసాదియైన శత్రువైననూ. తమ కుమారుని జయింపవీలుకాని రీతిన ఆశీస్సులు పల్కిరి.

శ్రీసుబ్రహ్మణ్యుడు పార్వతీ పరమేశ్వరులకు ప్రదక్షిణములు చేసెను. భక్తితో తల్లిదండ్రుల చరణారవిందములను తాకి నమస్కరించెను. వీరభాహుతో చేరినవవీరులనూ, లక్షమంది గణాధిపులనూ, పరమేశ్వరుడు స్కందునికి తోడిచ్చి వీడ్కోలు పలికెను. దేవదుందుభులు మ్రోగెను. పుష్పవర్షము కురిసెను. యుద్ధాసక్తులై, సమాయత్త చిత్తులైన వీరులు వెంటరాగా షణ్ముఖుడు యుద్ధభూమికి వెడలెను, గణాధిపులూ, రథగజ తురగ పదాతి చతురంగ బలములు పదఘట్టనములు సమరోత్సాహముతో చేయగా క్రమ్మిన భూధూళి ఆకాశమందలి మేఘములను మూసివేసినది కడలిఘోష కన్నా మిక్కుటమైన శంఖ, తూర్యాది రవములు దిక్కులన్నింటా వ్యాపించగా అష్టదిక్పతులందరూ ఆశ్చర్యనిమగ్నులైరి. ఇలా బయల్దేరిన కుమారస్వామి సేనలు గంధమాదన పర్వతమును చేరినారు. వారి అక్కడినుండి హేమ కూటాద్రిని చేరినారు. వారి యెదుట క్రౌంచశిఖరమున్నూ తారకాసురుని మాయాపురియూ ఉండెను అప్పుడు మన మహంతిని మీటుచూ త్రికాల జ్ఞాని యైన 'నారదుడు, అక్కడికి వచ్చి చేరెను.

'నార' అనగా 'జ్ఞానము'. 'ద' అనగా ఇచ్చువాడని అర్థము. నారదుని రాక శుభముగా ముగియునని తెలిసికొనవలెనె గాని 'కలహభోజనుడ' ని గ్రహించుట అవివేకము. ఈ నారదుని వల్లనే నిషాదుడు తారక మంత్రము గురూపదేశముగా పొంది 'వాల్మీకి' అయ్యెను ఇదే నారదుని గురూపదేశం వల్ల లీలావతి గర్భస్థ శిశువైన ప్రహ్లాదుడు భక్తి తప్పరుడాయెను. పాపులను శిక్షించి, శిష్టులను రక్షించు నిమిత్తమై నారాయణుడవరితంచినపుడెల్ల, నారదుడు ప్రముఖ పాత్ర వహించుచుండెను

నారదుని జూచి దేవతలందరూ నమస్కరించిరి. నారదుడు శ్రీ సుబ్రహ్మణ్యుని పలువిధముల స్తుతించి, నమస్కరించుచూనిలబడెను

## తారకుడు

శ్రీ సుబ్రహ్మణ్యు జూచి నారదుడిట్లు పల్కెను "దేవసేనాపతి! శివకుమారా! పార్వతీనందనా! ఇదిగో చూడుము. ఈ క్రౌంచశిఖరము ఒక శక్తిమంతమైన రాక్షసుడిగా పూర్వము ఉండినదై, తర్వాత అగస్త్యముని శ్రేష్ఠుని శాపము వల్ల రూపము మారినదై పర్వతమై నిలిచి యున్నది. శూరపద్ముని తమ్ముడైన తారకాసురుడనే రాక్షసుడు ఈ క్రౌంచశిఖరమునకు చేరువగా నిర్మించుకొనిన మాయాపురి పట్టణమందు వసించుచున్నాడు. ఈ తారకాసురుడు ఏనుగుముఖము కలవాడు వానిచెంత చతురంగబలములున్నవి. వాడొట్టి మూర్ఖుడు అయిననూ మహాధీరుడు. దయా గుణములేని కర్కోటస్వభావి. పవిత్రమైన ఆలయ, యజ్ఞయాగాది క్రతువులను నిర్దాక్షిణ్యముగా నాశనమొనరించువాడు. వానినీ వాని అనుచరులనూ సమూలముగా నాశనమొనరింపుము.

అవిన్నపమును వినినదే తడవు కుమారస్వామి ముందుగా తారకాసురుని దునిముటయే ప్రథమ కార్తవ్యమని భావించెను. ఇందుకు తన అనుచరప్రముఖుడైన 'వీరబాహుని' పంపవలెనని తీర్మానించెను. చతురంగ సేనలలో సగభాగమును తీసికొని వెళ్ళమని అజ్ఞాపించెను.

"వీరబాహూ! మహా క్రూరుడైన తారకాసురుని వాని పరివారమునూ ఈ క్రౌంచగిరి సహా సమూలముగా నాశనమొనరించి, విజయుడవై తిరిగి ర"మ్మని సెలవు నిచ్చెను.

శ్రీ సుబ్రహ్మణ్యుని చరణారవిందములను సేవించి వీరబాహు ఆయన ఆజ్ఞమేరకు వీరులను తోడ్కొని తారకాదుల సంహరించుటకై వెడలెను. అదేసమయమందు అసురులకు దుర్నిమిత్తములైన అపశకున ములు తోచెను. పెనుగాలివీచెను. మట్టిపెళ్ళలవాన కురిసెను. తోకచుక్క మొలిచెను. ఇటువంటి దుశ్శకునములగని రాక్షసులు భీతిల్లిరి. అప్పుడు శివసుబ్రహ్మణ్యుని సేనలు మాయాపురి పట్టణమును ఒక్క తృటిలోనే చుట్టుముట్టిరి.

ఈ సంగతిని తెలిసికొన్న తారకాసురుడు యుద్ధ సన్నాహములు చేసెను. చతురంగబలములు వెన్నంటిరాగా రథారూఢుడై యుద్ధము చేయ బయలుదేరెను. తప్పెటలు, భేరీలు, తూర్యములు ఘోషలు చేసినవి. అసుర సమూహము సమరోత్సాహముతో వేగముగా ముందుకు నడిచినది. భూతగణములున్నూ, అసురగణములున్నూ వీరావేశముతో తలపడినవి. ప్రళయ భీభత్సమును గుర్తుకు తేగల యుద్ధము జరిగినది ఈ విధముగా వీరబాహువు సైన్యమును రాక్షసుల మీద ఉసిగొల్పి యుద్ధమును చేయించెను. రాక్షసులు భయపడి పారిపోసాగిరి. దీనిని జూచిన తారకాసురుడు తాళలేక తన రథము నుండి భూమిపైకి ఎగిరి దూకి గదాయుధమును త్రిప్పుచూ, పళ్ళు కొరకుచూ బీకరమైన సింహ నాదము చేసెను ఈ సింహనాదము విన్నంతనే వీరబాహు సైన్యము నందు వేల కొలది వీరులు నిహతులైరి.

ఇదేవిధముగా వీరబాహు సైన్యము కూడ ప్రళయభీకరమైన యుద్ధము చేసిరి. నిశితమైన బాణములను రాక్షస సైన్యముపై విడిచిరి. తన గదతో తారకాసురుడు వానిని నుగ్గునుగ్గుగా జేసెను.

తర్వాత నవవీరులలో ఒకడైన వీరకేసరితో తారకుడు భీకరమైన పోరుగావించెను. తారకుని గదాప్రయోగంతో వీరకేసరి మూర్ఛిల్లెను.

అది జూచిన వీరబాహు ఆగ్రహం చెంది తేరెక్కినవాడై వెన్వెంటనే తారకుని తలపడి భయంకరముగా యుద్ధము సలిపెను.

వెంటనే నారదుడు స్కందుని సమీపించి "దేవా మన వీరులందరినీ మాయాయుద్ధముతో తారకుడు నాశనమొనరించుచున్నాడు. క్రౌంచగిరిని ప్రవేశింపజేసి మతిహీనులనుజేసి చంపుచున్నాడు. మిగిలిన వారిని తారకుడు ఓడించుచున్నాడు. ఇవన్నియూ మీకు తెలియనివికావు. కరుణజూపవలసినదిగా ప్రార్థించువాడను'' అని వేడెను.

ఊరడిల్లుము నారదా! తారకుని స్వయముగా నిర్మూలించెదను అని పల్కెను. వాయుదేవుని సారధిగా జేసికొని రథమును నడిపించెను. తారకుని చేరెను. రాక్షసవీరులందరూ భయపడిరి. పెక్కుమంది పరుగెత్తసాగిరి. తారకుడు సుబ్రహ్మణ్యుని జూచి, దేవతలకూ, నాకూ విరోధమున్నది గాని ఈశ్వరునికి నాకూ వైరమేమున్నది? అలాంటప్పుడు శివకుమారుడవైన నీతో తలపడనగత్యమేమున్నది? అని అడిగెను.

''దేవతలను చెరబట్టావు. వరబలగర్వితుడవై అనేకమైన దుర్మార్గములను చేసినావు. నీమదమణచి దేవతలను విడపించవచ్చినా"నని బదులు పలికెను దేవసేనాపతియైన కార్తికేయుడు.

ఇరువురి మధ్య చాలా ఘోరమైన సమరము సాగినది. తారకుని విల్లువిఱచి, రథాన్ని నుగ్గునుగ్గు జేసెను. రథము నుండి క్రిందపడిన తారకుడు మూర్ఛచెందెను. కొంతసేపటికి మూర్ఛనుండి తేరుకొని నిలబడిన తారకుని తన ఐరిసెను ప్రయోగించి వాని రొమ్మును చీల్చెను, క్రౌంచగిరిని నాశనమొనర్చెంచెను. రాక్షసవీరుల దునిమెను. అలా పాపులను సంహరించిన కారణాన శక్త్యాయుధము గంగలో స్నానమాడి, పునీతమై తిరిగి శ్రీ సుబ్రహ్మణ్యుని చేరెను.

దేవతలు సంతోషభరితులైనారు. ఆనందముతో ఆడిరి, పాడిరి. లక్షాతొమ్మిదివీరులైన స్కందుని అనుచరులు స్పృహచెందిరి. సమరమున ప్రాణములు గోల్పోయిన భూతగణములన్నింటికి శ్రీ సుబ్రహ్మణ్యుని

అనుగ్రహముతో ప్రాణములు రాగాలేచి నిలబడిరి. కుమారునికి సాష్టాంగ దండ ప్రణామములర్పించిరి. రణక్షేత్రమునువీడి తన అనుచరులతో గాంగేయుడు బయలుదేరెను.

## దేవసేనాపతి

అలాతన వాసస్థానమైన దేవగిరిని చేరాక అక్కడ నుండి దక్షిణా పథమున జగదీశ్వరుని పుణ్యస్థలములైన శ్రీశైలాది శివక్షేత్రములన్నింటినీ సందర్శించి, పరమేశ్వరానుగ్రహమును పొందెను. అలా క్షేత్రదర్శన ఫలానుభవములను పొందిన పిమ్మట 'తిరుచ్చెందూరు' అనే సముద్రతీర భూమిని పవిత్రముచేయ సంకల్పించి, అక్కడ విశ్వకర్మనిచే శోభాయ మానముగా నగర నిర్మాణము చేయించి, తన పరివారముతో విడిది జేసెను. షణ్ముఖుడు ద్వాదశ (పన్నెండు) భుజములు, శిరమునకు త్రినేత్రముల చొప్పున ఆరు ముఖములకున్నూ పదునెనిమిది కమల నయనములను కలిగినవాడై, చెక్కుచెదరని చిరునగవుతోడను, చందురుని మించు అందమొలికించు ఆరుముఖములు కలవాడై, గంభీరాకృతితోను క్రోటిసూర్యసమానమైన తేజస్సుతోనూ, దివ్యమైన కిరీటములు కలవాడై నవరత్నఖచిత సింహాసనారూఢుడై 'దేవసేనాపతి'గా కొలువుదీరెను ఇలా దివ్యసందర్శనమిచ్చు కార్తికేయుని మనము మనసారా తలంచి పులకిత శరీరులై-మనయొక్క తను (శరీర), ప్రాణ మానములను సంపూర్తిగా శరణాగతవత్సలుని పాదపద్మములకు సమర్పించి తరింతుము గాత!

## 8 అసురకాండము

'కశ్యపు'డనే మునివర్యుడు సురులకు (దేవతలకు), అసురులకు (రాక్షసులకు) తండ్రిగా నుండెను. బ్రహ్మదేవుని కుమారుడైన కశ్యపుడు తపోశాలియై, నిగర్వియై, అరిషడ్వర్గములనుండి నిగ్రహించుకొనువాడై యుండెను. ఇతని భార్య 'దితి'. దితి కుమారులైన రాక్షసులను 'దైత్యు' లందురు. వీరు అరవైఆరుకోట్ల అసురులుగా కాశ్యప సంతతికి చెందిన వారై యుండిరి. 'అదితి' మరోభార్య ఆమె కుమారులే దేవతలు.

ఈ రాక్షసులందరికీ 'మహాసురుడు' అనేవాడు నాయకుడుకాగా, వాని భార్య 'కౌశిని' వల్ల 'సురస' అనే రాక్షసపుత్రి జన్మించినది. ఈ 'సురస' అద్భుతలావణ్యశోభిత. రాక్షస గురువైన శుక్రాచార్యునికి శిష్యురాలై, శుశ్రూషలు చేసి, సకల విద్యలను గ్రహించినదై 'మాయ' అనే పేరుతో శుక్రాచార్యులచే పిలువబడి, సార్థకనామధేయురాలైనది.

దేవతల ఉచ్ఛస్థితిని సహించని యీ 'మాయ' రాక్షసజాతిని వున్నత స్థానమునకు గొంపోవలెనని శపథము చేసినది. నందీశ్వరునిచే శాపగ్రస్తులైన రాక్షసులకు శ్రేయోదాయకమైన వుచ్ఛస్థాయిని కొని తెచ్చుట తనకర్తవ్యముగా భావించి, శుక్రాచార్యుని సలహాతో కశ్యపముని వల్ల అతిబలశాలురైన సంతతిని పొందవలయునని నిశ్చయించుకొన్నది. పెద్దల అనుమతిని పొందినది. హిమాలయాల్లో ఉత్తర దిగ్భాన కశ్యపముని తపమాచరించుచోటికి చేరినది. అక్కడ అందమైన తటాకములు సెలయేళ్ళూ, మణిమంటపములు, శయ్యలు మొదలైన మోహపరవశ మొనరించగల ప్రకృతి రమణీయతను సృజించినది. తన తపోవని యిలా శోభాయమైన ప్రకృతితో మారినది గమనించి కశ్యపుడు అచ్చెరువొందెను. అప్పుడు మణిమంటపమందు ఒయ్యారముగా మానవరూపమున దేవతాస్త్రీలను తలదన్నే సౌందర్యంతో 'మాయాదేవి' ఆసీనురాలై యున్నది ఆమెను చూచిన కశ్యపుడు మోహవివశుడై ఆమె సాంగత్యమును కోరెను. 'ఆత్మసౌందర్యము'నకు తపాశక్తిని ధారపోయుచుండిన కశ్యపముని వర్యుడు 'మాయ'కులోబడి 'బాహ్య సౌందర్యము' నకు దాసుడాయెను కదా! అందువల్లనేయేమో 'బ్రహ్మకయినా పుట్టు రిమ్మ తెగులు' అని చెప్పబడినది. 'బ్రహ్మజ్ఞానము' పొందవలెననిన ఎన్ని మాయల నుండి తప్పించుకొనిన సాధ్యముకాగలదు!? అహం బ్రహ్మోఽస్మి' అనిపించుకొనవలెనన్న యెన్ని ప్రయాసలకులోనుకావలె!?

కశ్యపుని అభ్యర్థనకు కాదనలేక ఒప్పుకొన్నట్లుగా 'మాయాదేవి' అతనికొడంబడె. కామ వివశుడైన మునివర్యుని తన వశమొనరించుకొన గలిగినది 'మాయ'. ఆనాటిరాత్రి మొదటిజామున జరిగిన వారి సమాగమ ఫలితమే 'శూరపద్మాసురుని' జననము. వారియొక్క చెమట

(స్వేదబిందువుల) నుండి ముప్పైవేల మంది రాక్షసులు ఉదయించిరి. వారిని అక్కడే వదలి మరొక్క మణిమంటపమున కేగిరి.

మాయాదేవి ఆడ సింహముగా మారినది. కశ్యప ముని మగ సింహముగా మారెను రెండవ జామంతా కేళీవిలాసమును అనుభవించిరి వెయ్యి ముఖములున్నూ, రెండువేల చేతులున్నూగల 'సింహముఖాసురు'డు జన్మించెను. ఈ సారి పట్టిన చెమట నుండి నలభైవేల మంది సింహముఖములు కలిగిన అసురులు ఉద్భవించిరి. వారిని అక్కడే విడిచి పెట్టిరి.

మరొక్క మంటపమును చేరిరి. ఈ సారి ఆడఏనుగుగా 'మాయ' రూపమును ధరించినది. కశ్యపుడు మగఏనుగాయెను. మూడవజాము కూడా వారి సరసస్సల్లాపములతో గడచినది. 'తారకాసురుడ'నే గజ ముఖాసురుడు పుట్టెను. వారి స్వేదబిందువులనుండి యీసారి నలభై వేలరాక్షసులు ఏనుగు ముఖములతో పుట్టిరి. అక్కడే వదలి మరో మణిమంటపమునకు చనిరి.

చివరిసారిగా నాలుగోజామున మేకల రూపములు దాల్చి సంభో గించిన మాయా కశ్యపులకు 'అజముఖి' పుట్టగా, ఆమెకు తోడుగా మేక ముఖములను కలిగిన ముప్పైవేలమంది రాక్షసులు ఉద్భవించిరి.

## కశ్యపుని హితవు వచనములు

శూరపద్మాసురుడు తల్లిదండ్రులైన మాయాదేవీ కశ్యపుల పాద ములపైబడి నమస్కరించి "తండ్రీ! మేము ఆచరించ దగిన కార్యమేదో వెంటనే సెలవీయ గోరెదను" అని అడిగెను.

అలా అడిగిన కుమారునిజూచి, అతని సోదరీ సోదరులను కూడా ఉద్దేశించి కశ్యపుడిట్లనెను. "పుత్రికా పుత్రులారా! మీరంతా ఇంద్రియ నిగ్రహము వహించి తపోదీక్షకు పూనుకొనండి! అలా తత్త్వవిచారణ

చేయగా వచ్చేజ్ఞానముద్వారా శివలోకప్రాప్తి పొందండి!" అని హితోక్తులను ఎన్నో చెప్పెను. అందుకు సోదహరణంగా కొన్ని కథలను కూడా పలికెను అలా చెప్పిన కథలలో మార్కండేయుడు ఎలా చిరంజీవి అయ్యాడే సవివరంగా చెప్పెను.

## మాయాదేవి యొక్క ఉపదేశము

"బిడ్డలారా! మీ తండ్రి చెప్పినదంతా వాస్తవమే! అయినా నేను చెప్పేది కూడా ఆలకించి మీకేది అవసరమో గ్రహించి అలా పాటించండి తెలివిగల ఏప్రాణి అయినా తమ జీవితావసరాలకు దగిన విద్యతోబాటు ఐశ్వర్యము పొంది సుఖించడం శ్రేయోదాయకము! విద్య కంటే ఐశ్వర్యమే శ్రేష్ఠము. ఎంత పండితుడైనా ధనం లేనివాడు, అధికారం లేనివాడు దేనికీ కొఱగానివాడు. కనుక అధికార బలం, ఐశ్వర్య ప్రాబల్యంతో మీ జీవితాల్ని ఎదురులేకుండా కొనసాగించండి. నిన్న పుట్టినమీరు దేవతల కంటె మిన్నగా రాక్షసకులానికి వన్నె తెచ్చేలా ఉండే మార్గము చెప్పెదను.

"ఉత్తర దిశగా వెళ్ళండి. తపమాచరించండి. హోమమందు తగిన ద్రవ్యములను వేసి, శివుని వుద్దేశించి తపమాచరించండి. మహా దేవుడు సాక్షాత్కారమిచ్చి మీకు అద్వితీయమైన వరములు అనుగ్రహించ గలడు. శూరపద్మా! సింహముఖా! తారకా! మీరు ముగ్గురూ కలసి మీ సోదర సమూహముతో వెళ్ళండి!" అని వీడ్కోలిచ్చి పంపినది. శూరపద్మాదులు తల్లిమాటలను గౌరవించి అలాగే వెళ్ళారు.

## మాయాదేవి కశ్యపుని వదలివెళ్ళుట

అలా జరిగిన పిమ్మట కశ్యపుని జూచి మాయాదేవి యిలా పల్కినది. "మునిశ్రేష్ఠుడా! నా పేరు మాయ. లక్షలాది రాక్షసవీరులకు వీర మాతను కావలెనని నాయంతటనే నేనే మిమ్ములను చేరినాను. నా కోరిక నెరవేరినది మీ తపోబలమూ, నామాయాశక్తి సంగమ ఫలితమే అతి

పరాక్రమశాలురైన కుమారులు మనకు సద్యోజాతంగా (అప్పటికప్పుడే) ఉదయించినారు. మీ దయతో అసురబలము పెరిగినది. నేను వచ్చిన కార్యము సులభముగా మీవల్ల నెరవేరినది, నాకు సెలవీయండి" అని ఆయనకు నమస్కరించి, అక్కడనుండి వెడలినది.

## రాక్షస యాగము

యాగనిమిత్తమై వెడలుచుండిన శూరపద్మాది రాక్షస వీరులకు శుక్రాచార్యుడు ఎదురుగా వచ్చెను. "నేనే మీగురువు!" అని చెప్పెను. శూరుడు భక్తిప్రపత్తులతో ఆయనకు నమస్కరించెను. "మేము చేయ నున్న యజ్ఞానికి ఏలాంటి ఆటంకములు కలుగకుండా వుండాలని ఆశీర్వదించండి"అని శుక్రాచార్యుని ప్రార్థించెను. ఆయన కొన్ని మంత్ర ములను ఉపదేశించి వెడలెను.

శూరపద్మాదులు ఉత్తరాభిముఖులై చనిరి. మిరిచెట్లు నిండిన ఒక అడవిని చేరిరి. యాగ ప్రారంభానికి కావలసిన సన్నాహాలు చేసినారు. పద్నాలుగు యోజనముల దూరము అంతర్భాగమున అమర్చినారు. నాలుగు వైపులా కొండశిఖరాలను గోడలుగా నిర్మించి సైనికులను కాపలాగా నియమించినారు. నాలుగు ద్వారములను ప్రతిష్ఠించి, మంత్ర శక్తితో వీరుడైన ప్రధాన ద్వారపాలకుని నియోగించినారు. వీటి మధ్య అగాధమైన పల్లమును తయారుచేసిరి. దానిచుట్టూ హోమగుండములను అమర్చినారు. యాగ నిమిత్తము వలయు హోమద్రవ్యాదులను కోరి తమ తల్లియైన మాయాదేవిని స్మరించగా, ఆమె వెంటనే వారిముందు నిలిచినది. ఆమె మాయాశక్తితో హోమద్రవ్యములైన మాంసఖండము లను, రక్తము, తైలము (నూనె), నేయి, పాలు, నెయ్యన్నము, యాగ పశువు, కొఱ్ఱబియ్యము, కస్తూరి, వేయించిన వడ్లు (తెల్లనిబొరుగులు) దర్భ, పుష్పములు, సమిధలు, నవధాన్యములు యిత్యాదులన్నింటినీ వారిముందుంచినది. హోమభూమి మధ్యభాగమున మిగుల ఎత్తైన, వజ్రస్తంభమును నాటించినది. ఆ వజ్రస్తంభము కొనదేలి, మిక్కిలి

వాడిగా నుండినది. అప్పుడు యాగము మొదలిడ సన్నాహాలు ప్రారంభ మైనది. శూరపద్మాసురుడు నాలుగు వైపులా అమర్చబడిన వీరదిక్పాల కులను అర్చించెను. వారికి మాంసము నైవేద్యమిడి, విషపూరితమైన సమిధను పళ్లములో వేసెను. అగ్ని ప్రేల్చెను.

అలా మొదలిడిన యజ్ఞము ముందు తన సోదరులైన తారకా సురునీ, సింహముఖాసురునీ ఆసీనులను జేసి, వారితో కలసి శివమంత్ర రాజమ్మును ఉచ్చరించసాగెను. శాస్త్రసమ్మతముగా, విధియుక్తముగా యజ్ఞము చేసెను.

యాగాగ్ని ప్రజ్వరిల్లి ఆకాశమంటినది. అన్ని దిశలనూ కాల్చి వేయు యాగాగ్నిని గాంచి దేవతలు శోకించిరి. ఇలా పదునాలుగువేల సంవత్సరములు శివనామమును జపించుచూ, శూరపద్మాది అసుర సోదరత్రయము యజ్ఞమును చేసిరి. అయిననూ మహాదేవుడు ప్రసన్నుడు కాలేదు. ఇక కాలాయాపన చేయడం సబబుకాదని భావించి శూరపద్మా సురుడు తన తమ్ముళ్లను యజ్ఞము చేయుచుండుమని హెచ్చరించి, తాను ఆకాశమునకు ఎగసెను. కత్తితో తన శరీరమందలి మాంస ఖండములను కోసి హోమమందు పడునట్లు విసరుచుండెను. తన రక్తమును నెయ్యిగా భావించుకొని హోమగుండమునందు పోసెను. రాక్షస వీరుడైన శూరపద్ముని శరీరమందు కండలు తరుగుటమాని యథాస్థానముగా పెరుగుచూ వుండినది. ఇంత జేసినా పరమశివుడు తనకు సాక్షాత్కారమవ్వలేదని వగచిన 'శూరుడు' యాగాగ్నిలోనికి దుమికి ఆత్మత్యాగము చేసెను. అది జూచిన తారకాసురుడూ, సింహముఖా సురుడూ రోదించిరి. వారిరోదన ధ్వనులతో యాదశాలంతయూ ప్రతి ధ్వనించినది వీరి శోకమును గాంచిన దేవేంద్రుడు మిక్కిలి సంత సించెను.

అప్పుడు తారక, సింహముఖాసురులు తాము కూడా యాగాగ్నిలో దుముక సమాయత్తమయినారు. ఇంత జరుగుచున్న తరువాత కూడా తాను ప్రత్యక్షం కాకపోతే ఇక తనెలా భక్తవశంకరుడవుతాడు?

ప్రత్యక్షమయ్యాడు భక్త సులభుడు! ఏమిటండీ? పదునాలుగు వేల సంవత్సరాల కఠిన యజ్ఞ, తపః ఫలితాన్ని చూస్తూ కాలయాపన చేసినవాడా భక్త సులభుడు? అనేది మీ ప్రశ్నకదూ! మరి వెంటనే వరాలిచ్చేయడంకదా ఆయనకు రివాజు! అనికూడా మీరు చెప్పవచ్చును కానీ కోరేవాళ్ళెవరు? రాక్షసులు! ఏమి కోరతారు? అనితరసాధ్యమైన కోరికలే! ఆ కోరికలు తీరిన తర్వాత ఏదైవాంశ సంభూతుడో అవతరించిన గానీ వారినిడునుమాడలేరుమరి! అలాంటప్పుడు వారిని ఎంతకాలమైనా వరాలు పొందడానికి వీలులేకుండా పరమేశ్వరుడు జాగుచేయడం సబబే కదా! అయినా రాక్షసులు వరబలగర్వితులై, కారణజన్ములైన వారి నుండి శిక్షింపబడటం విధిలిఖితం కదా! అందువల్లనే అన్ని సంవత్సరాలు చంద్రమౌళి ప్రత్యక్షం కాలేదు. తీరాప్రసన్నుడైన తరువాత వారేంకోరుతారో, అలా కోరిన తరువాత వరాలివ్వకుండా మాయలు పన్నడం తెలియనివాడే మన భోళాశంకరుడు! అందుకే ఆయన భక్తవ శంకరుడనికూడా పిలువబడ్డాడు. 'భక్తి'తో ఏమి కోరితే అది 'ఇన్‌స్టంట్ కాఫీ' లాగా అందించేవాడు మహాదేవుడు! అందుకే రాక్షసులంతా శివుణ్ణి కొలవడం! కానీ శివమాయ విష్ణుమాయగా మారి దశావతారాలు ధరించి రాక్షసశక్తిని 'లయం' అంటే తనలోనే తీసుకొనే శక్తిమంతుడు కూడా లయకారుడైన, పరబ్రహ్మయైన 'రుద్రు'డేననీ అతననే 'మహాకాలు'డనీ కూడా పిలుస్తారని మనకు తెలియనిదికాదు! కాలాన్ని శాసించి, కాలుని (యముని) ద్వారా సమస్త సృష్టినీ తనలో అంటే పరబ్రహ్మలో కాల క్రమంలో ఐక్యం చేసికొనేవాడు నాగభూషణుడైన రుద్రుడని కూడా మనం ఇక్కడ గ్రహించాలి!

అలా తారకాసుర, సింహముఖాసురులిరువురూ యాగగుండంలో శూరపద్మునివలె తమ దేహాలను అర్పించడానికి సంసిద్ధమవుతుండగా భక్తసులభుడైన కైలాసవాసుడు సాక్షాత్కారమయ్యాడు. ఎలా? ఒక వైదిక వృద్ధ బ్రాహ్మణుని రూపంతో వారి ముందు నిలబడ్డాడు.

"వ్యథ చెందకండి! మీ అన్న శూరునివలె మీరు కూడాచావకండి! వానికి ప్రాణమిచ్చి- సశరీరంగా మీ ముందు నిల్చేలా చేస్తాను!" అని

పలికిన నీలకంఠుడు దేవగంగ (ఆకాశగంగ) ను పిలిచాడు. ఆమె పర పళ్ళు త్రొక్కుచూ యాగగుండంలో ప్రవహించింది. శూరపద్మాసురుడు ప్రాణం వచ్చినవాడై, తమ్ముళ్ళను, రాక్షసగణాన్ని కలుసుకొన్నాడు. ఇలా జరగడం చూచిన దేవతలు గడగడా వణికినారు. వారలా భయపడటంలో వింతేమున్నది? ఇక రాక్షసుల బారినుండి వారెలా తప్పించుకోగలరు? ఒకటా.. రెండా... పదునాలుగువేల సంవత్సరాల యాగ నిర్వహణలో శివమంత్రరాజమును ధ్యానించిన రాక్షస సోదర త్రయాన్ని శివుడు అనుగ్రహించడా? 'మహాదేవు'ని దేవదేవుని ఆ దేవతలు ఏ ఆపగలరు? అదే జరిగింది!

## శివుని వరములు

వృద్ధ బ్రాహ్మణరూపముతో వచ్చిన పరమశివుడు తన నిజరూపాన్ని చూపెను. సోదరత్రయము, వారి అనుచర రాక్షసగణము "శంబోమహాదేవా! హరహర శంకర! జయజయ శంకర! పాహిమాం! పాహిమాం! రక్షమాం! రక్షమాం!" అని ఎలుగెత్తి శివస్తుతి చేశారు.

శూరపద్మాసురుడు తన తమ్ముళ్లతో కలసి శంకరుని పాదపద్మములపై తమ శిరములిడుచూ సాష్టాంగ నమస్కారములు చేసెను. తరువాత ముగ్గురూలేచి శిరమునకుపైన తమ చేతులు జోడించి భక్తి ప్రపత్తులతో శివస్తోత్రములు చేసిరి. గౌరీపతి సంతసించి యిట్లనెను. "శూరపద్మా! నీ కఠోరదీక్షతో కూడిన ఈ యాగఫలితాన్ని పొందవచ్చును నీకేమి కావలయునో కోరుకొమ్ము!"

"కరుణాసింధో! నాశనములేని వాడనై, వెయ్యెన్నిఎనిమిది అండములకు ప్రభువునై, దేవతలను జయించువాడనై, తలచినంత మాత్రాన ఎక్కడికైనా విహరించగల విమానము కలవాడనై, ప్రశస్తమైన రాజదండముతో అందరినీ శాసించ గలవాడనై వుండు వరమునిమ్ము" అని సదాశివుని అర్థించెను.

"శూరపద్మా! నీవుకోరనట్లే అవుతుంది! వెయ్యెన్నియెనిమిది అండములను శాసించగల ప్రభువుగా నూటయెనిమిది యుగములు పరిపాలిం

చెదవు! ఇదిగో ఇంద్రజాలమనే రథము! ఇదిగో రాజదండము! అందరినీ జయించగల పాశుపతాది అస్త్రములిస్తున్నాను. నాశక్తితప్ప మరేదీ నిన్ను జయించలేదు! ఇదిగో వజ్రయుధము! ఇదిగో చతురంగబలాలు! వీటితోనూ, అసహాయశూరులైన నీ తమ్ములతోనూ సుఖించు!" అని వానిని అనుగ్రహించి కైలాసవాసుడు అంతర్ధానమయ్యెను.

శూరపద్మాసురుని కఠోరదీక్ష దేవతలకు సాధ్యమగునా? మానవ జన్మనెత్తి యజ్ఞయాగాది క్రతువులజేసిన పుణ్యఫలములచే అమరులై అమృతపానముతోనూ, భోగలాలసత్వముతోనూ కాలము గడుపుచూ, తమ పుణ్యఫలములు తీరిన తరువాత మరలా ఈ దేవతలు భూలోక వాసులగుచున్నారు. ఇలా కాలచక్రం తిరుగుతూ వుంటే 'పునరపి జననం-పునరపి మరణం', 'జాతస్యధృవమ్ మరణం' అనే విధంగా ఎన్నో శరీరాలను ధరించి, ఆత్మలు పరమాత్మలో లయం అయ్యేంత వఱకూ పుట్టుచూ, గిట్టుచూ వుంటారు. భక్తి-జ్ఞానం-వైరాగ్యం అనే వికృతి భోగాలతో పరమపదం చేరుకొనే ఆత్మ ఏకోటికో ఒక్కటుంటుంది. దీనికి సంబందించిన వేదాంతం ఎంతోమంది ఎన్నో వివరణలు ఇచ్చియున్నారు ఈ రచయిత కూడా శ్రీ శ్రీ శ్రీ కంచికామకోటి పీఠాధిపతుల ఆశీస్సులతో శ్రీ దోర్నాదుల చినవరదరాజుల శ్రేష్ఠి గారి వ్యయంతో వెలువరించిన 'గురువు ఎవరు'? అనే ఉచిత పంపిణీ అయ్యే పుస్తకంలో కొంత వివరించడం జరిగింది ఎవరి అనుభవాలు వారివి! ఎవరి అనుభూతి వారిది! ఎవరి రుచివారిది! కొందరికి ప్రేమపిచ్చి! మరికొందరికి అధికారదాహం! కొందరికి డబ్బుపిచ్చి! మరికొందరికి భూమిసేకరణ పిచ్చి! చాలా తక్కువమందికి మాత్రం దేవునిచూడాలనీ, చేరాలనీ పిచ్చి! ఎవడైతే 'భక్తి-శ్రద్ధ'లనే రెండు కాసులను దక్షిణంగా దక్షిణామూర్తియైన జగద్గురువగు పరమేశ్వరునికి అర్పించెదరో వారికి శివసాయుజ్యం తప్పక అనుగ్రహించడం ఆయన చూసుకొంటాడు! ఇప్పుడు కథా సందర్భానికి వస్తాము.

దేవగురువు 'బృహస్పతి'. ఈయన దేవేంద్రునికి సకాలంలో సరియైన సలహాలు, సూచనలూ ఇచ్చి దేవలోకాన్ని కాపాడుతూవుంటాడు. రాక్షసులకు గురువు 'శుక్రాచార్యుడు'. ఈయన రాక్షసులకు అధికార

బలము పెంచే విధంగా సరియైన మార్గదర్శిగా వుంటాడు దీనిని బట్టి మనకు 'గురువు' యొక్క ప్రాముఖ్యము తెలుస్తూవున్నది. అందుకే శూరపద్మాసుర సోదరులకు సరియైన సమయంలో శుక్రాచార్యుడు కన్పించి వారికి ఇలా ఉపదేశం యిచ్చాడు.

"శూరపద్మా! దేవతల ఆధిపత్యాన్ని నిగ్రహింపుము! నేవే బ్రహ్మ మని భావింపుము! మనకు దేవతలు శత్రువులు! మనకు చెడు తల పెట్టే వాడు ఇంద్రుడు! కనుక వానిని చెఱపట్టి హింసింపుము. తపమాచరించే మునులనూ, దిక్పాలకులనూ నీ బానిసలుగా చేసికొమ్ము! వారి శక్తులను గ్రహించి రాక్షసులకిమ్ము! హత్యలూ, చౌర్యమూ, కామేచ్ఛను ఉధృతం చేయుము! ముందుగా నీ అధిపత్యానికి వెయ్యిన్నీ ఎనిమిది అండములను తెచ్చుకొనుము! నేను చెప్పిందంతా ఆచరించి మరలా నా దగ్గరకురమ్ము" అని రాక్షసనీతికి అనుగుణ్యముగా శుక్రాచార్యుడు పలకెను.

## శూరపద్ముని దిగ్విజయము

శూరపద్ముడు కులగురువైన శుక్రాచార్యునికి సవినయముగా నమస్కరించి సెలవుగైకొనెను. తర్వాత సింహముఖుని తోడ్కొని ఆశేష రాక్షససేనావాహిని లోనికి ప్రవేశించెను. తారకాసురుడు ఇరువురికీ నమస్కరించెను. శుక్రాచార్యుడు చెప్పినదంతా తారకునికి చెప్పినారు. అప్పుడు మాయాదేవి అక్కడికి వచ్చినది. ముప్పురూ తల్లికి నమస్కరించిరి.

"జరిగినదంతా తెలుసుకొన్నాను. మీరు కలసి మెలసి వుండండి. అప్పుడే దేవతలకన్నా అధికమైన కీర్తిని పొందగలరు. ఏదైనా మాయ చేయవలసిన అవసరము ఏర్పడినప్పుడు నన్ను స్మరించండి. సహాయం యుటుకు వచ్చెదను" అని మాయాదేవి పలికెను.

## అలకాపురి విజయము

కుబేరుని రాజధాని అలకాపురి. శూరపద్ముడు తన సేనావాహినితో అలకాపురిపై దండెత్తెను. కుబేరుడు హడలి పోయెను. రాక్షసులకు భయపడి ధారాళముగా దివ్యమైన వస్తు, వాహన, వస్త్ర, ఆభరణాదులు పెక్కుగా శూరపద్మునికి బహూకరించి, "రాక్షసరాజా! నేను తమ బానిసగా వుండుటకు ఇష్టపడుచున్నాను. అందువలన నన్ను దయ చూడుడు" అని వేడుకొనెను. కుబేరుని కానుకలన్నీ గ్రహించి తన దిగ్విజయమునకు మురిసి పోవుచూ శూరపద్ముడు కుబేరుని దయతలచి విడిచివేసెను.

## అమరావతి విజయము

ఆతరువాత స్వర్గలోక రాజధాని అయిన అమరావతిని తన సేనలతో చుట్టుముట్టెను. దేవేంద్రుడు ఆకాశమార్గమున పారిపోయి దాగుకొనెను. శూరపద్ముడు అమరావతి నగరాన్ని ధ్వంస మొనరించి దేవపత్నులను చెఱబట్టెను. తర్వాత అమరావతికి నిప్పుపెట్టి వికటట్టహాసము చేసెను. తదుపరి అగ్నిదేవుని నగరాన్ని చుట్టుముట్టి వాని సేనలను దునుమాడెను. వైశ్వానరుడు (అగ్ని దేవుడు) శూరపద్ముని శరణుజొచ్చెను. రాక్షస రాజుకు ఊడిగములు చేసెదనని బ్రతిమాలెను. పిదప యమలోకమును చేరి యమధర్మరాజుని శాసించబోగా యముడు తనంతటతానే శరణు గోరెను. రాక్షసమూక యమలోకాన్ని బీభత్సమొనరించినది. శూర సేనుడు యముని వశమైయుండిన అమృతమును గ్రహించెను. అలా లభించిన అమృతమును సేవించి యమపురిలో ఒక్క దినము గడపిన పిమ్మట బయల్దేరెను.

రాక్షసులు పాలకడలిని కలచివేసిరి. నీలాదేవి, శ్రీదేవి బీతిల్లిరి. శ్రీనివాసుని గట్టిగా కౌగిలించుకొనిరి. శ్రీహరి యోగనిద్రనుండి లేచెను. గరుత్మంతుని వాహనముగా చేసుకొని రాక్షసులతో పోరుసలిపెను. రాక్షసులు భయపడి పారిపోయిరి. రక్తపేరులు ప్రవహించినవి. తారకాసు

రునికిన్నీ, వైకుంఠవాసునికిన్నీ భీకర యుద్ధము సాగినది. మాయా యుద్ధముగా మారినది. తారకుని జయించుట సాధ్యము కాలేదు. నారాయణుడు చక్రాయుధమును ప్రయోగించెను. అది తారకుని కంఠమందు పసిమి బంగారు పతకముగా మారినది. దేవతలు భయపడి పారిపోయిరి. మరలా స్వర్గలోకమునకు రాకసులు చేరిరి. అది తెలుసుకొనిన దేవేంద్రుడు తన దేవేరి అయిన శచీదేవితో కోకిలగామారి ఆకాశమార్గాన ఎగసిపోయెను. దేవేంద్రుని కానలేక కోపముతో అక్కడ మిగిలన దేవతలందరినీ రాకసులు మిక్కిలి బాధించిరి. దేవతలు రాకసులకు బానిసలైరి. తరువాత అసురులు సురలోకమునువీడి సత్యలోకమునకు పోయిరి. అక్కడ చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు వీరినిచూచి గడగడా వణికెను. "శూరపద్మా! నీ యంతటివాడు మరొక్కడులేడు. నీకు నేవే సాటి. కశ్యపముని నాకుమారుడు. నీవు అతని కుమారుడివి అందువల్ల నీవు నాకు మనుమడివి. నీవు చల్లగా వర్ధిల్లాలి, నీకీర్తి చంద్రికలు దశదిశలా వ్యాపిస్తాయి!" అని పొగడెను. బ్రహ్మదేవుని మాటలతో ఉప్పొంగిన శూరపద్ముడు అక్కడినుండి వైకుంఠము చేరెను. మాధవుడు వానినీ కీర్తించెను. పొగడ్తలకు లొంగని వారెవ్వరు? శూరపద్ముడు విష్ణుమూర్తిని మన్నించి శివలోకమునకు చనెను. నందిదేవుని అనుమతి బడసి కైలాసవాసుని దర్శించి నమస్కరించెను. "ఇంకనూచూడని లోకములను చూచి పరిపాలించుము" అని ఆదిదేవుడు పలికెను. మరలా నమస్కరించిన శూరపద్ముడు మహాదేవునికడ సెలవు గైకొని 1008 అండములను చుట్టివచ్చెను. స్వస్థానమున కేగెను.

## దేవతలు మొరలిడుట

దేవతలు పాలకడలిపై పవళించియున్న శ్రీనివాసుని దర్శించి తమ గోడును చెప్పుకొని వగచిరి. శూరపద్ముని ఆగడములను వివరించి "శ్రీహరీ! తరుణోపాయం సెలవియ్యుడు" అని ప్రార్థించిరి. "దక్షుని యజ్ఞమునకు చనిన కారణాన మీకీదురవస్థలు కలిగినవి. శూరపద్మాసురుని జయించుట మనతరంకాదు. శివానుగ్రహం పొందిన ఈ రాకస

సోదరులను నిర్మూలించగలవాడు ఎవరో తరువాత చూచుకొందము. మనము వానిని చూచివత్తుము" అనిచెప్పి, వారిని తోడ్కొని శూరపద్ముని కడకేగిరి. అందరూ రాక్షసరాజుని శ్లాఘించిరి.

## నగర నిర్మాణము

దేవతలందరూ తనను దర్శించుటకు రాగానే "నాకొక అందమైన నగరమును నిర్మించండి. విశ్వకర్మను మా గురుదేవులైన శుక్రాచార్యుల వారిని జూచి స్థలనిర్ణయం చేసికొని వెంటనే నగరనిర్మాణం చేయండి!" అని ఆనతిచ్చెను. శూరుని ఆజ్ఞకొడంబడిన దేవతలు విశ్వకర్మను తోడ్కొని శుక్రాచార్యునితో సంప్రదించిరి. నగరనిర్మాణం మొదలిడిరి. ఈ నగరమునే 'వీర మహేంద్రపుర'మని పిలువదొడగిరి.

దక్షిణ సముద్రమధ్యమున ఎనబైవేలయోజనముల విస్తీర్ణములో కొండలను వేయించి సురక్షితమగు నగర నిర్మాణము విశ్వకర్మచే అత్యద్భుతమైన స్వర్ణమయస్తంభాలతో శోభాయమానముగా శూరుడు కట్టించెను. నగర మధ్యమమందు చక్కని అంతఃపురము, దానిచుట్టూ ప్రకృతి సౌందర్యమునకు లోటులేని సెలయేళ్ళు, జలపాతములు, జల యంత్రములు (Fountains), ఉద్యానవనములు, గుహలూ, అందు క్రీడించుటకు అనువగు తల్పములు మొదలైనవి కూడా నిర్మింపబడినది. తన మంత్రులకూ, సేనాపతులకు, యితరసిబ్బందికి తగిన కట్టడములు కూడా పూర్తిచేయించెను. నగరమునకు ఎనిమిది దిశలందు ఎనిమిది నగరములను నిర్మింపజేసెను. చతురంగ సేనలకు తగిన నివాసములను సిద్ధము చేసెను.

## పట్టాభిషేకము

దేవశిల్పి విశ్వకర్మ నేర్పునుగాంచి శూరపద్ముడు విస్మయము చెందెను. త్రిమూర్తులైన బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులు శూరపద్మాసురుని పట్టాభిషేకమునకు కావలసిన ద్రవ్యములన్నింటినీ సిద్ధము చేసిరి.

శూరుడు సముద్రస్నానము చేసెను. సువర్ణాభరణములు, పట్టువస్త్రములు ధరించెను. మణిమాలను మెడలో వేయించుకొనెను. పిదప శోభాయమానమగు సభాస్థలిలోని సింహాసనమందు శూరుని కూర్చొండజేసిరి. నవరత్నఖచితమగు స్వర్ణకిరీటము అతని శిరముపై నుంచి పట్టాభిషేకము జేసిరి. దేవతలున్నూ- రాక్షసులున్నూ శూరపద్మునికి శుభాకాంక్షలు చెప్పిరి. సభానిర్వాహణ బాధ్యతలను శూరసేనుని తమ్ముళ్ళు చేపట్టిరి. ఇంద్రుడు, వాయుదేవుడు, కుబేరుడు మొదలగు దిక్పతులందరూ శూరపద్మునికి సేవలందించిరి. గరుడ, గంధర్వ, సిద్ధాదులు శ్రావ్యముగా పాడిరి. అప్సరసలు ఆడిరి. శూరపద్మాసురుని పట్టాభిషేక వైభవము చెప్పుటకు మాటలుచాలవు.

ఇన్ని కోలాహలములతో శూరపద్మాసురుని అధికార పరిపాలనము ప్రారంభమైనది. ముందుగా ఇంద్రాదులను పిలిచి, "దేవేంద్రా! నీవు నిత్యమూ వ్యవసాయమును చేయుము! అగ్నిదేవా! నీవు వంటశాలను నిర్వహింపుము! ఓయీ వరుణా! నీవు నిత్యము నగరమంతటా సుగంధ భరితమగు నీటిని జల్లి నగరపారిశుద్ధ్యమును గమనించుకొనుము! వాయుదేవా! చల్లని వాయువీచికలతో నగరమంతటా వేడి తెలియని చందాన పిల్లతిమ్మెరలను వీచుచుండుము!" ఈ విధముగా దేవతలకు తగిన పనులను నియోగించెను. నిర్విచార సంపన్నుడై శూరపద్మాసురుడు సింహాసనమందు సుఖాశీనుడై ఆజ్ఞలను ఇచ్చుచుండెను. రాక్షసగురువగు శుక్రాచార్యుడు మంత్రజలముతో శూరుని అభిమంత్రించెను. ఇలా శూరపద్ముని పట్టాభిషేకము పూర్తియై-వెయ్యిన్నియెనిమిది అండములు పరిపాలించుచుండెను. దేవశిల్పి కుమారితయైన పద్మకోమలను దేవేరిగా చేసికొని సుఖ శాంతులతో కాలక్షేపము చేయుచుండెను. యముని పుత్రికను సింహముఖుడు, నిరృతి పుత్రికను తారకాసురుడు పరిణయమాడిరి.

ఇలా కొన్నాళ్ళు శూరపద్మాసురుని పరిపాలనా వైభవము కొనసాగుచుండగా ఒకనాడు ఇంద్రాది దేవతలను పిలిచి, "మీరు నిత్యమూ సముద్రమధ్యమున దిగి మేలైన చేపలను పట్టితేవలయును అని ఆజ్ఞాపించెను

దేవతలు కృంగిరి. లజ్జతో శిరములు వంచిరి. రాక్షసరాజు ఆనతిని మీరలేక సముద్రమందలి చేపలను విధిలేక పట్టితెచ్చిరి. వరుణుని సహాయముతో చేపలను దెచ్చు దేవతలను గాంచి రాక్షసులు పరిహసించు చుండిరి. ఈ అవమానము భరింపశక్యముకాదు. అయిననూ కాలము తమకు అనుకూలముగా లేనప్పుడు దేవతలైనా కష్టములు పడకతప్పలేదు ఇక మనలాంటి సామాన్యుల సంగతి వేరేచెప్పవలెనా?

## పుత్రి జననము

శూరపద్మునికి - పద్మకోమలదేవికి 'భానుకోపు'డను పుత్రుడు ఉదయించెను. భానుకోపుడు సార్థకనామధేయుడు. సూర్యుని మించిన పరాక్రమశాలియనిపించుకొనెను. వీని తర్వాత అగ్నిముఖుడు, హిర ణ్యుడు, వజ్రబాహు అనే రాక్షస కులదీపకులైన సహోదరులు కలిగిరి. సింహముఖునికి శూరుడనే రాక్షస కుమారుడు పుట్టెను. తారకాసురునికి అసురేంద్రుడనే కుమారుడు కలిగెను. వీడు రాక్షసుడయ్యూ వినయ విధేయతలు కలిగియుండెను.

## వాతాపి-విల్వలుడు

శూరపద్మునికి మేకతల కలిగిన అజముఖి అను చెల్లెలున్నది. అవివాహితయైన అజముఖి దుష్టబుద్ధికలది. దేవతల భార్యలను శూర పద్ముని కడ వదలిపెట్టి వారి సాహచర్యమును ప్రోత్సహించునది. ఈమె దుర్వాస మహాముని ద్వారా తనకు సంతానము కలుగవలెనని ఆయన తపోవనమున కేగినది.

"మహామునీ! నేను సంతానముకోరి మీ సాంగత్యమునభిలషించి వచ్చినాను. తాము నాతో సుఖించి నా కోరికను నెరవేర్చుమని ప్రార్థించు దానను" అని వేడిన అజముఖిని చూచి అమె శూరపద్మాసురుని సోదరి యని గ్రహించినాడు.

"అజముఖీ! నేను తపోధనుడైన మునివర్యుడను! యోగినే కానీ భోగినికాను! నీ సుఖభోగలాలసతకు నాకన్నా శ్రేష్టుని మరెవ్వరైనా చూచుకోరాదా!?" అని మంచి మాటలతోనే తన తిరస్కారమును దుర్వాసుడు తెలిపినాడు. అయినా వచ్చినపని కాకుండా అజముఖి వెళ్ళ దల్చుకోలేదు. బలాత్కారంతో భోగించిన కారణాన దుష్టస్వభావులైన వలలుడు-వాతాపి అనే యిరువురు కుమార్లు వారికి కలిగిరి.

వీరు తండ్రికి నమస్కరించి "తండ్రీ! నీ తపోశక్తిని మా యిర్వురికీ ధారపోయు"డని కోరిరి ఇదివిన్న దుర్వాసుడు "ఓరీ! దుష్ట స్వభావులారా! అమూల్యమైన నా తపోధనాన్ని అపాత్రదానం చేయు"నని బదులు పలికెను. తండ్రియనికూడా తలంచని యీ దుర్మార్గులు ఆ మహామునిని చంపివేయుటకు సిద్ధపడిరి. ఇది తెలిసికొన్న రుద్రాంశ సంభూతుడైన దుర్వాస మునీంద్రుడు, "ఓరీ! నా కుమారులైనమీరు నన్నే కబళించ దలచిన మిమ్ములను నాలాంటి తపోమూర్తియే నాశనమొనరించ గలడు పొండు!" అని శపించెను.

ఇలా శాపగ్రస్తులైన వలలుడు-వాతాపి అనే అజముఖి పుత్రులు 'కొడగు' సమీపమందలి అరణ్యమున నివాసమేర్పరచుకొనిరి. దారిన పోయే తపోమూర్తులైన మునివర్యులను వంచనచేసి వారిని చంపి తినుచుండిరి. ఈ విషయము వారికి తెలియక జరుగుచుండినది.

ఒకరోజు అగస్త్యమహాముని వీరి కంటపడగా మామూలుగానే నయవంచనచేసి, ఆయనను ఆహ్వానించినారు. వలలుడు వాతాపిని చంపి మాంస ఖండములుచేసి వండి, వివిధ పంచభక్ష్య పరమాన్న చిత్రాన్నములను సిద్ధముచేసి అగస్త్యునికి భోజనమిడెను. అగస్త్యులవారు తృప్తిగా వలలుడు పెట్టినదంతయూ అరగించెను. యథావిధిగా వలలుడు "వాతాపీ! శీఘ్రమే రమ్ము!" అని పిలిచెను. జరిగిన మోసమును గ్రహించిన అగస్త్యుడు వెంటనే తన పొట్టను నిమురుచూ ఒక అద్భుతమైన మంత్రమును జపించెను వాతాపి ఆయన కడుపులోనే జీర్ణమాయెను. ఇది తెలిసిన వలలుడు మునీంద్రుని చంప ప్రయత్నించెను.

ఒక దర్భను అభిమంత్రించి వలలుని చంపివేసిన తర్వాత అగస్త్యుడు కొడగు చేరెను.

బ్రహ్మహత్యా దోషము కలిగినందువల్ల పరమేశ్వరుని లింగరూప మున అర్చించి ఆ పాతకము నుండి తప్పించుకొనెను.

దేవగురువైన బృహస్పతి యీ వివరములను శ్రీషణ్ముఖ సుబ్ర హ్మణ్య స్వామికి చెప్పెను. ఇంకనూ కొన్ని వివరములను యిలా చెప్ప దొడగెను. ఈ అగస్త్య కథకు సంబందించిన సందర్భము తరువాత ప్రస్తావించెదను.

## దేవేంద్రుని అజ్ఞాతవాసము

శూరపద్మాసురునికి ఇచ్ఛామాత్రమున అన్ని లోకములకు గొం పోవు మహిమాన్వితమైన ఇంద్రజాలమనే రథము కలదు. ఒక దినము పాతాళలోకమునకేగుచుండెను. మరుసటి దినము సత్యలోకము, మరొ క్క దినము వైకుంఠము యిలా అన్నిలోకములకు శూరుడు తన తేరులో విహరించి అందరినీ తన ఆజ్ఞాబద్ధులుగా జేయుచుండెను. ఏ లోక మేగినా యెందు కాలిడినా సాయంసమయమునకు వీర మహేంద్రపురికి మరలి వచ్చుచుండెను.

ఒక దినము తన సేనాపతులలోనొకని పిలువనంపెను. వాడు తన ముందురాగానే "వలయు సైన్యముతో పొమ్ము ఇంద్రుని-ఇంద్రాణిని పట్టి తెమ్మ"ని ఆనతిచ్చెను. ఇది తెలిసికొన్న సురపతి శచీదేవిని తోడ్కొని స్వర్గమునువీడి ద్రవిడ దేశమందల 'శీర్కాళి' అనే పుణ్య స్థలమున తలదాచుకొనెను. ఆ సమయము ఇంద్రకుమారుడగు జయం తుడు వైకుంఠమునందుండెను. శూరసైన్యము అమరావతిలో దేవేంద్రునీ -శచీదేవినీ వెతకిరి. వారు కన్పించక పోవుటతో శూరపద్మాసురుని కడకు మరలి వచ్చిరి.

చిదంబరం సమీపమున శీర్కాళి అనే పునీత స్థలమున ఇంద్రుడు తన దేవేరితో ఒక ఉద్యానవనమున దాగుకొనెను. రాక్షసులాతనిని వెతకుచూరాగా యిరువురూ మల్లెపందిరిసల్లుకొనిన వెదురు చెట్లుగా మారిరి. రాక్షసులక్కడ వర్షము పడనీయిని కారణాన తోటలోని చెట్లు వాడిపాసాగెను ఒక అశరీరి సురేంద్రునితోనిట్లు పలికెను, "దుఃఖింపకుము! ఇక్కడికి నీటి ప్రవాహము వచ్చిచేరును!" ఈ మాటలతో శచీపతులిరువురు పూరటనొందిరి.

## వింధ్య పర్వతము

నారదుడు జయంతుని వైకుంఠమందు జూచి "జయంతా! దిగులు చెందకు! నీ తల్లిదండ్రులకు ఏ కష్టమూ శూరపద్మాసురుని నుండి కలుగదు!" అని పూరడించెను. భయపడి పారిపోయివచ్చిన దేవతలను జూచి జయంతుడు ధైర్యము కలిగించెను.

నారదుడు వింధ్య పర్వతమును చేరెను. వింధ్యుడు సవినయముగా నారదునికి నమస్కరించెను. "వింధ్యపర్వతరాజా! హిమాలయ పర్వతమునకు సమముగా ప్రకాశించుచున్నావు" అని పొగడెను. పొగడ్తకు మించిన చేటువేరేమున్నది! అందుకే 'ఆత్మస్తుతి పరనింద' పనికి రాదన్నారు. వింధ్యపర్వతమునకు నారదుని మాటలతో గర్వమేర్పడినది ఆకాశమునంటే ఎత్తుకు ఎదిగినాడు. దేవతలు భయపడిరి. అగస్త్య మహామునికి దేవతల సంకటములు దీర్పవలెనని సంకల్పము కలిగినది పరమేశ్వరునిదలంచి స్తోత్రములు జేసెను. కైలాసపతి అగస్త్యముని యెదుట ప్రత్యక్షమాయెను. "మునివరా! ఏమి కావలయు"నని అడిగెను "మహాదేవా! వింధ్యపర్వతము కీర్తికాంక్షతో దురాక్రమణచేసి లోకకంటకుడైనాడు. వానిని యణచుటకు కావలసిన బలమిచ్చినన్నాశీర్వదింపుము!" అని అగస్త్యుడు కోరెను.

అగస్త్యమునీ! శ్లాఘ్యమైన లోకకళ్యాణమునకు సంబంధించిన వరమునేకోరినావు! నీ అభీష్టము సిద్ధించే వరమునిస్తున్నాను. నీక నీవే

పాటి! వింధ్యపర్వతముయొక్క గర్వమునణచెదవు! కావేరినది పరమ పవిత్రమైనది. ఈ నదీజలాన్ని నీ కమండలంలోనికి గ్రహించి, నీవు కోరినప్పుడు కోరినచోట విడచివేయగల శక్తిని నీకు ప్రసాదిస్తున్నాను, అని పలికి శివుడదృశ్యమాయెను.

## అగస్త్యుడు దక్షిణభారతము చేరుట

తదుపరి వింధ్యపర్వతము దిశన అగస్త్యుడు ప్రయాణము చేసెను. మార్గమందు మాయాపురి అడ్డగించినది. మాయాపురి యందలి క్రౌంచాసురుడు అగస్త్యుని చంపివేయనెంచెను. క్రౌంచాసురుని మాయను గ్రహించిన అగస్త్య మహాముని చేతిలోని దండముతో వానిని తాకగానే పర్వత రూపమునగల క్రౌంచుడు తునాతునకలాయెను. "ఓయీ! క్రౌంచాసురుడా! నీ మాయాశక్తులన్నీ నశించుగాక! ఇలాగే క్రౌంచ పర్వతముగా నిలిచియుండుము! శివకుమారునిచే చావనున్నావు! కనుక నిన్ను ఇంతటితో వదలివేయుచున్నాను!" అని అగస్త్యుడు పలికి, తన కమండల మందలి మంత్రజలమును వానిపైజల్లి, వాని మాయాశక్తులన్నీ తీసివేసెను. క్రౌంచుడు శిలాపర్వతముగా నిలిచియుండెను.

తదనంతరం కాశీ మొదలగు పుణ్య క్షేత్రములను దర్శించు కొంటూ వింధ్య పర్వతమును చేరిన అగస్త్యుడు "నేను దక్షిణాపదము నకు వెళ్ళవలెను దారి విడువు"మని అజ్ఞాపించెను. ఆకాశవీధిలో సూర్య, చంద్ర, నక్షత్ర మండలములన్నీ నన్నుదాటిపోలేక అలాగే నిలిచి యున్నారు! వారే తొలగిపోవుచుండగా నీకా భయపడెదను! తొలగిపొమ్ము అని వింధ్యుడు అహంకరించి మాట్లాడెను.

అగస్త్యుడు వింధ్యుని తలమీద తన అరచేతినుంచి క్రిందికి నొక్కి వేసెను. తన శక్తితో వానిని పాతాళమునకు నొక్కివేయగా వింధ్యుని గర్వమడగినది.

"అగస్త్య మహామునీ! నా అహంభావమునకు తగిన శాస్తిజరిగినది

నేను మరలా పూర్వపు స్థితిలో వుండునట్లు నన్ను కనికరించు"మని ప్రార్థేయపడెను.

"నేను దక్షిణ దేశమునుండి మరలా తిరిగి వచ్చినప్పుడు నీవు మొదట ఎంత ఎత్తులో వుండినావో అదే ఎత్తుకు ఎదుగగల"వని చెప్పి దక్షిణదేశ సంచారమునకు అగస్త్యుడు బయల్దేరెను. కానీ అగస్త్యులవారు దక్షిణభారతమందే నిలిచిపోయిన కారణాన వింధ్యపర్వతము పాతాళ మందే పడియున్నాడు. అలా కొడగుచేరేముందు అరణ్యములో వలలునీ వాతాపినీ సంహరించాక తన రాకతో ద్రవిడభాష అవిర్భవము, కావేరి నదీ ఆగమము చేసిన మహాముని అగస్త్యుడు. వాతాపి కథ ముందే చెప్పియున్నాను.

## కా వే రి

'మహతి'ని మీటుచూ నారదమునీంద్రుడు శీర్కాళికి వచ్చెను. వెదురు బొంగులుగా మారియున్న ఇంద్రాణి ఇంద్రులున్న ఉద్యాన వనమంతయూ నీరులేక యెండిపోయియుండుటను గమనించి, దేవేంద్రా చింతింపకుము, కావేరీ జలమంతటినీ కమండల మందుంచుకొని అగస్త్యముని 'కొడగు'లో ఉన్నాడు. నీవు విఘ్నేశ్వరుని ధ్యానింపుము. అన్ని విఘ్నములు తొలగునని ఆశీర్వదించి వెడలెను.

ఇంద్రుడట్లే వినాయకుని స్తుతించెను ఇంద్రుని ప్రార్థనలనాల కించిన గణేశుడు కొడగులోనున్న అగస్త్యుని కమండలముపై కాకి రూపమున కూర్చొనగా, కమండలము దొరలినది, అందలి కావేరి జలము నదిగా ప్రవహించినది. అగస్త్యునికి కాకిరూపమున వచ్చిన వారెవరో గ్రహించుటకు ముందే కోపము చెందెను. తక్షణమే గణపతి అగస్త్యుని ముందు నిలిచి "అగస్త్యా! దేవేంద్రుని రక్షింపనెంచి నీ కమం డలమును దొర్లించినాను కోపింప" కుమని చెప్పెను.

"మహాగణపతీ! నీవెవరో గ్రహించక కోపించినాను మన్నింపు" మన వేడెను. సంకటహరుడైన శ్రీ గణేశుడు అగస్త్యుని దీవించి అదృశ్య మాయెను. అగస్త్యుడు కొడగు ప్రాంతాన్నివీడి దక్షిణ దేశమునకేగెను.

అలా దేవేంద్రునికేగాక దక్షిణదేశమందలి ప్రజలకు వరప్రసాదిగా కావేరినది లభించినది. ఇంద్రుడు-శచీదేవి యిరువురూ పలు జాతుల పుష్పములను శీర్కాళిలోని వనమందు సేకరించి, శివలింగమును ప్రతిష్ఠించుకొని, లోకేశ్వరుని అభిషేకించి, ఫలపుష్పాదులను నైవేద్యమిడి ఆరాధించుచుండిరి.

## దేవతల ఆగమనము

శివార్చన చేయుచున్న దేవేంద్రుని శీర్కాళి నుండి కైలాసమునకు తోడ్కొనిపోవనెంచి దేవతలందరూ శీర్కాళిలోని వనమునకేతెంచిరి. దేవేంద్రుని చూచి తమ కష్టములను పరమశివునితో చెప్పుకొనుటకు రమ్మనిరి. తన దేవేరియైన శచీదేవిని ఒంటరిగా విడచి వెళ్ళుట క్షేమముకాదని తలంచి సురపతి భూపతియైన అయ్యప్ప స్వామిని ధ్యానించి, ఆయన సంరక్షణలో శచీదేవిని విడచి, దేవతలతో కైలాసవాసుని దర్శనమునకేగెను. అయ్యప్పస్వామి తెల్ల ఏనుగునెక్కి శీర్కాళి వనమందు శచీదేవికి కాపలాగా న ండెను. ఈ అయ్యప్పస్వామినే తమిళ నాట గ్రామమందలి కావలి దైవముగా, 'అయ్యనార్' అని పిలుచుచూ యిప్పటికీ పూజించుట చూడవచ్చును. శచీదే కి చేరువలో తన అనుచరుడైన 'మహాకాలు'డను వానిన రక్షణ నిమిత్తమై అయ్యప్ప నియమించెను.

## అ జ ము ఖి

శూరపద్మాసురుడు శచీదేవి పొందుకోరి తపించుటన జూచి, వాని సోదరియైన అజముఖి ఇంద్రాణి శీర్కాళిలో నుండుటను తెలిసికొని అక్కడకు వచ్చినది. అజముఖిని చూచిన ఇంద్రసతి మేనెల్లవణకినది.

అందానికే అందమైన ఓ శచీదేవీ! నీ అందము మరెవ్వరికీ లేదు నీ యవ్వన సంపదను కొల్లగొట్టుటకు తగినవాడు నా అన్నయ్యగు శూరపద్ముడే. అంతేగానీ దేనికీ కొరగాని ఆ ఇంద్రునితో కాపురము చేయుటవల్ల ఏమి సుఖమున్నది? నా అన్న నిన్ను తలచి తలచి నిట్టూర్పు

లీడుచున్నాడు! నామాటవిని నాతోరమ్ము! నిన్ను శూరపదుడమ్మ అపు రూపంగా చూచుకొంటాడు! వెయ్యిన్నీ అండములను పరిపాలించేనాఅన్న ముందు భయపడిపారిపోయే ఇంద్రుడు నీకు భర్తఅని చెప్పుకోవడం మన్నన అవుతుందా? ఐశ్వర్యవంతుడు, బలశాలీ, పురుషపుంగవుడైన వానినే స్త్రీ కోరుకొంటుంది. బీరువూ, నాఅన్న బానిసైన దేవేంద్రుడు నీ లావణ్యాన్ని అనుభవించడం తగదు! కనుక నా మాటలు విని నా అన్నను చేరు! అని అజముఖి శచీదేవిని మాయమాటలు చెప్పి, తన వెంట తీసికొని వెళ్ళపలెనని ప్రయత్నించెను. ఈ మాటలు వినిన శచీదేవి చెవులు మూసుకొని "శివ శివా!" అని ప్రార్థించినది.

"అజముఖీ! పతివ్రతలు తమ భర్తల దారిద్ర్యాన్ని కూడా ఐశ్వ ర్యంగానే భావిస్తారు. పరపురుష సాంగత్యంకోరే స్త్రీలు నరకాన్ని అను భవిస్తారు. కశ్యప ప్రజాపతియొక్క పుత్రియైన నీవా యిటువంటి మాటలతో నన్ను నిర్బంధించుటకు ప్రయత్నించునది? నీలో విచక్షణా జ్ఞానము నశి చినది! నాభర్తతప్ప మరెవ్వరూ నాకు తోడునీడగా నిలువ నేను అంగీకరించను! నీవు ప్రాణాలతో వుండదలచినచో వెంటనే యిక్కడ నిలువకుము! వచ్చిన దారిన మర్యాదగా పొమ్ము అని శచీదేవి పలికినది.

అజముఖి కోపించి శచీదేవి చేయినిబట్టిలాగినది. ఇది చూచిన మహాకాలుడు అజముఖిని లాగి బీకరముగా పొరసలిపి "అజముఖీ! నీవు ఆడుదానివైనందున ప్రాణాలతో వదలుచున్నాను. నా సంరక్షణలో నుండు ఇంద్రాణి చేయిపట్టి లాగిన నీ చేతిని మాత్రము ఖండించి నీకు తోడుగా వచ్చిన నీ చెలికత్తె దుర్ముఖియొక్క చేతినికూడా నరికివేసి ప్రాణాలతో విడచివేయుచున్నాను" అని వారి చేతులను నరికివేసెను. లక్ష్మణుడు శూర్పణఖకు చేసిన పరాభవము గుర్తుకుతెచ్చు సంఘటన యీ యిరువురికీ వాటిల్లిన హస్త ఖండన దుర్ఘటన.

"ఇంద్రాణీ! నన్నింత అవమానము చేసిన నిన్నూ, ఈమహాకాలునీ యింతటితో విడచివేయుదునని అనుకోవద్దు! నా అన్న శూరపద్మునితో

చెప్పి మిమ్ములను చెఱసాలలో వేయించిన గానీ నాకు శాంతిలేదు!" అని ప్రతిజ్ఞచేయుచూ దుర్ముఖిని తోడ్కొని నిష్క్రమించినది.

## ఇంద్రుని రాక

నారదుని మూలముగా వివరములు తెలిసికొన్న సురేంద్రుడు శీఘ్రముగా మరలి రాగానే శచీదేవిని ఓదార్చి, మహాకాలునికి వీడ్కోలిచ్చి పంపివేసెను. దేవతల సమూహము వెంటరాగా ఇంద్రాణిని తోడ్కొని హిమాలయమునకు వెడలెను.

## శూరపద్ముని సభ

కొలువు తీరిన శూరపద్మునికడకు అజముఖి – దుర్ముఖులు హాహాకారములు చేయుచూ వాని పదములపైపడి ఏడ్చిరి. జరిగిన దంతయూ చెప్పుచూ, నీ సోదరినైన నన్నింత పరాభవము చేసిన వారిని వూరక వదలివేయకు"మని అజముఖి అర్థించినది.

శూరపద్మాసురుని కోపమునకు అవధులులేక తన తమ్ములను చూచి, "నాజానిసలైన ఇంద్రాది దేవతలను శిక్షింపక వదలివేసినచో నా అధికారమేమగునో ఆలోచించినారా?" అని గద్దించుచూ ప్రశ్నించెను.

ఇంతలో భానుకోపుడులేచి, "తండ్రీ! ఈ దేవతల కండకావరమును నేను అణచివేయుదును. ఈ మాత్రము చేయకపోయినయెడల యిక మీ సార్వభౌమత్వమునకు గుర్తింపేమున్నది? అనుమతించి నన్ను పంపు"మని కోరెను.

"సెభాష్! కుమారా! దిగ్విజయుడవైరమ్ము" అని భానుకోపుని పంపెను. తర్వాత బ్రహ్మదేవుని రప్పించి అజముఖి – దుర్ముఖుల చేతులను యథావిధిగా పెరుగునట్లు చేయించెను.

దేవేంద్రుని కుమారుడు జయంతుడు. భానుకోపుని రాకను తెలిసి ఐరావతమెక్కి భానుకోపునితో యుద్ధముచేయ సంసిద్ధుడాయెను. భాను కోపునితో మాయాయుద్ధము చేయు జయంతుని జయింపనెంచి శుక్రా చార్యులవారి నుండి నేర్చిన మంత్రములనుపయోగించి భానుకోపుడు వాని మాయాజాలమును పారద్రోలెను. దేవతలు రాక్షసులతో యుద్ధము సలిపిరి.

భానుకోపుని శరాఘాతముతో జయంతుడు మూర్ఛిల్లెను. అమృ తము సేవించిన కారణాన జయంతుడు మరణించలేదు. కానీ భాను పుని బందీఅయ్యెను. అసురులు అమరావతిని కాల్చి బూడిదచేసిరి. భానుకోపుని సైన్యము జయజయధ్వానములు పల్కినది. కాలము అనుకూలము కానిచో దేవతలకైనా కష్టములు తప్పవుకదా!

దేవేంద్రుని కుమారుడు చెఱబట్టగా ఐరావతమునకు ఆగ్రహము కలిగినది. భానుకోపుని రథమును నుగ్గునుగ్గుచేసిన గానీ దానికోపము చల్లారలేదు. 'తిరువె గాడు' అనే శివక్షేత్రమునకు చేరి కోల్పోయిన తన నాలుగు దంతములను మరలా పొందినది.

శూరపద్ముని యెదుట జయంతుని మిగిలిన దేవతలను నిలబెట్టిన భానుకోపుని జూచి శూరపద్మాసురుడు సంతసించెను. 'వీరిని కారాగార మున బడవేయు'డని ఆజ్ఞాపించెను. శచీదేవి ఉమాపతి యెదుట కైమోడ్చి నిలిచి, "మహేశ్వరా! మేము దక్షయజ్ఞమునకు మీరు రాక పోయినా వెళ్ళినాము. అందుకు తగిన శిక్షలను రాక్షసులమూలముగా అనుభవించినాము. ఇకనైనను మమ్ములను దయచూడు"మని ప్రాధేయ పడుచూ సాగిలపడి నమస్కరించెను.

"శచీరమణా! గిరిజరాజుతనయ పార్వతీదేవితో నా వివాహము జరిగి చాలాకాలమైననూ-మాకు కుమారుడు కలుగలేదని మునుపు మీరు మమ్ములను 'కుమారసంభవము' కోరి ప్రార్థించినారు. షణ్ముఖునివల్ల శూరపద్మాసుర సోదరులందరూ గతించక తప్పదు! ఊరడిల్లుము!" అని ఓదార్చెను గిరిజారమణుడు. ఆదిదంపతుల చెంత యుండిన

కుమారస్వామితో "శివకుమారా! జయంతాది దేవతాసమూహమును శూరుని కారాగారములో మగ్గుచున్నారు. ఆ రాక్షసరాజైన శూరపద్ముని, వాని సోదరులను, వాని అశేష సేనావాహినిని దునుమాడినగాని దేవతలు మరలా వారివారి పదవులలో నిలుపలే"రని దేవగురువైన బృహస్పతి అర్థించెను. మేషవాహనుడైన స్కందుడు దేవగురువు నుండి రాక్షస నాథుని వృత్తాంతమంతయూ తెలిసికొనెను. తర్వాత ఇంద్రాదులను జూచి, "భయపడవద్దు! నేను శూరసేనాదులను దునుమాడి మిమ్ములను రక్షించెద" నని పలికెను.

## వీరబాహు రాయబారము

శూరపద్ముడు మిగుల బలవంతుడు. శివ వర బలగర్వితుడు. 1008 అండములను పరిపాలించువాడయ్యెను, దేవతలయందు ద్వేష బుద్ధి కలిగియుండెను. అష్టదిక్పాలకులను, మిగిలిన దేవతలను తన బానిసలుగా చేసుకొనిన పరాక్రమశాలి. దేవతలను బందించెను. సముద్ర మధ్యమున విశాలమైన నగరమును నిర్మించుకొని వీరమహేంద్రపుర మని ఆనగరమునకు పేరెడి, దినమునకొక అండమును ఇంద్రజాలమనే రథమునెక్కిపోయి చూచి వచ్చుచుండెను.

అన్నియుండినను సన్మార్గమున ప్రవర్తించలేదు. తన అహం కారము వలన తనతోపాటు రాక్షసజాతి అంతయును నశించునని తెలిసి కొనలేకుండెను. దైవకార్యములను సలుపు ఋషుల యజ్ఞయాగాది కృతువులను నాశనమొనరించుచుండెను.

కుమారస్వామి వానితో యుద్ధము చేయుటకు సన్నాహములు చేయించెను. "ముందుగా శూరపద్మునికి రాయబారిని పంపెదము. దేవతలను బంధవిముక్తులను చేయమని చెప్పిచూతము. దానికి అతను సమ్మతించని యెడల అప్పుడు పోరు సలిపెదము" అని తీర్మానించెను. తద్వారా వానితోబాటు వాని అనుచరులను అంతము చేసెదము"అని తీర్మానించెను. తనకు సమానుడైన వీరబాహుని దూతగా పంప నిశ్చయిం చెను. ఈనిర్ణయమునకు బ్రహ్మవిష్ణ్వాదులు అంగీకరించిరి.

"వీరబాహు! వీరమహేంద్రపురికి పోయి శూరపద్మని చూచి ఇంద్రకుమారుడైన జయంతుని తతిమా దేవతలను విడుదలచేయమని అడుగుము. అలాచేయుటకు అతడు సమ్మతించినచో రేపే యుద్ధము చేయుటకు ఆయత్తము కమ్మనిచెప్పి రమ్ము" అని వీరబాహుని సుబ్రహ్మణ్యుడు పంపెను.

సుబ్రహ్మణ్యస్వామికి మ్రొక్కి వీరబాహు వీరమహేంద్రపురికి పోవుటకు బయలుదేరెను. గంధమాదన పర్వతంచేరి సముద్రమును దాటి వీరమహేంద్రపురిని చేరెను. అచ్చట నగరాభివృద్ధిని గాంచి విస్మయమొందెను. జయంతుని చెరసాలలో చూచి శీఘ్రమే షణ్ముఖుడు మిమ్ములనందరిని విడుదల చేయించు"నని ధైర్యవచనములను పలికెను. శూరపద్మని సభను చేరెను.

శూరపద్ముడు గంభీరముగా సింహాసనమును నలంకరించి యుండెను. సకల రాజోపచారభోగములను, నృత్యగీతాది విలాసములను అనుభవించుచుండెను వీరబాహు శూరపద్మని ఎదుట నిలిచెను. సుబ్రహ్మణ్యని కరుణవల్ల ఒక అద్భుతమైన ఉన్నతాసనము తన ముందు నిలిచెను. వీరబాహు దానినధివసించెను. రామాయణ గాథలో రావణునిముందు దూతగా వెళ్ళిన హనుమంతుడు తనతోకనే ఉన్నతా సనముగా చేసుకొని ఎక్కి కూర్చొన్న సంఘటన పాఠకులకు తెలిసినదే! అలాగే ఇక్కడ వీరబాహు సుబ్రహ్మణ్యస్వామి దూతగావచ్చి, ఆయన అనుగ్రహముతో దివ్యమైన సింహాసనమును అలంకరించుట సభికులు దిగ్భ్రాంతి చెందిరి. వీరబాహుని అతిశయమును గాంచి శూరపద్ముడు మిగుల కోపించెను.

"ఏమాత్రము జంకులేకుండా నా సభలో నాముందే నా ఆసనము కన్నా ఉన్నతమైన ఆసనమును ఎక్కికూర్చొన్న నువ్వెవరివి? చెప్పు" మని శూరపద్ముడు గర్జించెను.

వీరబాహు కించిత్తైనా వదరక."నేను కుమారస్వామి పంపగావచ్చిన దూతను! నాపేరు వీరబాహు! నీకు హితవుచెప్పమని శివ కుమారుడు

నన్ను పంపెను. నీవు ఇలాగే సుఖమయజీవనము చేయవలెనన్న ఇంద్ర కుమారుడైన జయంతునీ, తతిమా దేవతలను విడుదల చేయుము. సౌమ్యముగా నీవుదారికిరాని పక్షమున నీకు బుద్ధివచ్చునట్లు చేయదగునది ఏదో అదిచేసిరమ్మని స్కందుడు నన్ను పంపెను.

వీరబాహువు ఇంకను ఇలా చెప్పసాగెను. "ఓయీ శూరపద్మా సత్యము నుండి, ధర్మము నుండి, న్యాయము నుండి దారి తప్పిన వారెవ్వరైనా అందుకు తగిన ఫలితములను అనుభవించక తప్పదు. అందువలన నీతోబాటు నీకులమంతయు నశించునని ఏల గ్రహించలేకున్నావు? తపాశక్తిచేత పొందిన వజ్రసమానమైన శరీరం, దీర్ఘాయువు 1008 అండములను ఏకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించగల అర్హతను నీవు కలకాలము నిలుపకొనదలచినచో దేవతలందరినీ నిర్బంధించుట మాని వారిని వదలివేయుము! శివశక్తి కుమారుడైన స్కందుని గురించి నీవు ఎప్పుడో తెలిసికొనియేయుందువు. తారకాసురుని మాయ, క్రౌంచాసురుని మాయ, నీ సామర్థ్యములు సుబ్రహ్మణ్యుని ముందు నిలువలేవు. ఇప్పటికి వారిద్దరిని శివసుబ్రహ్మణ్యుడు సంహరించిన సంగతి నీకు తెలియనిదా? సామ, భేద, దాన, దండోపాయములచే రాజనీతిని అనుసరించి నిన్ను హెచ్చరించిరమ్మని "తిరుచెందూరు"లో అశేషమైన సేనా వాహినితో యుద్ధమునకు సిద్ధమై వచ్చియున్న శివబాలుడు నన్నుదూతగా నీతో రాయబారముచేయ నియోగించెను. కనుక చక్కగా ఆలోచించి నీ శ్రేయోభిలాషులతో చర్చించి సుముఖమైన నిర్ణయము గైకొనుము" అని పలువిధములుగా నయాన భయాన సమయోచితముగా మాట్లాడి శూర పద్మని నచ్చచెప్పుటకు యత్నించెను.

ఇట్లు వీరబాహువు చెప్పగానే శూరపద్ముని కన్నులు నిప్పులు గ్రక్కెను. ఉగ్రరూపముదాల్చి చేతులనుతట్టి, 1008 అండములకు నాయకుడైన నన్ను పండ్లయినా మొలవని ఒక బాలుడా నన్ను బెదిరించునది? శభాష్! చాలాబాగుంది! దేవతలు రాకసులకెంతో కీడుచేసిరి! అందువలన వారినినేను చెఱబట్టినాను! కీడుచేసిన వారికి మేలు చేయుటయా? ఇదొక న్యాయమని చెప్పచూ నా కళ్ళముందు పుట్టి పెరుగు

చున్న, ఆటలాడుకొను బాలుడు పంపగా నీవొక రాయబారమా? ఆ! ఎంత సాహసము? ఎంత సాహసము? దేవతలు మా వంశమునకు చేసిన కీడు ముందు నేను వారికి చేసినది అల్పమని భావించుచున్నాను. అయినా నీవు దేవతల పక్షమున సాహసించి దూతగా వచ్చినావు దూతగా వచ్చిననిన్ను ఏమీ చేయకూడదని వదలివేయుచున్నాను. నీ ప్రాణాలు దక్కించు కొనదలచినచో పొమ్ము! అని హుంకరించి వీరబాహునివైపు తర్జని చూపుచూ సభను విడచిపొమ్మని ఆదేశించెను.

శూరపద్మాసురుని నిర్లక్ష్య వైఖరినిజూచి వీరబాహువు మిక్కిలి కోపించెను. "రాక్షసాధమా! మా కుమారస్వామినా బాలుడని అపోహతో ఆక్షేపించెదవు? ఆయనెవరో తెలుసా? సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపమైన పరమేశ్వరుడే! బాలసుబ్రహ్మణ్యుడై లీలావినోదములు సలుపుట ఆయన మహిమలలో ఒక భాగమని తెలియక అజ్ఞానివై అహంకరించి ప్రేలు చున్నావు! శివుడే శివకుమారుడు! శివకుమారుడే పరమశివుడు! తొల్లి బ్రహ్మదేవుడు బాలుడని యెంచి శివకుమారుని నిర్లక్ష్యము చేసెను. అందుకు పలితముగా స్కందగిరిలో ఖంధీ అయినాడు. పరమపదము నకే అధారభూతుడైన జగద్రక్షకుడైన కైలాసవాసునికి గురువై 'స్వామి నాథుడు'గా పేరొందినాడు. ఆయన అనుమతి లేదు కనుక నీ నాలుకను ఉత్తరించక వదలివేయుచున్నాను. కేవలము దౌత్యము నెఱపుటయే నాకిచ్చిన ఆదేశమై నందున, నిన్ను ఇంతటితో విడచిపుచ్చుచున్నాను. ఇప్పటికైనా మించినది ఏమీలేదు. దేవతలయెడ శతృత్వముమాని వారితో సఖ్యముగా నుండుము. చెఱబట్టినవారిని వెంటనే విడుదల చేయుము. షణ్ముఖస్వామి మైత్రిని పొందుము. అందువలన నీవు సురక్షితముగా పరిపాలన చేసుకొందువు" అని సమయోచితమైన మాటలతో శూరపద్మునికి నచ్చజెప్ప మరలా ప్రయత్నించెను.

వీరబాహు మాటలను విన్న శూరపద్ముని అహందెబ్బతిన్నది. అగ్నిలో ఆజ్యం పోసినట్లైనది. "దూతగా వచ్చినవాడవు కనుక నిన్ను ప్రాణములతో వదలివేయుచున్నాను. పైగా నిన్ను పంపినవాడు బాలుడు అందువలన ఇంతవరకు నిన్ను ఏమిచేయలేదు. లేకుంటే నీవిన్ని

మాటలు మాటలాడనిచ్చేవాడనుకాను. బాలుని పరాక్రమమును గురించి నీ అభిప్రాయము వినడానికి బాగానే వున్నది. ఒకవేళవాడు గొప్పవాడే అనుకొందాము. వానిని చూచి భయపడవలసిన అవసరం నాకులేదు. నేను దేవతలనే జయించిన వాడను. వారిని చెఱబట్టినాను. వారిని విముక్తులను చేయుట ఎవరి తరముకాదు" అనెను. తరువాత సభలోని రాక్షసులను చూచి "వీడు దూతగా వచ్చినాడు. వీనిని చంపుట రాజనీతికాదు. పైగా అపకీర్తి వచ్చును. వీనిని చెఱసాలలో బంధించు టయే న్యాయము. కనక వీనిని బంధించండి" అని ఆజ్ఞాపించెను. వెంటనే రాక్షసమూక వీరబాహుని ఆసనము చుట్టూ చేరి వీరబాహుని బంధించుటకు యత్నించిరి. వీరబాహు పిడికిలితో కొందరిని గుద్దెను. కొందరిని అవలీలగా ఎత్తి సభామధ్యమమున పారవేసెను. వారి తలలు పగిలినవి. రక్తము ప్రవహించినది. అసువులు బాసిరి.

ఇట్టి స్థితిలో వీరబాహు వీరావేశముతో శూరునుద్దేశించి "మూర్ఖుడా! ఇక నీ ప్రాణములు నీవికావు! స్కందుని శక్త్యాయుధము నీ రొమ్మును చీల్చివేయును! ఇది నిజము! ఈలోగానీవు అనుభవించదగిన భోగము లను అనుభవించి యుద్ధమునకు సిద్ధముగానుండుము. నా దౌత్యము ముగిసినది. నేను వెళ్ళుచున్నాను" అని చెప్పుచూ అదృశ్యుడాయెను. అలాగే ఆసనముకూడా అంతర్ధానమయ్యెను. వీరబాహుని ఎట్లైనా బందిం చవలెనని శతముఖుడు అనే రాక్షసుని పంపెను. తన వెంటవచ్చుచున్న శతముఖుని వీరబాహు చంపివేసెను. ఇంకా ఎంతోమంది రాక్షసులను దునిమెను. వీరమహేంద్రపురి నగరమును ధ్వంసము చేసెను. తన శౌర్యమును వీరమహేంద్రపురి లోని రాక్షసులందరూ గుర్తించునట్లు చేసెను. అక్కడి నుండి సముద్రమునుదాటి దేవసేనాపతియైన శ్రీ సుబ్రహ్మణ్యస్వామి విడిదిచేసి యుండు తిరుచెందూర్ నగరమును చేరెను. స్వామి చిరునవ్వుతో వీరబాహుని ఆహ్వానించెను. "వీరబాహు! నీ రాయబారమేమైనది?" అనిప్రశ్నించెను. వీరబాహు "దేవా! దేవతలను- చెఱనుండి వదలనని శూరపద్ముడు మంకుపట్టుచున్నాడు" అనిక్లుప్తము గా చెప్పెను. స్వామి అదే చిరునవ్వుతో " అంతేగాని అక్కడ నీవు చేసిన భీభత్సము గురించి-చెప్పుటకు ఏమియూలేదా?" అని అడిగెను.

"సర్వజ్ఞుడవైన నీకు తెలియనిది ఏమున్నది ప్రభూ? అయిననూ మీ ఆజ్ఞమేరకు జరిగినది చెప్పెదను. నన్ను బంధించమని శూరుడు తన సైన్యమును పురిగొల్పెను. దంతములు మొలవని బాలుడవని నిన్ను అధిక్షేపించెను. దూతనని కూడ మన్ననచేయలేదు. మంచిగా చెప్పిన మాటలు రుచించలేదు. పైగా నన్ను బంధించ ప్రయత్నించిరి. మచ్చుక నన్ను బంధించవచ్చిన రాక్షసులందరినీ మీ దయవల్ల సంహరించగలిగాను. శతముఖుడనే రాక్షస యోధుని చంపినాను. శూరపద్మునికి అత్యంత ప్రియమైన వీరమహేంద్రపురిని ధ్వంసమొనరించినాను. శూరుడు యుద్ధమునకే సిద్ధముగా నున్నాడు మీరు సాక్షాత్తు శివస్వరూప మని చెప్పినను తెలిసికొనలేని మూర్ఖుడైనాడు. జరిగినది ఇంతే స్వామి అని చేతులుజోడించి వినమ్రుడై పలికెను. సుబ్రహ్మణ్యుడు వీరబాహుని స్వామి భక్తికి, రాయబార సామర్థ్యమునకు సంతసించెను. తన్ను బాలుడని అలక్ష్యముగా మాటలాడిన శూరపద్మాసురుని నాలుకను ఉత్తరించ గలనని- అయినా తన అనుమతిలేని కారణాన అలా చేయలేదని వీర బాహు తనతో చెప్పకపోవడం అతని నిరాడంబరతను, దాసగుణశీలాన్ని చాటుచున్నదని అరసి పార్వతీబాలుడు లోలోన వీరబాహుని మెచ్చు కొనెను.

చెఱసాలలో బంధింపబడిన దేవతలుపోగా మిగిలిన దేవతలు తన్నెదుట నిలిచిరి. వారినిచూచి గాంగేయుడిట్లనెను. "కలతచెందకుడు! శూరునితో యుద్ధము అనివార్యమయినది. రాజనీతిని అనుసరించి దూతగా వీరబాహుని పంపినాను. శూరుని తపఃబలము క్షీణించినది. అందువల్లనే నేనెవరో గుర్తించని అజ్ఞానముతో హితోక్తులను ఆలకించని మూర్ఖుడాయెను అధికార గర్వము తలకెక్కినది. శూరపద్మాసురునికి నాచేతిలో ఆయువు మూడినది. రేపే మనము వానిసేనలతో వానిని రణరంగమున కలిసి కొందము" అని చెప్పగా విని ఇంద్రాది దేవతలు శివసుబ్రహ్మణ్యునికి అంజలిఘటించిరి.

# భా ను కో పు డు

(యుద్ధ సన్నాహము)

## శూరపద్మాసురుని మంత్రాలోచన

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దూతగా వచ్చిన వీరబాహుని చేతిలో తన కుమారుడైన వజ్రబాహు మరణించినవార్త తన చెవులలో పడగానే శూరపద్మాసురుడు విషాద సాగరమున మునిగెను శ్రీ సుబ్రహ్మణ్యుని యుద్ధసన్నాహములను చూచిరమ్మని సారంగుని వేగుగా పంపెను. వాడు తాను చూచివచ్చిన వివరములను శూరునికి తెలిపెను. వెంటనే సభను తీర్చి తగుమంత్రాలోచన చేయదొడంగెను.

"సభాసదులారా! మన తక్షణ కర్తవ్యమేమిటి"? అని అడిగెను. "రాజా! సుబ్రహ్మణ్యుని పసివాడనీ, భూతగణముల నాయకుడనీ తప్పుగా అంచనావేయవద్దు! మన సేనాధిపతులను పంపి అబాలునీ వాని సైన్యమును తుదముట్టించవలెను!" అని దుర్ముఖాది మంత్రిమండలి తమ నిర్ణయమును తెలిపినది. కాలజిత్తు, ధర్మకోపుడు మున్నగువారు "ఆ శిశువుతోబాటు వాని భూతగణములను మట్టుబెట్టి వచ్చెదము అనుజ్ఞ నొసంగుడు" అని ప్రగల్భములు పలికిరి. వీరి మాటలను సింహుడు, గండడు, అనలుడు ఆమోదించి ప్రసంగించిరి.

వీరంతా మాటలాడునంతవరకు వూరకుండిన భానుకోపుడు తన ఆసనము నుండి లేచి "తండ్రీ! క్రౌంచుడు, తారకుడు ఆ శివబాలుని చేతిలో చచ్చినారని తెలిసినపుడే నేను ఆ పసికందుని సంహరించి వచ్చెదనని మీకు చెప్పినాను. కానీ మీరే నన్ను ఆటంకమొనరంచి అనవసరముగా కాలయాపన చేసిరి. ఇప్పటికీ మించిపోయినదేమీలేదు. వెంటనే తగుసైన్యముతో నన్ను పంపుడు. అబాలుని జయించి వచ్చెదను" అని వీరావేశముతో నుడివెను. ఇదే విధముగా అగ్నిముఖుడు, హిరణ్యాసురుడు తమ్ము పంపమని శూరుని వేడిరి.

సింహముఖుడనేవాడు సకల శాస్త్రములను తెలిసిన వివేకి, వాడు శూరునుద్దేశించి, "రాక్షసకుల తిలకా! నీవు సుబ్రహ్మణ్యుని బాలుడని యెంచి యెందుకు మన రాక్షసకులాన్ని నాశనమొనరించ దలచినావు? తారకాసురుడు తపాశక్తితో వరప్రసాధియైనను ఆ శివబాలుని చేతిలో చచ్చెను గదా! నీవు అహంకరించి వానితో కయ్యమునకు దిగుచున్నావు! వాని దూతగా వచ్చిన వీరబాహువు ఈ వీరమహేంద్రపురినే భీభత్స మొనరించగలిగినపుడు, దేవసేనాపతియైన ఆ కుమారస్వామి నిన్నూ! నీ పరివార బంధుజనులందరినీ దునుమాడలేడా? బాగుగా ఆలోచింపుము! ఎదిరి బలమునెంచి సమరమునకు సిద్ధమగుటయే వివేకవంతుల లక్షణము! తెలసికొని ప్రవర్తించుట మంచిది!" అని పలువిధముల హితోక్తులను పలికెను. సింహముఖుని మంత్రాలోచనము శూరపద్మునికే గాక సభికులందరికీ నచ్చకపోగా విపరీత కోపావేశములను దెప్పించినది

శూరసేనుని కళ్ళెర్రబారినవి, ఆవేశపోరితుడై "ఓరీ! మూర్ఖుడా, నీవు ఆ బాలుడికి తొత్తువా? వానీ భూతగణములనూ, వానిని చూచి భయపడుచుననుకొందువా? ఆ పసిబాలుని పక్షమున నాతో మాట్లాడుటకు నీకెన్నిగుండెలున్నవి? తక్షణమే నా కళ్ళెదుట నిలువక యెక్కడికైనా వెడలిపొమ్ము!" లేకున్నచో నిన్నేమిచేయుదునో చెప్పలేను! హుం! వెళ్ళుము!" అని హుంకరించుచూ గర్జించిన శూరునిజూచి 'వినాశకాలె విపరీతబుద్ధిః' అని పెద్దలు పూరకజెప్పిరా? అని తన మనస్సులోనే యెంచుకొనుచూ సింహముఖుడిట్లనెను : "సోదరా! నన్నపార్థముచేసికొనవలదు! ఆజ్ఞయిమ్ము! తక్షణమేనేను నా దివ్యాయుధములతో ఆ శివబాలునితోను వాని భూతగణములతోనూ పోరాడి విజయముతో తిరిగి వత్తును!"

తమ్ముని మాటలతో పుప్పొంగిపోయిన శూరపద్ముడు శాంతించెను "ప్రియాతి ప్రియమైన తమ్ముడా! ప్రస్తుతము నీవు యుద్ధముచేయు నవసరములేదు! అవసరమైనచో నేనే కబురంపెదను. నీవు అంతః పురమునకు పోయి విశ్రాంతి పొందుము, పొమ్ము!" అని సింహముఖుని పంపివైచెను, తదుపరి సభ ముగించి తానుకూడా అంతఃపురమున కేగెను.

## హేమకూటమును చేరుట

బాల సుబ్రహ్మణ్యుడు వీరబాహుని పిలిచి, "యుద్ధమునకు తక్షణమే సన్నాహములు చేయు" మనెను. వీరబాహు సూచనలను దేవతలు పాటించిరి. వాయుదేవుడు స్కందునికి తేరు సిద్ధముచేసెను రెండువేల భూతగణ సేనావాహిని తయారైనారు. రణదుందుభులు మ్రోగెను. "దేవసేనాపతికి జయము!" అని జయ ధ్వానములు ఘోషించినవి.

తిరుచ్చెందూరు కడలిలో దేవసైన్యముడుగిడినది. కడలినిదాటి వీరమహేంద్రపురి ఎల్లలలో ఉత్తరదిశన చేరిరి. ఉత్తర ద్వారమున తన సైన్యముతో నగరప్రవేశము చేయనెంచిన శివకుమారుని జూచి దేవతలు కార్తికేయా! నీవు వీరమహేంద్రపురికిపోయి యుద్ధము చేయనవసర మేమున్నది? శూరపద్మాసురుని సైన్యమే యిక్కడకు వచ్చునట్లు చేయుము. అట్లు చేయుటయే సముచితముగా నుండుననిరి. శివ సుతుండు సమ్మతించగా, దేవశిల్పి మయుని పిలిపించిరి. అక్కడొక సుందరమైన నగరమును మయునిచే నిర్మించిరి. ఆ నగరము బంగారు వన్నెలీనునదై మిక్కలి శోభాయమానముగా నుండినది. కనుక 'హేమ కూట'మని పేరిడిరి. ఎవరికితగ్గ విడిదిలో వారుదిగిరి. మునివర్యులు వేదమంత్రములు పఠించిరి దేవదుందుభులు మ్రోగినవి. అప్పుడు పార్వతీసుతుడు తన మందిరమున ప్రవేశించి నవరత్నఖచితమగు తన సింహాసనముపై దివ్యముగనదివశించెను. అప్పుడు త్రిలోకసంచారియైన దేవర్షి నారద మునీంద్రుడు శూరపద్మాసురుని కడకేగి, వెయ్యిన్ని ఎనిమిది అండములకు అధిపతివైన అసురరాజా! నేను మీ కులగురువైన శుక్రాచార్యులవారికి సన్నిహితుడను. శివసుబ్రహ్మణ్యుడు నీతో పోరు సలుపనెంచి సిద్ధముగానున్నాడు! అని వార్త నందించి వెడలెను.

ఈలోగా రాక్షసవేగులు కొందరు పరుగులిడుచూ తమ నాయకుని చేరి, "అసురేంద్రా! మన వీరమహేంద్రపురికి ఉత్తరద్వారమున కావల శివకుమారుడు తన సేనావాహినితో విడిదిచేసి యున్నాడు. అక్కడ యిప్పుడు అతి రమణీయమైన నగరమేర్పడియున్న"దని చెప్పిరి. యుద్ధ

వార్తను వినగానే శూరపద్మాసురునికి ఆవేశము కట్టలు త్రెంచుకొనినవి. "ఎవరక్కడ?" అని ద్వారపాలకులను పిలువగా, వారు వచ్చి, నమస్కరించి తన ముందు నిలబడిరి. "మీరు భానుకోపుని పిలుచుకొని వెంటనేరండు!" అని ఆజ్ఞాపించెను. వారు భానుకోపుని కడకేగి వర్తమానమందించిరి. భానుకోపుడు తండ్రిని సమీపించి, అతని పాదములకు నమస్కరించి నిలబడగా "భానుకోపా ఆ పసివాడు భూతగణాలతో నన్నెదిరించి యుద్ధము చేయవచ్చినా''డనెను.

"తండ్రీ! అనుజ్ఞనిండు! ఇప్పుడే బయల్దేరి వానినీ, వాని గణ సమూహమునూ చీల్చి చెండాడి విజయముతో తిరిగి వత్తు" ననెను. శూరుడు తనయుని శిరము మూర్కొని వానిని దీవించి సంగరమునకు పంపెను.

తండ్రి దీవెనలనందుకొనిన భానుకోపుడు నేరుగా తన అంతఃపురమునకు పోయెను. కవచమునూ, శిరస్త్రాణమునూ, దివ్యాయుధములను దాల్చి తేరెక్కెను. భానుకోపుని వెంట అసురగణము రణరంగమునకు వెడలినది. యుద్ధ భేరులు మ్రోగినవి. మిగుల ఆర్భాటముగా షణ్ముఖస్వామి సేనలవైపు భానుకోపుని సైన్యము నడచినది.

ఇరుపక్షములు మోహరించగా దేవసేనాపతియైన శివకుమారుడు వీరబాహుని పిలిచి, "వీరబాహు! నీవు తగు సైన్యముతో భానుకోపుని సేనలను దునుమాడి విజయుడవైర"మ్మని పొదలనిలచెను. వీరబాహు శిరసావహించి కొంత సైన్యమును వెంటబెట్టుకొని భానుకోపుని సేనల నెదుర్కొనెను. భానుకోపుని సేనాధిపతియైన అనఘాసురునితో యుద్ధం మొదలిడెను. తర్వాత భూతగణ సేనాధిపతియైన సింహుడు అనఘాసురునితో తలపడెను. వేలకొలది రాక్షసులు భూతగణములచేత చచ్చిరి సింహునికీ అనఘునికీ కడు భీకరమైన పోరు జరిగెను. రాక్షసులు పెక్కు మంది చచ్చుటను జూచి యినుమడించిన ప్రోత్సాహముతో భూతగణములు పోరాడ సాగినవి.

## అజముఖాసురుని వధ

పెక్కు శరాఘాతములు, గదా ప్రహరములతో ఒకరినొకరు బాధించుచుండిరి. అజముఖాసురునితో సింహుడు యుద్ధముచేయసాగెను సింహుని ఆయుధములు తరిగెను. అప్పుడు తన యొద్ద విష్ణువుయొక్క చక్రాయుధము కలదని జ్ఞప్తికి తెచ్చుకొన్న అజముఖాసురుడు దానిని ప్రయోగించెను. అది జ్వాలాచక్రమై రాగా ఆయుధములు లేని వానిని చంపుటకు ఇష్టపడక మరలా ప్రయోగించిన అజముఖాసురుని వైపు తిరోన్ముఖమై వాని మెడను గాయపఱచినది. ఆయుధములు లేనివానిపై ప్రయోగింపబడు దేవతాశక్తులన్నియూ తిరుగుముఖమగునని యిందు మూలముగా మనము గ్రహింపనగును. అలాగే ప్రయోగము చేయువారు తాము శక్తిసమన్వితులమనే అహంకారముతో తమ శక్తులను నిరాయుధులపై, అమాయకులపై ప్రయోగించినపుడు అవి త్రిప్పికొట్టునని తెలియుచున్నది. కొందరు మాంత్రిక పరమైన ప్రయోగములను అమాయకులపై ధనాశతో పంపినప్పుడు ఆ శక్తులు వారిని చేరినట్లేచేరి వారి నిర్మలమైన ఆత్మలను బాధింప నిచ్చగించక మరలా పంపిన వారినే తాకుటను మనము ఈ సంఘటనతో గ్రహించవలయును. For every action there will be equal reaction అను సిద్ధాంతము యిక్కడ అన్వయించుచున్నది.

చక్రాయుధము అజముఖుని శిరస్సును ఖండించగా మాయావియైన వారు చచ్చెను. ఇది చూచిన దేవతాసమూహము జయజయ ధ్వానములు పలుకగా రాక్షసులు హాహాకారము చేయుచూ పరుగెత్తిరి. ఇది జూచి భానుకోపుడు వీరావేశముతో శరపరంపరలతో భూతగణములను గాయపఱచెను. భూతగణములు భానుకోపుని తాకిడికి తల్లడిల్లుచుండిరి. ఇది జూచిన ఉగ్రుడనే భూతనాయకుడు సార్థక నామధేయుడై పరుగిడి, భానుకోపుని రథమునకు పూన్చిన గుఱ్ఱములను దండాయుధముతో మోదగా అవి చచ్చినవి అంతియేగాక రథమును నుగ్గునుగ్గు చేసెను. వెంటనే భానుకోపుడు మరొక్క తేజోవంతమైన తేరునెక్కి యుద్ధము చేయదొడంగెను.

ఈ యుద్ధ వివరములు మూలగ్రంథమందు వర్ణనలతో కడు రమ్యముగా వివరింపబడియున్నవి గ్రంద విస్తరణము కారాదనిభావించి సారమంతయూ కొలది వివరములతోనే కుదించి వ్రాయడమైనది. వేద వ్యాసుని సంస్కృత పారాంతరముగా తమిళములో కశ్యప శివాచార్యుల వారు యీ యుద్ధకాండను పాటలతో వివరించియున్నారు. పాఠకులకు మూలమంతయూ నందించలేకపోవుచున్నాను. ఈ గ్రంథము యొక్క పేరు ముందుగానే పాఠకులు చూచినారుకదా! "శ్రీ స్కాంద పురాణ సారామృతము" అని పేరిడి వ్రాయబడిన యీ చిరుపాత్రములో అమృత బిందువుల వంటి కథాసారమునే అందించుటకు ప్రయత్నించడమైనది శ్రీ సుబ్రమణ్యస్వామి దివ్యక్షేత్రములలో కడుమహిమాన్వితమైన వల్లీ తపోపీఠమగు 'వల్లిమల'లో శ్రీవారి సన్నిధిలో, వారి కృపాకటాక్షములతో కొన్ని దినములుండి పూర్తిచేయబడు గ్రంథమిది. కావున పాఠకులు గ్రందసారమును అమృత ప్రాయముగా గ్రహించి, స్వామి కృపకు పాత్రులవ్వోదరని ప్రార్థించువాడను. వేదవ్యాసులవారు పదునెనిమిది పురాణములను వ్రాసిరి. శ్రీ స్కాందపురాణమును కాళిదాసు 'కుమార సంభవము' అనే పేరుతో సంస్కృతములో వ్రాసెను. తమిళ మందు 'కందపురాణ'మని వ్రాయబడినది. తెలుగులో ఈ గ్రంథము వచనముగా వేరెవ్వరైనా వ్రాసియున్నారేమో నాకు తెలియదు. నన్నెచోడుడు పద్య కావ్యముగా నందించెను. ఈ నాటి పాఠకులకు వచనము చదువుటకే ఆసక్తియని భావించి పండితులకేగాక పామరులకు కూడా తెలిసేలా సులభశైలిలో వ్రాయనెంచినాను. గ్రాంథికముగా వ్రాయుటకే నాకు సులభమని తోచిననూ, అన్ని తరగతుల పాఠకులకు అర్ధమయ్యే శైలిలో వ్రాయుటకు శ్రమపడవలసి వచ్చినది నేను పండితుడనుకాను. ఈ చిరుపాత్రము నకుగాను గత ఆరు సంవత్సరములుగా అనేకమైన మూల ములను వెతకుటకు చాలిన సమయము లేకపోయినది ఈలోగా చిన్ని చిన్ని పుస్తకములుగా వెలువడిన నా రచనలు : "గురువు ఎవరు?" (ముద్రణవ్యయ కర్త : శ్రీ దోర్నాదుల చిన్న వరదరాజాల శ్రేష్ఠి గారు, నగరి), "ప్రదోషపూజామహిమ" (కృత్రిమ వ్యయ కర్త : శ్రీ మద్రిపల్లె రామచందర్ గారు, మద్రాసు-26); "సంకష్టహర చతుర్థీ వ్రత పూజ" ముద్రాపక వ్యయ భర్త ; శ్రీ చిదానందం గారు, పుంగనూరు) మరో

చిన్న పొత్తము శ్రీ దత్తాత్రేయులవారి కృపతో వ్రాయగలిగినాను. అది శ్రీ దత్తగురుకృప" ఇలా మరెన్నో వెలుగుకు తేవలసియున్నవి. దాతలు. ముందుకువచ్చి ప్రోత్సహించినయెడల వెలుగుకువచ్చు వాటితోపాటు నాజన్మ కూడా భగవత్ప్రీతిపాత్ర మగునని నా ప్రగాఢ విశ్వాసము ఇక్కడ వేదవ్యాసులవారి గురించి ఒక్క విషయం మాత్రమే ముచ్చటించి కథాక్రమమునకు సాగుటకు మీ అనుమతి వేడుచున్నాను.

ఒక సమయమున శ్రీ వేదవ్యాసభగవానులు శ్రీ మన్నారాయణుని మాత్రమే ధ్యానించి, తన చేతులను శిరోపరితలముపై నుంచెనట. తర్వాత తన కరములను క్రిందికి దించుటకు ఎంత ప్రయత్నించిననూ సాధ్యము కాలేదట. అప్పుడు లక్ష్మీపతి వ్యాసులవారికి దర్శనమిచ్చి, "వ్యాసా! నీవు హరిహర భేదము పాటించి, నన్ను వేరుగా దలంచి, నన్ను మాత్రమే స్తుతించి ధ్యానము చేసితివి. ఈశ్వరుని దలంపని కారణమున నీ చేతులను క్రిందకు దింపనైతి"వని పలుకుచూ యింకనూ యిలా చెప్పెనట :

యజ్ఞ కర్తాచ దేవేంద్రః<br>
వేద కర్తాచ వాక్పతిః<br>
అహం సర్వ జగత్కర్తా<br>
మమ కర్తా మహేశ్వరః

తాత్పర్యము : యజ్ఞములకు కర్త దేవేంద్రుడు, వేదములకు సంచాలకుడు బ్రహ్మదేవుడు, నేను అన్ని లోకములకు కర్తనగుచున్నాను. కానీ, నాకు మహేశ్వరుడు కర్తయని యెఱుంగుము.

దీనినిబట్టి మనము తెలిసికొనవలసనది ఏమనగా-అద్వైత సిద్ధాంతమందు శ్రీ శంకర భగవత్పాదులవారు బోధించినట్లు నారాయణుడూ-పరమేశ్వరుడూ వేరుకాదు. హరిహర భేదము నెంచినచో వేదవ్యాసులవారికి పట్టిన గతియే మనకు పట్టునది గ్రహించి-ఏ దేవతా మూర్తియై

ననూ చిచ్ఛక్తి స్వరూపమనిభావించి తమ కిష్టమైన రూపములో భగ వంతుని ధ్యానించి కృతార్థులము కావలెను. "నదీనాం సాగరం గతిః" అన్నట్లు ఏనదిలో మునిగిననూ సిరొక్కటే-నదులన్నీ సముద్రములో గలియును-సముద్రమే కరుణాసముద్రమైన భగవంతుడగుచున్నాడు.

పై జెప్పిన శ్లోకము వ్యాసులవారే రచియించిన శ్రీ స్కాంద పురాణము నందు కాంచీపురమాహాత్మ్య మందు జెప్పబడినది. శ్రీకాళ హస్తి మాహాత్మ్య మందు మరొకథ చెప్పపడినది. ఒక సమయము విష్ణుసంభూతుడైన శ్రీ రామచంద్రమూర్తి శ్రీకాళహస్తిలో శివునుద్దేశించి ధ్యానించగా శివ ప్రతిరూపమైన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు ప్రత్యక్షమై వరములిచ్చెనట. ఇలా చెప్పుకుంటూపోతే కథాక్రమము కుంటుపడి పోతుంది. కనక అసలు కథలోనికి వచ్చెదము.

భానుకోపుడు పెక్కు బాణములను ప్రయోగించి భూతగణము లను విగత జీవులను చేసెను. ఈసారి రాక్షస సైన్యము జయజయ ధ్వానములు చేయగా, భూతగణముల శరీరములనుండి రక్తపుటేరులు ప్రవహించినవి. ఇది జూచిన వీరబాహువు తన తేరును రాక్షస సైన్యము లోనికి చొచ్చుకొనుచూ గొంపోయెను. బాణపరంపరలతో రాక్షససైన్యము మతిపిత్త చిందరవందరగా తొక్కిసలాడునట్లు చేసెను. భానుకోపుడది గమనించి, "ఓయీ! దూతగావచ్చిననీవు రాక్షస వీరులను చాలామందిని చంపి యున్నావు నీవిప్పుడు నాచేజిక్కినావు! ఇక నీ ప్రాణములు నీవి కావని తెలిసికొనుము!" అని ప్రగల్భము పలికెను.

వీరబాహుడు భానుకోపుని జూచి, "ఓరీ! వ్యర్థ ప్రలాపీ! యుద్ధ రంగమందు మాటలకు తావులేదని తెలియని మూర్ఖుడవు! జయాప జయములు దైవాధీనములని తెలియకున్నావు! వృథా ప్రసంగములు మాని నీ ప్రతాపమేదో చూపుము" అని నిశితమైన దివ్యాస్త్రములను వరుసగా వానిపై ప్రయోగించెను. భానుకోపుడు కూడా సమవుజ్జీయై తనకు తెలిసిన అస్త్రములను వీరబాహుపై ప్రయోగించెను. అవన్నియూ వ్యర్థమాయెను.

# భానుకోపుని వధ

తన యుద్ధ నైపుణ్యమునకు దేవతలే వెఱచుచుండగా యీ వీర బాహువు నేమీచేయలేక పోవుచున్నానని భానుకోపుడు వ్యధ చెందెను. వెంటనే తేరుకొని మాయాయుద్ధము చేయుదొడంగెను. వీరబాహువును సుడిగాలితో మరుగునవుండి శరాఘాతములతో శరీరమంతయూ రక్త స్రావమగునట్లు చేసెను.

వీరబాహు భానుకోపుని మాయను పోగొట్ట శ్రీ సుబ్రహ్మణ్యుని మదిలో స్మరించి, దివ్యాస్త్రములతో పటాపంచలుజేసెను. వాని వునికిని కనుగొని ప్రత్యక్ష సమరము సాగించెను ఘోర యుద్ధము సాగినది, చివరికి వీరబాహు తన 'శక్తి' ఆయుధమును భానుకోపునిపై విసరెను. అది భానుకోపుని రెండు చేతులను నరికివేసినది. ఆ తర్వాత వాని శిరస్సును ఖండించి ఎగురగొట్టినది. భానుకోపుడు మరణించినది చూడ గానే దేవసమూహములో ఆనందము వెల్లివిరిసినది. వీరబాహుని చుట్టు ముట్టిరి. పూలజల్లు ఆతనిపై కురిసినది. రాక్షసులు తమ యువరాజు గతిని తలంచి ఏడ్చి, పెడబొబ్బలు పెట్టుచూ పరుగెత్తిరి. యుద్ధము అంతటితో అప్పటికి ముగిసినది

వీరబాహు దేవతాగణములతోనూ, భూత సైన్యములతోనూ హేమ కూటమునకు మరలివచ్చెను. షణ్ముఖుడు వీరబాహునిజూచి "వీర బాహూ నీ విజయము నాకు పరమ సంతోషకరమైనది. ఏమి వరము కావలెనో కోరుకొ"మ్మనెను.

వీరబాహు సవినయముగా దండ ప్రణామములు అర్పించి; 'దేవా నీ కృపాదృష్టి ఎల్లప్పుడూ నాయందుండిన చాలును. నీ సేవలో నేను అదమరువక సదా నీ ధ్యానమందే యుండునట్లు అనుగ్రహింపు'మనెను

ఈ ఘట్టము చదివినా, వినినా భక్తులకు సకలసౌఖ్యములొన గూరునని కశ్యప శివాచార్యులవారు తెలిపియున్నారు.

# సింహముఖాసురుడు
## (అరవదిన యుద్ధము)
## శూరపద్మాసురుని శోకము

భానుకోపుని మరణవార్త చెవిలో పడగానే శూరుడు మిగుల శోకించెను. కుమారుని వీరసాహసకృత్యములన్నింటినీ జ్ఞప్తికి దెచ్చుకొని పరిపరివిధముల విలపించెను. కొంత తడవు విషాదములో మునిగిన శూరుడు తేరుకొని లేచెను. సింహముఖాసురునికి భానుకోపుని మరణ వార్తను తెలుపుచూ వెంటనే అతనిని పిలుచుకొనిరమ్మని తన భటులను పురమాయించెను. భానుకోపుని పునరుజ్జీవుని చేయనెంచెను. వాని శవమును భద్రపఱచమని తన భటులను పంపెను. దూతలు తెచ్చిన వార్త సింహముఖాసురుని చేరగానే కోపావేశముతో కడలి తరంగముల వలె వుప్పొంగుచున్న లేచెను. చతురంగ సైన్యములను వెంటబెట్టుకొని వీర మహేంద్రపురిని చేరెను. ఆకాశ మార్గాన వచ్చిన సింహముఖాసురుడు శూరుని చూడగానే నమస్కరించెను. తమ్మునితో జరిగినదంతయూ శూరుడు వివరముగా చెప్పెను.

"తమ్ముడా! నీవిప్పుడే మన శత్రుస్థావరానికి వెళ్ళి వారిని తుద ముట్టించి విజయుడవైరమ్ము! అందుకోసమే దూతలను పంపి నిన్ను రప్పించాను" అని శూరుడు సింహముఖునితో చెప్పెను.

అన్నా! చూడునా ప్రతాపాన్ని! బానుకోపుని చంపిన వారెవ్వరైనా సరే, వారిని తప్పక చంపివత్తు" నని సింహముఖుడు పలికి వీడ్కోలు పొందెను. తన చతురంగబలములను వీరమహేంద్రపురిలోనే యుంచ నిచ్చి, తన నగరమునకు మరలివచ్చి రక్తమాంసాదులను విస్తారముగా కడుపునిండా తినెను. వస్త్రభూషణాదుల నలంకరించుకొనెను. మహేశ్వ రుని వరంవల్ల పొందిన శూలము, దండము, చక్రము, వజ్రాయుధము మొదలగువానితో బాటు పెక్కుదివ్యాస్త్రములనూ, మాయా పాశమును తీసికొని రణరంగస్థలికి బయల్దేరెను. అక్కడ సిద్ధముగా నుండు తన

సేనావాహిని వెంటబెట్టుకొని, వీరఘోషములు ఆకాశమునంటగా రణ రంగమును చేరెను. దారిలో అనేకమైన దుశ్శకునములు కన్పించెను. అయిననూ మృత్యుదేవత ఆహ్వానించు నపుడు దుశ్శకునము లను లక్ష్యము చేయుసదెవ్వరు?

సింహముఖాసురుడు యుద్ధసన్నాహముతో రణస్థలిని చేరువార్తను ముందుగానే దేవతలు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర నికి తెలిపిరి. సింహముఖా సురుని గురించి అన్ని వివరములు తెలిపినారు.

"దేవా! మహాపాపియైన ఈ సింహముఖాసురుని చంపు మమ్ము లను కాపాడవలయు"నని శివబాలుని దేవతలు ప్రార్థించిరి. "అంతటి వాడా ఈ సింహముఖాసురుడు? వానిని చంపుట తక్షణమే నాలక్ష్యముగా నెంచి బయల్దేరమందురా?" అని వారిని అడిగెను.

వీరబాహుతేచి, "మహాప్రభూ! నాకు అనుజ్ఞయిచ్చి ఆశీర్వదించి పంపుడు! వాడెంత భీకరుడైనాసరే అమోఘమైన మీ ఆశీర్వాదబలముతో వానిని యమలోకమునకు పంపి వచ్చెద"ననెను. దేవసేనాపతి 'వల్లె యనగానే లక్షాయెనిమిది వీరులతోను, సైన్యాధ్యక్షులతోనూ, భూతగణ ములతోను వీరబాహు సింహముఖాసురుని యెదిరించ రణరంగమున కేగెను. వీరబాహుతో కలిపి లక్షాతొమ్మిది మంది వీరులగుదురు. ఇరు పక్షములున్నూ ఒకరినొకరు తలపడిరి. కడు భీకరమైన యుద్ధము సాగినది.

## సింహాముఖాసురుని పుత్రుల వధ

రాక్షస సైన్యము చాలావఱకు నశించిపోవుచున్నది. ఇది గమ నించిన సింహముఖుడు తానే యుద్ధము చేయదొడగెను. వీని ధాటికి తట్టుకొనలేక భూతగణములు చాలావఱకు తరిగినవి. దేవవీరులైన అగ్ని కోపుడు, దండి అనేవారు తమ అనుచరులతో రాక్షసులపై దండెత్తిరి. భూతగణములు నశించుట జూచిన దేవతలు భయవిహ్వలులైరి. అగ్ని

కోపుడు దండి మొదలగు దేవవీరులు సింహముఖునిపై అనేకమైన శర ములను ప్రయోగించిరి వికటాట్టహాసము చేయుచూ భూతగణములు భయపడి పారిపోవునట్లు సింహముఖుడు భీకర యుద్ధము చేసెను. దేవవీరులనెగురగొట్టెను.

ఇది గమనించిన వీరబాహు వీరావేశముతో లెక్కలేని రాక్షస సమూహమును తన శరపరంపరలతో కూలద్రోసెను. రక్తపుటేరులెల్ల డను ప్రవహించినది. ఇది జూచిన సింహముఖాసురుని కుమారులు యుద్ధము చేయవచ్చిరి. వారు దివ్యాస్త్రములనెన్నింటినో దేవసైన్యముపై ప్రయోగించిరి. ఏమాత్రము ఆలసట చెందక వీరబాహు వారితో పోరు సలుపసాగెను. బాణములతో యుద్ధము చేయుటమాని కత్తియుద్ధము చేయదొడగిరి. వీరబాహువు చేతిలో ఎంతోమంది రాక్షసులు విగతజీవులైరి. సింహముఖుని నూరుమంది పుత్రులను ఒకే దివాస్త్రముతో కూలద్రోసెను ఇది గమనించి "నువ్వెరవు?" అని సింహముఖుడు గద్దించెను.

నేను శివకుమారుని భక్తులలో నొకడిని! నీ అన్న శూరపద్ముని కడ దూతగా వచ్చినపుడే శ్రీవారి అనుగ్రహమును వీరమహేంద్రపురిని ధ్వంస మొనరించి మీ రాక్షస ప్రముఖులనెందరినో సంహరించిన వీర బాహుడను అని సింహముఖునితో జెప్పెను

"ఓహో! దూతవా! నా అన్న కుమారుడైన భానకోపునీ, యిప్పుడు పసివారైన నా నూర్గురు పుత్రులను చంపినందువల్ల ఘనుడవని యెంచి అహంకరించుచుంటివా? ఇప్పుడు నాతో తలపడుము! నిన్నూ-నీ శివ బాలునీ ఉక్కిరిబిక్కిరి చేసెద"నని ప్రగల్భములు పలుకూచూ సింహ నాదమొనరించెను. ఈ సింహనాదమునకే దేవతా సమూహము బెదరి పారిపోవుచుండిరి. ఇట్లు ద్వంద్వయుద్ధము చేయుచున్న తరుణంలో వీరబాహువు అస్త్రశస్త్రగదాదండములతో రాక్షస సైన్యమును దునుమా డుచూ, సింహముఖునితో భీకర యుద్ధము చేయుగా, వాని శక్తి సన్న గిల్లుచుండుటను వీరబాహు గమనించెను. సింహముఖుని అయుధ ప్రయోగములన్నింటిని-వీరబాహుడు ఉపసంహరించెను.

కోపోద్దీప్తుడైన సింహముఖుడు తన యొద్దగల మాయాపాశమును దేవసైన్యముపై ప్రయోగించెను. దానిని ప్రయోగించినపుడు జపించిన మంత్రప్రభావము దేవసైన్యమును నిర్వీర్యము చేసినది.

హేమకూటమందుగల దేవసేనాపతియైన కుమారస్వామినీ-అతని వెంటగల దేవతా సమూహాన్ని ఆ మాయాపాశము ఏమియున్నూ చేయ లేక పోయినది. కానీ వీరబాహువు వెంట సమర ప్రాంగణమున నిలిచి పోరు సలిపిన దేవసైన్యము మాత్రము మాయాపాశమునకు బందీలై యుద్ధము చేయలేకపోయినారు.

అప్పుడు సింహముఖాసురుడు కార్తికేయునితో తలపడనెంచెను. ద్విగుణీకృత ఉత్సాహభరితులైన రాక్షస సేనావాహినిని వెంటబెట్టుకొని హేమకూటమునకే వెడలెను. వాయుదేవుడీ వివరములను సుబ్రహ్మణ్యునికి ముందుగా తెలిపెను. వెంటనే దివ్యాసనమునుండి షణ్ముఖుడు లేచివచ్చి దివ్యరథమునెక్కెను. తనవెంటయుండగల దేవసైన్యముతో హేమకూటనగరముదాటి, యుద్ధభూమిలో తనకు అభిముఖముగా వచ్చుచున్న సింహముఖాసురునితో సమరముసేయ తనతేరును పోనిచ్చెను.

## భూతగణములను సింహముఖుడు మ్రింగివేయుట

భూతగణములు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడే యుద్ధరంగమున ప్రవేశించుటతో ఇనుమడించిన వీరావేశముతో బండలతోనూ, రాళ్ళతోనూ, బిరిశెలతోనూ, పరిసూయుధములతోనూ రాక్షసుల దునుమాడసాగిరి. రాక్షససేనావాహిని నశించిపోవుటను గాంచిన సింహముఖుడు భూతగణాధిపులను మ్రింగివేయసాగెను. దివ్యరథమునెక్కి దూరమునుండి గణేశ సోదరుడగు శివకుమారుడు జరుగుచున్నదంతయూ గమనించుచుండెను అలాగే శూరపద్ముడు తన అంతఃపురసౌధాగ్రమున నిలిచి యుద్ధమును చూడసాగెను. వేగులు అప్పుడప్పుడు యుద్ధవిశేషములను శూరునికి తెలుపుచుండిరి.

దేవసేనాపతి సింహముఖునితో యుద్ధము చేయసాగెను. ఒక దివ్యాస్త్రముతో సింహముఖుని రొమ్మునుచీల్చెను. రక్తము విపరీతముగా స్రవించుచుండిననూ సింహముఖుడు ఒకగదను తీసుకొని సుబ్రహ్మణ్యునిపై విసరెను దానిని నాలుగు బాణములు ప్రయోగించి పిండి చేసెను. ఆ బాణములే గదా ప్రయోగమును తుత్తునియలు చేసిన

పిమ్మట సింహముఖుని నుదుట వేగముగా తాకినవి శరాఘాతముల తాకిడికి వాడు తల్లడిల్లెను. రొమ్ము నండి రక్తము స్రవించుచుండినది కడుపులో నుండిన భూతగణములు పొట్టనుచీల్చుకొని బయటకువచ్చిరి

అప్పుడు షణ్ముఖుడు మాయాపాశాప్రయోగమును విచ్ఛిన్నము చేయగా వీరబాహువు మొదలుకొని యావన్మంది భూత గణములు మూర్ఛనుండి తేరుకొనిరి. అందరూ కలసివచ్చి దండపాణి మ్రోల నిల బడి నమస్కరించిరి. రణరంగమంతా కుప్పలుకుప్పలుగా పడియున్న సైనిక కళేబరములతోనూ, రక్తపుటేరులతోనూ నిండిపోయినది. తలలు వేరయిన మొండెములు ఎక్కడచూచినా పడియున్నవి. గ్రద్దలు,నక్కలు కాకులు వీనిని పొడిచి తినుటకు వచ్చినవి. సింహముఖుడు మూర్ఛ నుండి తెప్పరిల్లి, తన శరీరమంతయూ రక్తసిక్తమైయుండుటను గాంచెను కలత చెందిన హృదయముతో లేచినిలబడెను. క్రోధావేశముతో శక్తి బాలునిపై నిశితమైన బాణములను ప్రయోగించెను.

## సింహముఖ వధ

సింహముఖుని బాణములన్నిటినీ వేలాయుధుడు ఉపసంహ రించెను. సింహముఖునిపై తాను దివ్యాస్త్రములను పంపెను. తద్వారా వాని రథముగూలెను సారధి చచ్చెను. ఇది చూచిన సింహముఖుడు శూలాయుధమును ప్రయోగించెను. తన బాణములను శూలాయుధము పై పంపి దానిని తుత్తునియలుచేసెను పినాకపాణి కుమారుడు బాలు డయ్యు కొండంత శరీరముగల రాక్షసవీరుడయిన సింహముఖుని కాళ్లను చేతులను బాణములను పంపి తెగవేసెను. అయిననూ వానికాళ్ళూ చేతులూ మరలా మొలవగానే, దేవతలదిజూచి దిగ్భ్రాంతి చెందిరి

"పసివాడవని నిన్ను నేను చంపకున్నాను. శివ వరబలముచే నాకు వృద్ధాప్యమురాదు. అంగహీనత కలుగదు ఇప్పటికే నీవెంట వచ్చిన నా అన్న బానిసలైన దేవతలు నా అంగములన్నీ మరలామరలా మొలుచు చుండుటను జూచి విస్మయమొందుచున్నారు! వారిని నీవు కాపాడలేవు" అని శివసుబ్రహ్మణ్యునితో గంభీరముగా సింహముఖుడు పలికెను. ఉమాసుతుడు వానిని జూచి, "ఓరీ! వ్యర్థప్రసంగములు మానుము! నీ శౌర్యమెంతో చూచెదను. బాలుడని పరిహసించుచున్నావు! నీవెంత మూర్ఖుడివో నీ మాటలనుండి తెలియుచున్నది! రమ్ము! నాతోపోరాడుము నీ అంత్యకాలమెంతోదవ్వునలే"దని సింహనాదము చేసెను.

సింహముఖాసురుడు దివ్యాస్త్రములనెన్ని గిరిజాసుతునిపైబంపెను వాటిని తన బాణములతో నుగ్గునుగ్గు జేసెను. మార్గమధ్యమమున తన బాణములనన్నింటిని తుత్తునియలు చేయుచున్న యీబాలుడు సామాన్యుడు కాడని సింహముఖుడు గ్రహించెను.

సింహముఖుని అంగములను, శిరమును మరలా ఖండించగా అవి తక్షణమె మొలుచుచుండినవి ఇదిచూచి "మొలవకుము!" అని సింహముఖుని అంగములను ఆజ్ఞాపించెను. ఒకతల, చేతులు మాత్రము వాని శరీరమందు నిలిచియుండినవి. అప్పుడు తన వజ్రాయుధమును వానిపై ప్రయోగింప, అదివాని దండప్రయోగమును మార్గమధ్యమందు చెల్లాచెదురుచేసిన పిమ్మట వానిరొమ్మును చీల్చివేయుచూ వీపునుండి వెలుపలికి వచ్చి, మరలాతనను ప్రయోగించిన శివకుమారుని చేతిలో వచ్చి నిలిచినది. సింహముఖాసురుడు ప్రాణములుగోల్పోయి నేలగూలెను వాని కళేబరము క్రిందపడగానే దేవతలు శక్తి కుమారునిపై పూలవా. గురియించిరి. బాలసుబ్రహ్మణ్యుని కీర్తించిరి. రాక్షసులు భయపడి పారిపోయిరి.

తదుపరి దేవతాగణములను తోడ్కొని షణ్ముఖుడు హేమకూటమును చేరెను. విజయోత్సాహముతో అందరూ తమతమ మందిరములను చేరి విశ్రమించిరి.

## శూరపద్మాసుర సంహారము

(ఏడవదినము నుండి పదవదినము వరకు జరిగిన యుద్ధము)

శూరపద్ముడు తన అంతఃపుర గోపుర శిఖరమున నిలబడి యుద్ధవార్తలను తెలిసికొనుచుండెను. సింహముఖాసురుని వీరోచితమైన, సాహసోపేతమైన యుద్ధనైపుణ్యమును గురించి దూతలు ముందుగా తెలిపినపుడు సంతసించుచుండెను. వాని మరణము గురించి చెప్పగా నలవిగాని శోకసముద్రమున మునిగి బహువిధముల విలపించెను. తన పుత్రులూ, తమ్ములూ కోల్పోయిన విజయావకాశములను గురించి తలంచుచూ మిగుల దుఃఖభారమును అనుభవించెను.

కొంతసేపటికి పూరడిల్లి ఈ సింహముఖుడు చచ్చినంత మాత్రాన యిక రాక్షసవీరులు లేరని నేనెందుకు కలతచెందవలెను? నా ఆధీనము లోని వెయ్యిన్నీయెనిమిది అండములను రక్షించు రాక్షసప్రముఖులం

నరినీ పిలిపించెను. వారిని యెదుర్కొనలేక ఆ బుడతడు వచ్చినదారిని పట్టి పారిపోకపోతే, నా రాక్షస వీరుల శౌర్యమేమగును? వెంటనే అన్ని అండములనుండి రాక్షస వీరులందరినీ పిలిపించెద! అంతిమ విజయము నాదే!" అని తనలో తానే గొణుగుకొనెను. తక్షణమే సకల భువనములకు దూతలను పంపెను వారు రాక్షసప్రభువు ఆజ్ఞను పాటించి సకల లోకములలోని రాక్షస ప్రతినిధులను, వారి సేనావాహినులతో కడలి తరంగములవలె వుప్వెత్తున లేచిరాగా వారితో వీరమహేంద్రపురిని చేరిరి.

శూరుడు దివ్యవస్త్రాభరణములను ధరించెను. అశేషమైన దివ్యాస్త్రములతో అద్భుత లావణ్య శోభితమైన తేరునెక్కెను. జాతి అశ్వములను కట్టిన అతేరును సారథి నడపెను. రాక్షస సేనావాహినులు వెంటరాగా శూరపద్మాశురుడు యుద్ధభూమిని చేరెను. శూరపద్మని రాకతో దేవతలలో కలకలము బయల్దేరెను. వానినిజూచి మిక్కిలి భయపడిరి ఇంతవరకూ జరిగిన యుద్ధమొకయెత్తు! ఇప్పుడు వరబలగర్వితుడయిన శూరపద్మాసురునితో సంగరము సేయుట, మరి వూహించలేని పరిస్థితి యని దేవతలందరూ భీతిల్లిరి. వెంటనే హేమకూటమందలి శరవణ భవుని మందిరములోనికి పరుగిడిరి. భవపుత్రుడు వారినిజూచి "ఏమైనది?" అని అడిగెను. "దేవసేనాపతీ! జయభేరుల ఘోషతో కడలి తరంగములవలె అశేషమైన సేనావాహినులతోనూ, సేనాధిపతులతోనూ విలువకట్టలేని వస్త్రాభరణములను ధరించి, పరమేశ్వరుని వరముతో పొందిన రమ్యాతి రమ్యమైన రథమును అధివసించి శూరపద్మాసురుడు రణరంగమున ప్రవేశించినాడు. వాడురాగానే మన హేమకూట ప్రాకారములను తన సైన్యముతో భీభత్సమొనరించి వికటట్టహాసములు చేయుచున్నాడు. వానిబారినుండి తాము రక్షించవలయును! జాగుసేయక వానిని హతమార్చి మమ్ములను కాపాడవలయును" అని వేడుకొనిరి.

తక్షణమే వాయుదేవునిజూని "వాయుదేవా! తేరుని సిద్ధముచేయు" మని స్కందుడు పలికెను.

## శూరునితో స్కందుని యుద్ధారంభము

గాంగేయుడు తనతో శూలము, గద, వజ్రాయుధము, తొమరము కత్తి, డాలు మొదలగు అస్త్రశస్త్రాదులనెన్నో తీసుకొని వాయుదేవుడు సిద్ధముచేసిన రథమునెక్కెను. పరశువు (గొడ్డలి), శత్రువుల ఆయుధ

ములను తాకగానే తమవెంట తీసుకొనివచ్చి తన చెంతకు తేగల అతి శక్తివంతమైన బాణములనెన్నింటినో రథముపై నుంచుకొని, రణరంగ మునకు బయల్దేరెను. దేవతలు విజయఘోషములు చేసిరి తూర్యాది రణబేరులు మ్రోగినవి. దేవతా సమూహముతోబాటు భూతగణము లన్నియూ సమరోత్సాహముతో షణ్ముఖుని ననుసరించిరి. వీరిలో లక్ష తొమ్మిది వీరులున్నూ, రెండువేల సేనావాహినులైన భూతగణములు కలరు. వీరిని దీవించి దేవతలు సాగనంపగా, దేవ దుందుభులు మ్రోగినవి.

అనేకవేల రాక్షసవీరులను జూచిన దేవసైన్యము వారిని దునుమాడ పూనుకొనినవి. కానీ రాక్షసులదే పైచేయిగా నుండినది. ఇది గమ నించిన వీరాబాహువు రాక్షసులలో పెక్కువీరులను అస్త్రశస్త్రములతో హతులను గావించెను.

ఇట్టి తరుణంలో రాక్షసులు దేవసేనాపతియైన షణ్ముఖుని ఒక్కుమ్మ డిగా చుట్టుముట్టిరి. చక్ర, తోమర, శూల, శర, పరశువు, గదాది ఆయుధముల నెన్నింటినో సుబ్రహ్మణ్యునిపై ప్రయోగించిరి. వీటి నన్నింటినీ ఒకే త్రుటిలో త్రిప్పికొట్టుటయేగాక వానిని తనమీద ప్రయో గించిన య్భావన్మంది రాక్షసవీరులను ఒకే కాలములో సుబ్రహ్మణ్యుడు చంపివేసెను.

## వెయ్యేన్నీ యెనిమిది అండముల నుండి వచ్చిన రాక్షసుల హతమార్చుట

గుహుని పరాక్రమమేమిటో స్వయముగా చవిచూచిన వెయ్యేన్నీ ఎనిమిది అండముల రాక్షసవీరులు హతమయినారు. ఈ అద్భుతాని చూచిన బ్రహ్మాది దేవతలు శివకుమారుని యుద్ధ నైపుణ్యమునకు దిగ్భ్రాంతిచెందిరి. అతనిని వేనోళ్ళ స్తుతించిరి. అచ్చరలు నాట్యమాడిరి. నారద తుంబురులు పాడిరి పూలజల్లు కురిసినది.

శివసుబ్రహ్మణ్యుడు వాయుదేవుని రథసారధిగాజేసికొనినందువల్ల ఎల్లెడలా వ్యాపించగల వాయువు, ప్రచండమైన తుఫానువలె భూమిమీద ఆకాశమందు, నదులందు, సముద్రమందు ఎక్కడ రాక్షసులు కన్పడిన అక్కడ విజృంభించునటుల దేవసేనాపతిని గొంపోయెను. రాక్షసమూక

లనంతటినీ అతిస్వల్పవ్యవధిలో హతమార్చిన వైనముజూచి, "తన చతురంగ సైన్యములను ఈపసివాడా క్షణకాలములో హతమార్చుటయా?" యని శూరపద్మడు అచ్చెరువొందెను. తన రాక్షససైన్యమును కాపాడనెంచి శూరపద్మడు తన రథాన్ని సూటిగా సుబ్రహ్మణ్యుని ముందుకు పోనిచ్చెను. ఇరువురిమధ్య బాణప్రయోగములు చాలాసేపు జరిగినవి. వీరబాహువు మొదలగు నవవీరులు అతి నిశితమైన బాణములను శూరపద్మాసురుని రొమ్మునుగురిచూచి వదలుచుండిరి. ఆబాణములన్నియూ శూరుని ఏమీచేయలేక చెల్లాచెదురై క్రిందపడిపోయినవి భూతగణములు రాక్షస సైన్యముపైపడి భీభత్సమొనర్చించుచుండిరి. శూరపద్మడు వీరబాహుని తనచేతితో మోదగా మూర్ఛిల్లి, తర్వాత తేరుకొని, షణ్ముఖుని ముందునిలిచెను.

కుమారస్వామి శూరపద్మని తరుముకొంటూ అన్ని అండముల లోనూ వానితో కడుభీకరముగా పోరిడసాగెను. ఈవిధముగా సత్యలోకం దిక్పతులలోకములు, మేరుపర్వతము, మహాసముద్రము, విష్ణులోకము మొదలగు అన్నిలోకములకు ఇరువురూ వెళ్ళిరి వీరి భీకరపోరాటమును బ్రహ్మాది దేవతాప్రముఖులు ఆసక్తితో గమనించుచుండిరి తన రాక్షస సేనలను తానుండు అండములోనికి ప్రవేశించుటకు అనువుగా తన బాణములను ప్రయోగించి మార్గమును నిర్మించెను అండములోని అంచులలో మార్గమేర్పడినది గమనించగానే రాక్షససైన్యము ప్రవేశించి షణ్ముఖుని ఒక్కమ్మడిగా దాడిచేయవచ్చిరి వెంటనే విశాఖుడు (శివకుమారుడే) తన దృష్టిని వారిపై సారించగా రాక్షస సైన్యమంతయూ కాలి బూడిద కుప్పలైనవి.

ఇదిచూచిన శూరుడు తీరని మనోవ్యాకులముతో కలతచెందెను. తన సేనావాహినియంతయూ మాడిమసైపోగా, శివకుమారుని దేవసైన్యం భూతగణములు చెక్కుచెదరక భద్రముగా అతని వెంటవచ్చి నిలుచుండిన తీరునిచూచి ఎంతో ఆవేదన చెందెను. వెంటనే తన తల్లియైన మాయాదేవిని ధ్యానించెను:

## మాయాదేవి

మాయాదేవి తన కుమారునియెదుట ప్రత్యక్షమైనది "అమ్మా! నాసేనావాహిని అంతయూ బూడిద కుప్పలైనది, నీవెట్లయిననూ నారాక్షస

సైన్యమును బ్రతికింపు" మనెను. "నాయనా! నా ప్రయత్నముతో నిన్నూ నీసోదరులను అఖండమైన రాక్షసకుల దీపకులుగా చేసినాను! వెయ్యిన్ని యెనిమిది అండములను సలక్షణముగా పరిపాలించుకొంటూ ఉండవల సిన నీవు, అనవసరముగా దేవతలను చెరబెట్టినావు అందువల్ల శివకుమార సంభవమేర్పడినది. అతనిని సాధారణమైన బాలుడివనియెంచి యింత తెచ్చుకొంటివి. నేను చెప్పునది సావధానముగా వినుము. అతనిచేతిలోని, శక్త్యాయుధము సాక్షాత్తు భువనేశ్వరి యొక్క ప్రతి రూపమే అతను ప్రత్యక్ష శివప్రతిరూపమే! శివశక్తివల్ల మరణము పొందగలవుతప్ప మరే శక్తీ నిన్నేమీ చేయజాలదని తెలిసిన నీవు, అతను వీరబాహుని దూతగా పంపినపుడే ఆలోచించి ఉండవలసినది. ఇప్పుడు నీవుకోరినవిధముగా నీరాక్షస సేనలను మరలా బ్రతికించవలెననిన, మహాసముద్రపుటంచున గల సుఖామంద్రాద్రి అనే కొండనుతెచ్చి యిక్కడ నిలువనిచ్చినయెడల వారికి ప్రాణములు పునఃవచ్చును" అనిచెప్పి మాయాదేవి మాయ మయినది.

శూరుడు వెంటనే ఇంద్రజాలమనే తేరును పిలిచి తక్షణమే శివ ప్రసాదిమైన ఆపర్వతమునిక్కడికి తెమ్మని ఆదేశించెను. అదట్లేచేసెను. పర్వతముయొక్క గాలిసోకగానే మరణించిన రాక్షసులందరూ లేచి నిలిచిరి. అతని తమ్ములూ-అతని కుమార్లుకూడా పునరుజ్జీవులైరి. అంతు లేని ఆనందముతో శూరుసి హృదయము పొంగినది.

వెంటనే రాక్షస సేనావాహిని యంతయూ వీరావేశముతో శంభు కుమారుని ఎదుర్కొన చుట్టుముట్టిరి. అప్పుడు శివనందనుడు అమోఘ మైన, అద్వితీయమైన పరమేశ్వరుని పాశుపతాస్త్రమును వారిపై ప్రయో గించగా అది అగ్నిశిఖలను విరజిమ్ముచూ రాక్షసమూకనంతటినీ భస్మీ పటలముచేసి-సుఖామాద్రి పర్వతమును చెల్లాచెదురు చేసిన పిమ్మట, శక్తి బాలుని చేతికివచ్చి చేరినది అప్పుడు శూరపద్మాసురుడు తన ఇంద్ర జాలమనే రథాన్ని దేవగణములపై, భూత సేనావాహినులపై నియోగిం చెను యుద్ధరంగమందు శూరుడు తప్ప మరొక్క రాక్షసుడు లేని కారణాన ఆ దివ్యరథము వానినీ శ్రీ సుబ్రహ్మణ్యుని తప్ప మిగిలిన దేవ భూతసమూహములను ఆ అండము నుండి తొలగించుచూ వెళ్ళిపోయి నది. ఈ దృశ్యమును చూచి శూరుడు మిగుల సంతోషము పొందెను. ఆ దివ్యరథము దేవతలను, భూత సేనావాహినిని వారివారి లోకమున

విడచి పెట్టినది. ఇది చూచి దేవతలు వ్యాకులము చెందిరి. ఈనాటి విజ్ఞాన శాస్త్రమునుండి ' రిమోట్ కంట్రోల్ ' ఎలా ఏర్పడినదో అలాగే ఆనాటి విజ్ఞానమునకు కూడా యిలాంటి 'రిమోట్ సిస్టమ్' అమలులో నుండినదని మనము గ్రహించవలెను. ఒక శతాబ్దము ముందు మనకు విమానము గాలిలో ఎగిరే వాహనమని సిద్ధాంతీకరించినా నమ్మని వారుందరని అనుకొందుము కానీ ఈ శతాబ్దమందు అది సర్వ సధారణ అనుభవదృశ్యమైనది. నాస్తికులు ఆ కాలమందే యుండిరి మరి యీనాడు వారు యీ పురాణములన్నీ పుక్కిటి పురాణములను కొట్టి వేయుచున్నారు.

భగవంతుడు నాస్తికులలోనూ అస్తికులలోనూ కలడు. కానీ దేవుడు లేడనే వాదాన్నీ - ఉన్నాడనే వాస్తవాన్నీ రెండింటినీ సమర్థించే త్రిశంకులలోని ద్వంద్వగుణాన్ని ఎవ్వరూ హర్షించలేరు! లేడని చెప్పినందువల్ల నష్టమేమీలేదు! అలాగే వున్నాడని చెప్పినందువల్ల కూడా మిగిలినవారికి నష్టములేదు ఇవన్నీ అనుభవమూ అనుభూతికీ సంబంధించిన విషయమే " Logic is the first enemy of the TRUTH " అనే సూక్తిని అన్వయించుకొని సత్యాన్ని అన్వేషించడమే భక్తుని కర్తవ్యము! ఎందుకంటే " Truth is God "

సరే! యుద్ధరంగమున ఒక వైపు దేవసేనావతి మరోవైపు ఏకాకిగా మిగిలిన శూరపద్మాసురుని విషయానికి వద్దామా!

ఇంద్రజాలము అనే రథమునుద్దేశించి చెంగల్వరాయుడు ఒక దివ్యాస్త్రమును పంపగా, అది దానిని తోడ్కొనివచ్చి ఆయన ముందు నిలబెట్టినది. దానిని జూచిన శివశక్తి కుమారుడు " ఓ దివ్యరథమా ఇకనుంచి నా ఆధీనములో నుండుము శూరుడు పిలిచినా వెళ్ళరాదు! జాగ్రత్త! " అని ఆదేశించగానే అది అట్లేచేసినది.

కుమారస్వామి శూరునివైపు తదేకదృష్టిని సారించెను. ఇరువురికీ యుద్ధము మొదలైనది. శూరుడు శూలాయుధమునుకు మారునిపై పంపెను అదిజూచి తానుశూలముల సముదాయమును ఒక్కుమ్మడిగా వుపయోగించి అగ్నిశిఖలను గ్రక్కుచూ అతి వేగముగా వచ్చుచున్న శూలాయుధాన్ని తుత్తునియలు చేసి మరలా షణ్ముఖుని చేరినవి. తదుపరి అతి శక్తివంతమైన బాణమును ప్రయోగించి శూరుని

సింహవాహనమును చంపివేసెను. వెంటనే శూరుడు చక్రవాక పక్షిగా మారి ఎగిరిపోయెను.

## శూరసంహారము

అలా చక్రవాక పక్షిగా మారిన శూరపద్మాసురుడు దేవభూత గణములపై పలువిధములుగా దాడి చేయసాగెను. కొందరిని కాళ్ళతో త్రొక్కివేసెను. మరికొందరిని ముక్కుతోపొడిచి చంపివేసెను. ఇంకొందరిని రెక్కలతో ఝాడించుచూ ఆకాశమునకు ఎగురవైచెను. కొందరు స్పృహతప్పి పడిపోయిరి. తదుపరి శ్రీ సుబ్రహ్మణ్యుని రథమునూ అందలి దివ్యాస్త్రములనూ విరిచి నుగ్గు నుగ్గు చేసెను. రథము లేని సుబ్రహ్మణ్యునిజూచి దేవేంద్రుడు నెమలిగామారి ఆయనకు యుద్ధకాల వాహనమాయెను. షణ్ముఖుడు నెమలి వాహనమందుండి పలు దివ్యాస్త్రములతో తనను చుట్టివచ్చుచున్న చక్రవాకపక్షి రూపియైన శూరునిపై ప్రయోగించెను. చక్రవాకపక్షి పైకి ఎగురుచుండగా నెమలివాహనుడైన దేవసేనాపతి వానిని తరుముకొంటూ ఎగురసాగెను. చక్రవాక పక్షిని రెండు ఖండములుగా నరికివేసెను.

శూరుడు వెంటనే మహాసముద్రముగా మారెను. ఉవ్వెత్తున ఎగసిపడే అలలతో శంభుకుమారునిపై దండెత్తెను. కృత్తికాసూనుడు ఆగ్నేయాస్త్రమును వానిపై ప్రయోగించగా అది మహాసముద్రమును ఎండిపోవునట్లు చేసెను. అప్పుడు శూరుడు ప్రచండ మారుతముగా మారి పారిడెను కొంత యుద్ధమలాచేసాక, అగ్నిగామారి కార్తికేయుని కాల్చివేయ ప్రయత్నించెను. అగ్నిఖండములారుగా శివఫాలనేత్రమందుండి ఉద్భవించిన వానినా వీడు అగ్నియై కాల్చునది? దానినికూడా శక్తికుమారుడు భగ్నముకావించెను! ఇలా నాలుగు దినములు వీరిమధ్య ఎడతెరిపిలేకుండా పలుతెఱంగుల యుద్ధము సాగెను.

శూరుని పరాక్రమమిలా చూపుతున్నాడు. వాని శక్తియుక్తులన్నీ వుపయోగించడం గమనించిన శివకుమారుడు వానినిజూచి "ఓయీ! రాక్షసేంద్రా! ఇంతవఱకు నీసామర్థ్యమును నాకు జూపితివి! మరి, నాఅసలు స్వరూపము నీవు చూడవలదా? ఇదిగో చూడు" మని తన విశ్వరూపమును ప్రదర్శించెను. శ్రీవారి విశ్వరూప వివరములు మొదటనే చెప్పియున్నాను. తలా తనలో అనేకమైన గోళములు తిరుగుచుండుట,

సూర్యచంద్రాది నవగ్రహములు, నక్షత్రములు, సకల భువనములు మొదలైనవి. శూరునికి జూపెను. దేవతలు 'మురుగ'నికి సాష్టాంగ దండప్రణామములర్పించి స్తుతించిరి.

ఇలా విశ్వరూప స్వరూపధారియైన గిరిజా పుత్రునిగని శూరపద్మాసురునికి కూడా వివేకమూ, విచక్షణాజ్ఞానము ఉదయించినది. వాని హృదయమెంతో శాంతినిపొంది, సంతోషభరితమైనది. వెంటనే శ్రీవారు వానిలోని వివేకమును నశింపజేసి, తన విశ్వరూపమును మఱుగుపఱచి యథారూపమున నిలిచెను.

ఇక్కడ విశ్వరూప ప్రదర్శనము చేసిన కైలాసపతి కుమారునికీ; గీతోపదేశకాలమందు వైకుంఠపతి అవతారుడైన కృష్ణయోగీశ్వరులకునూ ఒకే సామ్యముననూ-సాక్షాత్తు కృష్ణుడేఒకచో ఇలాచెప్పినాడట! "నావిశ్వరూప ప్రదర్శనములో నాముఖమందు సాక్షాత్తు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడే కన్పట్టుచున్నాడని యెఱుంగుడు." కృష్ణుని ముఖమందే ఎందుకు సుబ్రహ్మణ్యుడు కన్పడవలె?

ఇక్కడొక విషయము ముచ్చటించుకొని తర్వాత కథాగమనమునకు పోవుదమా? నాసికారంధ్రములలో కుడివైపు 'ఇడ', ఎడమవైపు 'పింగళ' అనే నాడులున్నవి. ప్రాణాయామముచేయు యోగిపుంగవులు శ్వాసను లెక్కించి తగు మాత్రలలో పీల్చి వదలునపుడు, క్రమేణా ఆరెండునాడులు సంధానమగుచున్నది "పింగళనాడి" "శక్తి"కాగా, "ఇడనాడి" "శివుడే"! వీరే ప్రకృతి పురుషులు' వీరిసంధానమే శివశక్తులయ "అర్ధనారీశ్వర" తత్త్వముయొక్క ఏకత్వము! వీరి సంయోగ ఫలితమే, అనగా ఈరెండు నాసికారంధ్రములోని రెండునాడుల సంగమమే ముక్కుపైనుండి "అజ్ఞాచక్ర"మని చెప్పబడు జ్ఞాననేత్రమగు త్రినేత్రమునుండి యిరుకైనదారిలో గొంపోవు 'సుషుమ్నానాడి' పార్వతీపరమేశ్వరుల లయత్వానికి సంభవించిననాడే యీ సుషుమ్నానాడి అధిపతియైన "శ్రీసుబ్రహ్మణ్యేశ్వరుడు" ఈయనే పరబ్రహ్మము! ఈసుషుమ్నానాడి నుండి బ్రహ్మరంధ్రమునకు పోవు ఊర్ధ్వరేతస్సుగుద స్థానము నుండి ఆరుచక్రములుగా కపాలమందుగల సహస్రారకమలము వఱకు ప్రయాణము చేయునది ఈ జ్ఞానమే బ్రహ్మజ్ఞానము. ఇదియే గురువు! ఇది నేర్పువాడే అసలయిన గురువు!

మాటలకందని అతీతమైన-అనగా తమో, రజో, సత్వగుణములు మించి (త్రిగుణాతీతమైన) Supramental Consciousness అనుభవించిన యోగీశ్వరులలో పురుషోత్తముడైన శ్రీ కృష్ణుడొకడు అందుకే శ్రీ మద్భగవద్గీత చివరి అధ్యాయములో చివరి శ్లోకములో శ్రీకృష్ణుని గురించి యిలా చెప్పబడినది.

" యత్ర యోగీశ్వరః కృష్ణ - యత్ర పార్థోధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయోభూతిర్ ధృవనీతిర్మతిర్ మమః "

దీనినిబట్టి శ్రీకృష్ణుడు యోగీశ్వరుడేగానీ - పదునారువేల యెనిమిదిమంది స్త్రీలతో భోగించినవాడు కాదనిస్పష్టమగుచున్నది మరివారినెల్లా సంభోగము చేసినట్లు చెప్పబడుట "యద్భావం తద్భవతిః" అన్నట్లుగా భక్తులు ఎలా తన్ను అనుగ్రహించమని కోరితే అలావారిని యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు భావప్రాప్తిని కలిగించెనని గ్రహించవలెను. అలాగే శ్రీకృష్ణుడు ప్రాణాయామసాధకుడైన కారణాన "శ్రీసుబ్రహ్మణ్యుని తన ముఖమందు నిల్పగలిగి 'సుజ్ఞాని'యై-భారత కథారథసారథియై ఈశ్వరుని ప్రతినిధిగా భూభారమును తగ్గించి, అధర్మాన్ని నశింపజేసి' ధర్మాన్ని స్థాపించుటకు కారకుడైనాడు. అందువల్లనే తనలో విశ్వరూపమును సృష్టించి చూపగల శక్తిమంతుడైనాడు. హరిహర భేదము లేదని చెప్పుటకిదియే నిదర్శనము. మనముకూడా సద్గురు కటాక్షము వలన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని గురురూపములో ఉపాసించినయెడల ప్రాణాయామసాధకులై-మనలోనే విశ్వరూపమును Perception ద్వారా (అంతర్‌సృష్టి) దర్శించి, యితరులను దర్శింపజేయగలవారమగుదుము

ఇలాంటి అనుభవవేద్యమైన జ్ఞానాన్నియివ్వగల పుణ్యపురుషులైన యోగిపుంగవులుగా "శ్రీరామలింగజ్యోతి", "శ్రీశంకర భగవత్పాదులు" "శ్రీ షిరిడిసాయిబాబా" "శ్రీ రమణ మహర్షి" యిత్యాది మహానుభావులు ఈ భరతభూమిలో జన్మించి కారణజన్ములుగా అవతరించి, తాము చేయగలిగినదేదో చేసిన పిమ్మట శివలోకపదవులనలంకరించిరి అందుకే పాశ్చాత్యులు కూడా మనదేశమందలి పుణ్యపురుషులను సందర్శించి తమ సందేహములను నివృత్తిచేసికొనుట వచ్చుచున్నారు. కానీ మన మేమో లౌకికపరమైన సుఖంకోసం వెంపర్లాడుచూ అరిషడ్వర్గమైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములతోనూ, అశాంతితోనూ,

పవిత్రమైన మానవజన్మను కేవలం భుక్తికోసమేయని భావించి, 'ముక్తి గురించి ఆలోచించకుండానే గతించుచూ 'పునరపి జననమ్ పునరపి మరణమ్' అనే నానుడిని అనుభవించుచున్నాము. ఇలా చెప్పుకుంటూ ఎంతైనా వివరించుకొంటాపోతే పుస్తక విస్తరణ అవుతుందని యింతటితో క్లుప్తంగా మీ ఆలోచనకే వదలివేయుచున్నాను.

ఇక అసలుకథకు వద్దామా? ఎప్పుడైతే శూరపద్మాసురునికి వివేకమూ, జ్ఞానమూ 'మురుగ'ని విశ్వరూపసందర్శనమువల్ల కలిగినదో, ఆ దివ్యానుభూతి (divine bliss) నండి క్షణమాత్రములో ఆయన తొలగించినాడు. మరలా అజ్ఞానియై సమర సన్నాహానికి పురికొల్పబడినాడు. జ్ఞానియైనవాడు 'సుబుద్ధి' అజ్ఞానియైనవాడు దుర్బుద్ధి! కనుక సుజ్ఞానియైనవాడు దుర్బుద్ధి కలవారిని గురించి పట్టించుకొనడు. ఇక్కడ శూరుడు మరలా దురహంకారపూరితుడై సుబ్రహ్మణ్యునితో యుద్ధము సేయమొదలిడెను ఉన్నట్లుండి మామిడివృక్షమై 'యింతింతై......' అన్నట్లుగా విశ్వంమతటనూ వ్యాపించి, సకల లోకములను తన కొమ్మలతో కుదిపివేయుచుండెను. అన్ని లోకములలోనివారున్నూ గగ్గోలు పెట్టసాగిరి. ఏమిప్రళయము సంభవించినదోయని నిశ్చేష్టులైరి. లోకములన్నీ దద్దరిల్లగా సకలలోకవాసులు చేయునది తెలియక మిన్నకుండిరి. అప్పుడు శక్తివేలాయుధుడు తనశక్త్యాయుధమును వదలెను. అదిసహస్రకోటిభానుతేజమై సూటిగా వెళ్ళినదై, ఆమామిడి వృక్షముయొక్క కాండ మధ్యభాగమును గ్రుచ్చినదై దానిని రెండు భాగములుగా చీల్చివేసినది. అప్పుడు ఒక భాగమునుండి నెమలిగానూ, మరొక్క భాగము నుండి కోడిపుంజుగానూ శూరుడు రెండు రూపములెత్తెను Double action

కోడిపుంజుగా మారినవాడేమో దేవతలను పొడిచిపొడిచి తరుమసాగెను. నెమలి రూపమునవున్నవాడు సూటిగా స్కందునే పొడవవలెనని శరవేగముతో వచ్చుచుండెను. శివుని కుమారుడు చల్లని దృష్టిని సారించి కోడిపుంజును తనయొద్దకురమ్మనెను. అది వరకు అగ్నిదేవుడు కోడిపుంజురూపమున శ్రీసుబ్రహ్మణ్యునికి పతాకమందు నిలబడినవాడు యథారూపమును దాల్చగా అస్థానమందు శూరుని కుక్కుట రూపమును 'నిలుపు'మని ఆదేశించెను. అదియే శ్రీవారికి కుక్కుటధ్వజముగా నిలిచిపోయినది.

నెమలి రూపమున యుండిన యింద్రుని యథారూపమును దాల్చుమని ఆదేశించి తాను దిగెను. అప్పుడు శరవేగమున దూసుకొని వచ్చు శూరుని మరోరూపమగు మయూరము (నెమలి)ను "ఆగుము నాచెంతకు రమ్ము! నేను నిన్ను అధిరోహించెదను." అని శాసించగానే శూరుడు ఆ రూపమునవచ్చి కిక్కురుమనక ండా వచ్చి నిలిచెను. వెంటనే శివకుమారుడు మయూరవాహనుడాయెను. వాడేమో సుబ్రహ్మణ్యుని ఆకాశమందు ఎగసి తీసికొనిపోవు ప్రయత్నము చేసినను, శక్తి కుమారుని దివ్య శక్తి ప్రభావముచే పైకెగసినవాడు క్రిందికి దిగి వచ్చి శాంతుడాయెను

కుక్కుట రూపమున పొడవగా గాయమొంది పారిపోయిన దేవతలందరూ 'గుహుని' కృపాదృష్టివలన స్వస్థత చెందిరి. మయూరవాహనుడై, కుక్కుటధ్వజుడై, సకల దివ్యాస్త్రసంశోభితుడైన షణ్ముఖదేవునికి దేవతలు సాగిలపడి దండప్రణామములు భక్తిపూర్వకముగా సమర్పించగా నెమలిరూపమునవున్న శూరపద్మాసురుడు నవ్వెను.

"ఓహో! మనము వీడి పాదములపైబడి నమస్కరించితిమని నవ్వుచున్నాడు" అని తెలిసికొనినవారై లేచి నిలబడి, శిరోపరితలములపై చేతులుమోడ్చి వందనములు చేసిరి. అప్పుడు, కుమారస్వామికి ఎడమవైపున కుక్కుట ధ్వజముగా మారిన శూరపద్మాసురుడు చిరునవ్వు నవ్వెను అది గమనించిన దేవతలు, "ఓహో! అప్పుడు కూడా వీనికే మనము నమస్కరించుచున్నామని భావించి వీడు నవ్వుచున్నాడా ? యని తమలో తామనుకొనుచుండిరి. కృతజ్ఞతాభావముతో శ్రీ సుబ్రహ్మణ్యునికి తమ అభివాదములెలా అందింతువలయునో తెలియక సందిగ్ధులైరి. అప్పుడు శిఖివాహనుడు వారినిజూచి యట్లనెను.

"దేవతలారా!, మీరు నన్ను మ్రొక్కినపుడు నావాహనమైన యీ నెమలిరూపములోని వాడున్నూ, నా ధ్వజమైన కోడిపుంజు రూపములోని వాడున్నూ అయిన శూరపద్మాసురుడు నావాడై స్వీకరించగలిగెనని యెఱుంగుడు. వాడు సామాన్యుడుకాడు! పదునాలుగువేల సంవత్సరములు జగదీశ్వరుని ధ్యానించి తపమాచరించెను! వాని తపోశక్తి కారణంగా నాచెంత చేరినాడు. వాని ముందు మీ తపోబలమెంత?" అని

దేవతలలోని లోపమును ఎత్తిచూపెను. వారు సిగ్గుతో తలలువంచిరి. అప్పుడు అక్కడ చేరిన బ్రహ్మ, విష్ణు, మహేంద్రులు శిరము వంచి సుబ్రహ్మణ్యునికి వందనములర్పించి ఎన్నోరీతుల స్తుతించిరి. వారిని శివప్రతిరూపమగు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి అనుగ్రహించెను. ఈవిధితో పది దినముల యుద్ధము ముగిసినది. శూరపద్మాసురునివలన ఏర్పడిన భయములు తొలగినవి. దేవతలందరూ ప్రఫుల్లవదనులై, ప్రశాంత చిత్తులైరి. ఈ శూరసంహారగాథను చదివినా, వినినా, పాఠకులకూ, శ్రోతలకూ పతకలదోషములు, శత్రు, రోగ, ఋణ, మారణ, యంత్ర-తంత్రసర్వాభిచార, కలిదోషములు తొలగి దేవతలకు లభించిన సంతృప్తిని పొందగలరు. ఆ శివకుమారుని కృపాకటాక్షములు లభించి, యిహపర సౌఖ్యములు అనుభవించగలరని యీ రచయిత యొక్క దృఢ విశ్వాసము. ఇక్కడొక శ్లోకమును వ్రాసెదను. పాఠకులు నిత్యము పఠించి కృతార్థులవుదురు గాక!

శ్లో॥ త్వాం శత్రురోగ ఋణమారణ
యంత్ర తంత్రసర్వాభిచార కలి
దోష నివారణాయ శివ స్వరూప
ముప గృహ్య కల్ప్రద్భశ్య శ్రీ
వల్లీశనాథ మమదేహికరావలంబమ్॥

శూర సంహారము గురించి వీరమహేంద్రపురిలోని శూరుని పట్టపు రాణి పద్మకోమల మొదలగు వారికి తెలిసినది. ఆమె ఆవార్త వినగానే తనువుచాలించినది. మిగిలిన శూరుని దేవేరులు అగ్నిప్రవేశము చేసిరి. మిగిలిన ఒక్కగానొక్క కుమారుడైన హిరణ్యుడు తండ్రి మరణవార్త విని దొరలి దొరలి రోదించెను. శుక్రాచార్యుని సహాయముతో తల్లిదండ్రులకు చేయవలసిన కర్మక్రియలొనరించి, జీవితము అశాశ్వతమని గ్రహించి, పరమేశ్వరుని తలంచి తపస్సుచేయ వెడలెను.

ఈవిధముగా జరిగిన శూర సంహారగాథనువిని తొల్లి మహావిష్ణువు శ్రీకృష్ణ భగవానుడు, దధి మహర్షి తమ శత్రువులను జయించిరని శ్రీస్కాందపురాణమందు వేదవ్యాసుడూ చెప్పియున్నారు.

## దేవసేవతో వివాహము

శూరసంహారానంతరము దేవసేనాపతి వీరబాహుని పిలిచి, "నీవు తక్షణమే వీరమహేంద్రపురిలో చెఱబట్టబడిన ఇంద్రుని కుమారుడైన జయంతుడు, ఇకనూ వుండగలవారందరినీ విడుదలచేసి యిక్కడికి తీసికొనిర"మ్మని వుత్తరువిచ్చెను.

వీరబాహువలాగే చేసెను. విడుదలైన దేవతలందరూ శ్రీసుబ్రహ్మణ్యేశ్వరుని వేనోళ్ళ కీర్తించి తమ కృతజ్ఞతలు తెలుపుకొనిరి. వారినిజూచి మహాసేనుడు "ఓ దేవతలారా! మీరందరూ తమతమ లోకములకుపోయి ముందువలెనే సకల భోగములననుభవింపుడు" అనెను. వారందరూ 'మురుగ'ని సేవించి కృతార్థులైరి. తర్వాతవారు దేవేంద్రుని సమీపించి అతనికి నమస్కరించిరి. అందరూ తనవెంటరాగా మయూరవాహనుడు తిరుచ్చెందూరులోని తన నగరమును చేరెను. అక్కడ ఆది వఱకే విశ్వకర్మచే చేయబడిన తన సౌధమందుగల దివ్యమైన సింహాసనముపై గంభీరముగా నాసీనుడాయెను.

దేవశిల్పి విశ్వకర్మను పిలిచి, "ఓయీ! దేవశిల్పీ! నీవు మాతో ర"మ్మనెను. అందరూ కలిసి అక్కడ కొంతతడవు వుండిన పిమ్మట మధురై సమీపము "తిరుప్పరంకున్రమ్" అనే దివ్యస్థలమును షణ్ముఖుని తోచేరిరి. విశ్వకర్మను పిలిచి అక్కడొక సుందరమైన నగరమును నిర్మింపుమనగా, అతడట్లే చేసెను.

## దేవసేనతో వివాహమునకు ఏర్పాట్లు

బ్రహ్మదేవునితోనూ, శ్రీ మన్నారాయణునితోనూ దేవేంద్రుడిట్లు చెప్పెను. "నాపెంపుడు కూతురైన దేవసేనను మన శివకుమారునికిచ్చి వివాహము చేయదలచినాను" ఐరావతమనే ఇంద్రదళ శపు పట్టపుటేనుగు నాలుగు దంతములు కలదై తెల్లని శరీరముతో నుండునది. దాని సంరక్షణలో దేవసేన పెరుగుచూ, ఎల్లవేళలా శివసుబ్రహ్మణ్యుని తన పతి దేవుడుగా భావించుకొని ఆయననే స్మరించుచున్నది. దేవసేననూ, ఇంద్రాణినీ తోడ్కొని వెంటనే రావలసినదిగా ఇంద్రుడు దూతలను పంపగా వారు మిగుల సంతసించి వారితో వచ్చిరి.

శచీదేవి విడుదలైవచ్చిన తనకుమారుడైన జయంతునిగని వానిని దగ్గరకు తీసికొని, శిరము మూర్కొని పుత్రవాత్సల్యము కనబరచినది. దేవతలందరూ దేవసేనాదేవి వివాహమునకు కావలసిన యేర్పాట్లు ఆనందోత్సాహములతో చేయుచుండిరి.

సురేంద్రుడు షణ్ముఖుని యెదుట నిలబడి వానిని స్తుతించి, "మహాసేనా! నీ అనుగ్రహము వల్ల శూరపద్మాసురుడు మొదలుగాగల రాక్షసుల బాధ మాకు తప్పినది. బందీలైన జయంతాదులు విడుదలయినారు. ఇంతచేసిన నీకు తిరిగి యేమిచేసి మా కృతజ్ఞతలను తెలుపగలము? కరుణాసాగరా! నీవిశ్వరూప దర్శనము చూడగలిగిన వారంతా ధన్యులైనారు. ఇప్పుడు నీవు కరుణించి నా పెంపుడు కుమార్తె అయిన దేవసేనను వివాహము చేసికొనినచో నాతోబాటు దేవతలందరూ ధన్యులమగుదు"మని కైమోడ్చి నిలిచెను. మయూరవాహనుడు 'వల్లె' యనెను.

మరలా దేవశిల్పియైన విశ్వకర్మకు పని కల్గెను. సుందరమైన కళ్యాణ మంటపము, విడిది గృహములు వెంటనే నిర్మించి యివ్వగా దేవేంద్రుడు విశ్వకర్మను శ్లాఘించి సత్కరించెను. ఈ వివాహమును చూచుటకు మునిగణములూ, రాజులూ, రాణులూ, ప్రజలూ తండోపతండములుగా వచ్చిరి

స్త్రీలందరూచేరి దేవసేనకు మంగళస్నానము చేసిరి. నలుగు పెట్టిరి. సొగసైన వస్త్రములతోనూ, మిరుమిట్లు గొలిపే దివ్యాభరణములతోనూ "అందానికే అందము" అనే తీరున అలంకరించిరి. శచీదేవి దిష్టి తీసెను.

## పెళ్ళి ఊరేగింపు

దేవేంద్రుడు షణ్ముఖస్వామి మందిరమునకు వచ్చి, సింహాసనమందమరియున్న మహాసేనునికి నమస్కరించి "కారుణ్యసింధో! తాము వివాహ మంటపమునకు బయల్దేరి రాగోరేనాను." అని వినమ్రుడై పలికెను.

"సురేంద్రా నా తల్లిదండ్రులైన ఆది దంపతులకు కబురంపినావా!" అని అడిగెను. "పంపినా"ననెను. అయితే అలస్యమెందుకు?

సుముహూర్తమునకు కళ్యాణ వేదికను చేరుట మంచిది" అని బ్రహ్మ, విష్ణువులు పలికిరి.

దేవసేనాపతి నెమలినెక్కి బయల్దేరగా అప్సరసలు నాట్యమాడిరి వీనులవిందైన సంగీతము వినిపింపబడినది. విందులు, వినోదములు వచ్చిన వారికి అందింపబడినవి. కుమారస్వామి వూరేగింపుగా బయల్వెడలి దేవతా సమూహము వెంటరాగా కళ్యాణమంటపమును చేరెను. దారిపొడుగునా పూలజల్లు కురిపించిరి. పన్నీరు, సుగంధభరితమగు పరిమళ ద్రవ్యములు అందరిపై చల్లిరి. రాజవీధి సుందరముగా అలంకరింపబడినది. అలా వూరేగింపుగా రాజవీధిలో నెమలి మీద కూర్చొని వచ్చిన శివకుమారుని అందచందములను చూచిన స్త్రీలందరూ విస్మయులైరి. కళ్యాణ మంటపము చేరగానే మంగళ వాయిద్యములు ఘోషించినవి.

'మురుగ'ని సౌందర్యము మరేబాలునిలోనూ ఇంత వరకూ కానరానిదని అభిజ్ఞులైన పండితాభిప్రాయము తమిళములో 'మురుగు' అంటే 'అంద'మని వ్యాకరణము చెప్పుచున్నది.

స్వామి నెమలి నుండి దిగెను. అల్లుని జూచిన లక్ష్మీదేవికి సంబరముగా నున్నది. సరస్వతీదేవికే మాటలురానంత సంతోష వివశత కలిగినది. ఇరువురూ కలిసి ముందుగా మంగళహారతులిచ్చి పెళ్ళి కుమారుని కళ్యాణ మందిర ప్రవేశము చేయించిరి. మంగళ గీతములు ఇరువురూ కలిసి పాడిరి. కుమారస్వామి కళ్యాణవేదికను మెల్లగా నడచివచ్చి చేరెను.

ఇంద్రాణి అల్లునిచూచి ఆనందపరవశురాలైనది. ఇంద్రుడు స్వహస్తాలతో పన్నీరుపోయుగా అతడు అల్లుని పాదపద్మములను కడిగి తన నెత్తిన జల్లుకొన్నె. శచీదేవిని అర్థవంతముగా జూచెను. ఆమెయ్యూ ఆ పాదకమలముల పైన చిలకరించిన సుగంధభరితమైన తీర్థోదకమును తన శిరస్సు పై చల్లుకొనినది. ఇరువురూ పాదాభివందనములు చేసిరి. శచీదేవి మంగళ దీపహారతినిచ్చినది అపురూపమైన, పరిమళభరితమగు మాలను అల్లుని మెడలో సురపతి వేసెను.

షణ్ముఖుడు కళ్యాణవేదికపైనే తనకోసం వేచియున్న దివ్యమగు సింహాసన మందు ఆసీనుడాయెను. దేవతలందరూ అతనిని వుపచరించు

చుండగా ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులు తమ ముద్దుల కుమారుని వివాహవైభవమును చూడనెంచి, ఆకాశ మార్గమున వచ్చి కళ్యాణ వేదికను చేరిరి.

కుమారస్వామి సింహాసనము నుండి లేచివచ్చి తల్లిదండ్రులకు నమస్కరించుచూ పాదాభివందనము చేసెను. రాక్షస నిర్మూలనము చేసి, విజయుడై వచ్చి, పెళ్ళికుమారుడుగా మారిన తమ కుమారుని దీవించిరి. బ్రహ్మ, విష్ణు, మహేంద్రాది దేవగణములు తమ్ము నమస్కరించుచుండగా వారు దివ్యాసనములందు అమరిరి. ఛత్ర చామరములతో సేవింపబడిరి. ఇంతవరకు కుమారస్వామిపై దృష్టి నిలిచిన వారందరూ "జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ" యని మనసారా ఆ ఆదిదంపతులను ధ్యానించిరి. వారి స్తోత్రములకు మహాదేవియూ, మహాదేవుడున్నూ మెచ్చి వారిని ఆశీర్వదించిరి. కుమారుని వివాహ వైభవమునకు ఆనందించిరి.

ఈలోగా కుమారస్వామి తొలిపూజకు అర్హుడై, సకల విఘ్నములను హరించువాడై, సంకష్ట హరచతుర్థీవ్రత పూజాధిపతియైన శ్రీగణేశుని ధ్యానించగానే, శ్రీ విఘ్నేశ్వరుడు కళ్యాణవేదికపై ప్రత్యక్షమాయెను. షోడశోపచారపూజల నందుకొనెను. పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించెను. బ్రహ్మ, విష్ణ్వాదిదేవ, మునిగణముల నమస్సులను అందుకొనెను.

లక్ష్మీదేవి, సరస్వతీదేవి యిరువురూ కలిసి అందానికే అందమైన దేవసేనను కళ్యాణ వేదికకు తోడ్కొని వచ్చిరి. ఆమెచే ముందుగా తన బావగారైన శ్రీ వినాయకునికి అర్చింపజేసిరి. అత్తామామలైన గిరిజారమణులకు పాదాభివందనము చేయించిరి. బ్రహ్మ, నారాయణాది దేవతలకూ, ఋషిగణములకూ నమస్కరింపజేసిరి. పరమేశ్వరుని వైపు పార్వతి అర్థవంతముగా చూడగా, ఆయన కనుసైగతో అనుమతి పొందినదై, లేచి తనకోడలైన దేవసేనకడకేగినది. ఆమె చేయిపట్టుకొని తన కుమారుని ప్రక్కనగల దివ్యాసనము మీద కూర్చుండజేసినది. ముగ్గురమ్మలు ఒక్కచోట చేరిరి. పెళ్ళి కుమార్తెనూ, పెళ్ళి కుమారుని చూచిన వారందరూ ఆనందసాగరమున ఓలలాడిరి.

పునః శచీదేవి అమరేంద్రునితో కలిసి తమ అల్లునికి పాదపూజ చేసినది. ఇంద్రుడు దేవసేన కుడిచేతిని కుమారస్వామి కుడిచేతిలో నుంచి, "జామాతా! నా అనుంగు కుమార్తెయైనను యీ దేవసేనయను కన్యామణిని నీ భార్యగా చేసికొనుము" అని నీటిధారను వదలుచూ వారిచే పాణిగ్రహణము చేయించెను. మంగళవాయిద్యములు సుస్వరములతో మ్రోగినవి. రంభాది దేవతాస్త్రీలు మనోహరముగా నాట్యమాడిరి. ఆకాశమందుండి వారిపై పూలజల్లు కురిసినది.

వేదకర్తయైన బ్రహ్మదేవుడు పురోహితుడాయెను. వేదమంత్రములు చెప్పెను. మంగళసూత్రమును 'మురుగ'ని చేతికివ్వగా, ఆయన దేవసేన మెడలో సూత్రధారణ చేసెను. నూతన దంపతులు మాలలు మార్చుకొనిరి. ఊయలలూగిరి. ముగ్గురు మాతలు దేవగానము వినిపించుచుండగా పూలచెండ్లను పూయలలూగుచూ ఒకరిపైనొకరువేసిరి. స్త్రీజనమంతా వేడుకగా తిలకించుచూ, తమ వివాహమునాటి ముచ్చట్లను జ్ఞప్తికి తెచ్చుకొని ఆనందించుచుండిరి.

బ్రహ్మదేవుడు హోమము ముందు కూర్చొనిన దంపతులకు నేతిపాత్రనందించి వారిచే అగ్నిలో మంత్రోక్తముగా హోమవిధులను పూర్తిచేయించెను. దంపతులిరువురూ ముందుగా ఆదిదంపతులైన జగదీశ్వరినీ, జగదీశ్వరుని సేవించిరి. తరువాత వారిని పరబ్రహ్మ స్వరూపుడు తన దృష్టితోనే పరామర్శించెను. అన్నయగు గణపతికి ముందుగా నమస్కరించి ఆయన ఆశీస్సులు పొందెను.

దేవ వివాహము చూడవచ్చిన వారందరూ ఉచితరీతిన సత్కరింపబడిరి. పాత్రముపైద దేవసేన పాదముంచగా, బ్రహ్మదేవుడు అరుంధతీదేవిని నక్షత్రమండలమందు చూడమనెను. వసిష్ఠమహాముని సహితముగా అరుంధతీదేవి ప్రత్యక్షమై ఆదివ్య దంపతులను ఆశీర్వదించినది. పాతివ్రత్య మహిమ యెలాంటిదో చూడండి! వసిష్ఠుని అనుక్షణమూ స్మరించి పతిపూజయే సర్వదేవతా పూజయని ఆచరించి చూపిన ఆమహాసాధ్వి అరుంధతీదేవి దంపతులకు మార్గదర్శియైనది. ఈనాటి దంపతులలో ఆనాటి ప్రేమానురాగాలు, ప్రకృతిపురుష సంయోగ భావములు త్రికరణశుద్ధిగా ఎందమందిలో చూడగలుగుచున్నాము?

ఇక్కడొక ముఖ్యమైన అంశమును చెప్పి కళ్యాణగాథను ముగింతును. వివాహితయైన స్త్రీ ఏపూజలూచేయ పనిలేదని పతివ్రతా శిరోమణులైన అరుంధతి, సావిత్రి, అనసూయ, సుమతి, ద్రౌపది, సీత వంటి ఆదర్శలలనామణులు ఆచరించి చూపిరి. సీతాదేవికి వనవాసకాలమందు ఇదే అరుంధతీదేవి పాతివ్రత్య మహిమలను గురించి వివరించి చెప్పెనట. ఉత్తమస్త్రీ తన భర్తపాదములకు తప్ప మరెవ్వరికీ నమస్కరించకూడదని శాస్త్రప్రమాణమున్నది చాలామంది భర్తలను గాలికి వదలివేసి, గురుసేవయని గురువులకు పాదసేవలు చేయుదురు. తనభర్త అంగీకారముతో చేసినకూడా అపరపురుషపాదసేవ అనుచితమని పురాణములలో చెప్పబడినది. భారతనారీమణి తన భర్తకూ, అత్తామామలకు తప్ప లోకములో మరెవ్వరికీ నమస్కరించ పనిలేదు.

తర్వాత దేవసేనా సుబ్రహ్మణ్యులిరువురూ వివాహ తంతును బ్రహ్మచే పూర్తిచేయించుకొని, ముందుగా పార్వతీపరమేశ్వరులకు ప్రదక్షిణము చేసి వారికి పాదాభివందనము చేసిరి. తదుపరి నూతన దంపతులు స్కందగిరి చేరి విహరించిరి. సురేంద్రుడు వచ్చినవారి కెల్ల వస్త్ర భూషణాదులనిచ్చి వారిని తృప్తిపరచెను.

## ఇంద్రునికి పట్టాభిషేకము

శూరపద్మాసురునిచే పదవీభ్రష్టుడైన సురేంద్రునికి పునః పట్టాభిషేకము చేయనెంచి షణ్ముఖుడు తన దేవేరియైన దేవసేనను తోడ్కొని అమరపురి వచ్చెను. దేవతలందరూ అమరావతి చేరిరి. దేవగురువు బృహస్పతిని ముందిడుకొని పట్టాభిషేకము చేయ ఏర్పాట్లు జరిగినవి. అమరావతి భస్మీపటలమైయుండినది కదా! షణ్ముఖుడు విశ్వకర్మను పిలిచి, "దేవశిల్పి! అమరావతి ముందెలా వుండినదో అలాగే పునః నిర్మింపుమని" ఆదేశించెను. విశ్వకర్మచే అమరావతి పట్టణము యథాతథముగా నిర్మింపబడినది.

బృహస్పతి పర్యవేక్షణలో అభిషేకపుటేర్పాట్లు పూర్తికాగానే బ్రహ్మదేవుడు శచీదేవిపతిని సింహాసనముమీద కూర్చొండనిచ్చి వేదోక్తముగా పట్టాభిషేకము చేసెను. దేవసేనాపతి ఇంద్రు నుద్దేశించి "అమరేంద్రా! నీవు ముందు దేవలోకమును పాలించిన విధంగా మరలా పరిపాలించుము. రాక్షసబాధలు మరలా కలుగకుండా జాగ్రత్తగా నుండుము" మనెను.

తదుపరి అత్తగారింట అల్లుని మర్యాదలందు కొనుచూ కొన్నాళ్లు దేవసేనతో అమరావతిలో సరస సల్లాపములొనరించి స్కందగిరికి భార్యా సహితుడై కుమారస్వామి చేరెను ఈ దేవసేనా కళ్యాణ గాథగ్రహించిన వారికి సర్వశుభములు కలుగును !

## శ్రీ వల్లీ కళ్యాణము

శ్రీ వల్లీ కళ్యాణము గురించి వ్రాయుటకు ముందుగా ఇదివరలో అష్టకుమార్తెలయిన సుందరవల్లి - అమృతవల్లి ఎలా సుబ్రహ్మణ్యుని తమ భర్తగా పొందుటకు తపమాచరించినారో చెప్పియున్నాను! మరలా సంగ్రహముగా జ్ఞప్తి చేయుట నావిధిగా భావించుచున్నాను.

పూర్వము వైకుంఠమందు మాధవీమాధవుల పుత్రికలైన సుందరవల్లి అమృతవల్లి యిరువురూ శరవణ సరోవరమున సుబ్రహ్మణ్యుని తమ భర్తగా పొందవలయునని తపము చేయుచుండిరి అమృతవల్లి సర్వకాల సర్వావస్థలయందున్నూ శరవణభవుని తదేకముగా ధ్యానము చేయు చుండగా, సుందరవల్లి అప్పుడప్పుడు ధ్యానము నుండి బహిర్లోకమందు నిమగ్నమైనది ఇలా పదివేల సంవత్సరములు గడచినవి. కార్తికేయుడు వారిముందు ప్రత్యక్షమాయెను "కన్యామణులారా! మీరు నా గురించి తపమొనరించుచున్నారు. మీకేమి కావలయు"నని అడిగెను.

ఇరువురూ ముక్తకంఠముతో "దయాసముద్రా! మా యిరువురినీ నీ దేవేరులుగా చేకొ"మ్మని కైమోడ్చి ప్రార్థించిరి. అందుకు చెంగల్వ రాయుడిట్లనెను ఓ అమృతవల్లీ! నీవు తదేకధ్యానముతో నన్ను స్మరించిన కారణాన ముందుగా నిన్ను పరిణయమాడెదను. నీవు దేవేంద్రుని కడవానిపుత్రికవై కొంతకాలమాగుము. ఈలోగా నేను అసురశేషము లేకుండా చేసి వత్తును. ఓ సుందరీ! నీవు ఆడుచూపాడుచూ నన్ను అప్పుడప్పుడూ ధ్యానించిన విశేషముచేత నీవు భూలోకమున దక్షిణాపథ మందు నా గురించి మరలా తపము చేయుము. నీ తండ్రి శ్రీమన్నారాయణుడు 'శివముని' అనే పేరుతో ఒక పుణ్యస్థలమందు మహేశ్వరు నుద్దేశించి తపము చేయుచుండును అప్పుడు నీతల్లి లక్ష్మిదేవి

సుందరమైన జింక రూపమున 'శివముని' ఎదుట తచ్చాడు చుండగా-ఆయన దృష్టి ఆ జింకపై పడును వెంటనే సద్యోగర్భమున నీవు అవతరింతువు దేవేంద్రుడా పుణ్యగిరికి నైఋతి దిక్కు నందు వేటగాంద్రులకు నాయకుడై 'నంబిరాజ' నే పేరుతో నిన్ను సంరక్షించు నిమిత్తమై ఉండగలడు. నీవా క్షేత్రమందే ఇరవైవేల సంవత్సరములు తపము చేయుటచే ఆ మల 'వల్లిమల' అనే దివ్య నామముతో పునీతమై, తపోభూమియై కోరిన వారి కొంగు బంగారమై తరించును.

నేను నిన్ను పరిణయమాడుటకు సమయమాసన్నము కాగానే నీవుండు తపోజ్ఞాన వల్లీ భూమి ని మరింత పవిత్రమొనరించుటకు వచ్చెదను నీకారణాన ఎందరో యోగిపుంగవులక్కడ జ్ఞానావలంబకరులై నన్ను చేరెదరు. పొమ్మా! అనెను.

అమృతవల్లి 'దేవసేన' అనే పేరుతో ఇంద్రుని పెంపుడు కుమార్తెయై, ఐరావతముచే సంరక్షింపబడగా శూరపద్మాసురుని సంహారానంతరము "తిరుప్పరంకున్రమ్" అనే దివ్యక్షేత్రమందు శ్రీవారిని వివాహమాడినదని యింతకు మునుపే చదివి యున్నాము.

ఇక పవిత్రమగు శ్రీ వల్లీ కళ్యాణగాధను వ్రాయుటకు శ్రీ వల్లియే నా కలమునకు బలమునిచ్చి శ్రీ స్కాంధ పురాణ సారామృత భూమిని హలముతో దున్ని జ్ఞాన ఫలసారము నిచ్చునని త్రికరణశుద్ధిగా శ్రీవల్లిని ధ్యానించి వ్రాసెదను. ఈ పవిత్రగాధను 'వల్లిమల' లో 25-4-94 (మంగళవారం) నుండి 6-5-94 (శుక్రవారం) వరకు బసచేసి వ్రాయుటచేతనే పూర్తికాగలుగుచున్నది. మరొక్క వింతను ఇక్కడ చెప్పుటకు పాఠకులు సహృదయముతో అనుమతింతురుగాక !

శ్రీ వల్లీ పరిణయము గురించి వ్రాయుటకు 5-5-94 గురువారము ఉదయము మా బసలో పూనుకొన్నాను అప్పుడు ఒక నెమలి మాబస లోనికి వచ్చి మానైవేద్యము నారగించి, దాహము తీర్చుకొని, పురివిప్పి మా ముందు నాట్యమాడి - నాచే ఆనంద బాష్పములు రాలు విధంగా మైమరపించి దీవించి వెళ్లినది ఈ ఆనందాను భూతిని వ్రాయుటకు బ్రహ్మ దేవునికైనా వశము కాదు ! పాఠకులారా ! ఇదే వల్లిమలను ప్రదక్షిణము చేసి తొలుత B Sc., డిగ్రీ పొందాను. దరిమిలా 1978-79 లో కేవలము 5% హిమోగ్లోబిన్‌తో జీవచ్ఛవముగా పడియున్న నేను

మరలా యిదేచోట బసచేసి కొన్నాళ్ళు గిరి ప్రదక్షిణము చేసిన పిమట్మ నను పరీక్షించిన డాక్టరు గారొకరు ఇలా అడిగారు.

"How you are alive all these days? I cannot digest this ! And my medical knowledge does not pemen me to belive this"
(ఇన్నాళ్లు నీ వెలా బ్రతికి యుండ గలిగినావో నాకుబోధ పడుటలేదు నా వైద్యవిజ్ఞానముతో ఇలా జరుగుతుందంటే నేను నమ్మలేకున్నాను)

అందుకు నేనా డాక్టరు గారిని చూచి మాటలాడేశక్తి లేకపోయినా శ్రీ వల్లీశుని ధ్యానించి "Doctor it is true that I have been alive all thes days with 5% Haemoglobin It is all because of my strauch devotion towards my lord ofsubrahmanya"
(డాక్టరుగారూ ఈ 5% హిమోగ్లోబిన్ రక్తబలముతో నేనిన్నాళ్లు జీవించి యుండగలగడం వాస్తవమేమరి ఈప్రాణము ఇలా నిలిచియుంది అంటే అదంతా నా సుబ్రహ్మణ్యుని మీద నాకుగల అచంచలమైన భక్తి శ్రద్ధలే కారణము) - అన్నాను ఆయన ముస్లిము అయినా నాకు నాదైవం మీద గల గురిని చూచి, "Yes, I have to belive your spiritual strength what soever it may be"
(అవును ఏ దివ్యశక్తి యోగానీ, నీదైవిక శక్తి మాత్రము నిన్ను కాపాడు చున్నది నేను నమ్ముచున్నాను) అన్నారు ఇది అతిశయోక్తి కాదు. నిజము ! నిజము ! నిజము !

మీకు ఎన్ని సమస్యలైనా వుండనీ! ఇక్కడకు రండి ఎన్నాళ్లు యీ పవిత్రమైన తపోగిరిని ప్రదక్షిణము చేయగలరో చేసి చూడండి న్యాయమైన మీ అభీష్టములన్నీ తప్పక నెరవేరును. కావలసింది ఏమి టంటే మీలో పరిపూర్ణ మైన భక్తిశ్రద్ధ విశ్వాసములు మాత్రమే! ఈతపో గిరిలో కొందరు మునీంద్రులు కొన్నివేల సంవత్సరములుగా నవరంధ్ర ములుబిగించి సహస్రాన కమల మందు స్రవించు అమృతాన్ని అస్వాది స్తూ 'ఆత్మ పరమాత్మ' ఏకత్వాన్ని సాధించుకొంటూ వున్నారు ఉంటారు వారి తపో బలము మనకు కూడా గిరిప్రదక్షిణము చేయడం వల్ల లభించి పూర్వజన్మ పాపములన్నీ తొలగి మనము కూడా పవిత్రులమై - శ్రీవల్లి శుని కృపతో కార్యసాధ కులమయ్యెదము ! రండి ! వచ్చి మీరు కూడా

యీ అనుభవాన్ని పొందండి ! ఎక్కువ చెప్పినా చెప్పినట్లు కాదు అందుకని, ఇక కథాక్రమంలోనికి వస్తాను.

షణ్ముఖుని ఆదేశాన్ని పురస్కరించు కొని ఆయన అంతర్ధాన మయిన తర్వాత అమృతవల్లి దేవేంద్రునికడ వెళ్లగానే సుందరవల్లి తన స్థూలశరీరాన్ని అగ్నిలో దహించివేసింది సూక్ష్మశరీరాన్ని 'వల్లిమల'కు తెచ్చింది. సూక్ష్మశరీరంతోనే ఇరవైవేల సంవత్సరాల కఠిన తపోదీక్ష వహించినది.

విష్ణుమూర్తి 'శివముని'గా అదే కొండపై శివుని ధ్యానించుచూ తపముండెను. కొన్నాళ్లకు లక్ష్మీదేవి అందమైన జింకగా మారి శివముని చెంతను తచ్చాడు చుండగా ఆయన మోహ వివశుడై తన దృష్టిని సారించెను. అప్పుడా జింక సద్యోగర్భము దాల్చి అప్పటి కప్పుడే ఆడశిశువును కనినది. అంటే అప్పటికి శ్రీ వల్లి సూక్ష్మశరీరాన్ని స్థూల శరీరమైన ఆ శిశుమూర్తిలోనికి తెచ్చినదన్నమాట ఇదేదో వింత శిశువని భావించి జింక అక్కడినుండి పారిపోయినది తన తపము భంగమయినదని విచారించి శివముని మరోచోటికి తదేక ధ్యానముతో తపమాచరించవెడలెను.

దేవేంద్రుడు 'నంబిరాజ'నే వేటగాండ్ర నాయకుడుగా వల్లిమలను అనుకొని నైఋతి దిగ్భాగమున గల సోమనాథపురమందు నివసించు చుండెను అతనికి మగసంతానము కలిగిననూ, ఆడసంతానము లేదేయని వగచు చుండెను. తన పరివారముతో వలిమలపై వేటకోసమై తిరుగుచుండెను. సుందరవల్లి గెణుసుగెడ్డలు (చిలగడ దుంపలు దీనినే తమిళ భాషలో వళ్లి కియుంగు అందురు) ఉన్న గోతిలో స్థూలశరీరముగల ఆడశిశువై ఆకలితో ఏడ్చుచుండెను శిశురోదనము విన్న నంబిరాజు ఆ గోతిలో ఆడ శిశువును చూచి తన కోరిక నెరవేరినదని సంతోషించి, ఆ శిశువును ఎత్తుకొని తన భార్య చెంతకేగి పాలివ్వుమని ఆజ్ఞాపించెను.

ఆమె స్తన్యమిచ్చుటకు పాలు లేదని సందేహించు చుండినది. దైవకృపతో క్షీరసమృద్ధి కలుగగా ఆశ్చర్య మొందినది. అలా ఆ శిశువుకు పాలిచ్చి పెంచుచున్నది వేటగాండ్ర సాంప్రదాయాను సారముగా ఆ పిల్ల పెరిగి పెద్దదై జొన్న కంకులను గువ్వలు తినడానికి రాకుండా చేతిలో రాళ్ళనుంచుకొని రాతి మంచెల మీద నిలబడి విసరు చుండెడిది ఆమె అలాయీకొండ ప్రాంతమందలి వుత్తర భాగమంతా మంచెల మీద

అక్కడక్కడ వుండుటను మీరు వచ్చి చూడ వచ్చును. పైగా ఆమె సాన్నమాచరించు నపుడు రెండు కొండ రాళ్ల నడుమ పసుపు చాదిన చోట రాయి నునుపై చూపరులకది వాస్తవమని దృగ్గోచరమగును అదే చోట ఆమెచే పూజింపబడిన 'శివలింగము' నాలుగుస్తంభముల మంట పము మధ్య కానవచ్చును.

ఇంకొక విశేషమేమనగా 'శ్రీవల్లి' సాన్నమాచరించునపుడు ఆమె యొక్క దివ్య శరీరముపై పసుపు పూసి కొనగా ఎగిరిన పసుపు యొక్క చిహ్నములు అక్కడక్కడా రాతి మంచెల మీద చూడవచ్చును. అది పసుపేనని విశ్వసించుటకు ఒక తెల్ల బట్టను నీళ్లలో తడిపి ఆచోట తుడిచినచో ఆతెల్లనివస్త్రము పసుపురంగులోనికి మారునది చూడనగును ఇలా యీ వల్లిమాల లోని విశేషములు చెప్పచూ ఎంతైనా వ్రాయవచ్చు ను సందర్భాను సారముగా విశేషములను ఉటంకించెదను.

ఇలా వల్లీదేవి మంచెల మీద ఒయ్యారముగా నిలబడి పగలంతా జొన్నచేలను కాపాడుచుండినది. ఆమె దివ్యత్వమూ, తపోవర్చస్సు వల్ల ద్విగుణీకృతమైన తేజస్సు చూపరులనాకట్టుచుండినది.

ఇలా వుండగా దేవసేనా సమేతుడై స్కందగిరిలో నివసించు చుండిన షణ్ముఖస్వామి - తానొక్కడే మయూరవాహనుడై 'తిరుత్తణి' మలమీద విశ్వకర్మచేమందిరము నిర్మింపజేసి అక్కడ ప్రశాంత చిత్తుడై యుండెను. అందుకే మనశ్శాంతి కోరివచ్చువారికి తిరుత్తణి కొండపై వెలసిన శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారు సకలాభీష్టముల నిచ్చి మన శ్శాంతిని ప్రసాదించు దైవమాయెను.

ఒకనాడు త్రికాలవేత్త యైన నారదమునీంద్రుల వారు వల్లిమల లోని సుందర వల్లీదేవియొక్క అద్భుత లావణ్యమును జూచి, తిరుత్తణి లోని స్వామికి వివరించెను ఆమెను చేపట్టు సమయమాసన్న మైనదని శ్రీ వారు నిశ్చయించు కొనిరి.

శ్రీ వారు వేటగాని రూపములో వల్లిమలలో శ్రీ వల్లీదేవి చెంత చేరెను ఎవరో క్రొత్త యువకుడు యుక్తవయస్సులో నున్న తన దాపుకు రావడం గమనించి ఆమె మోహం చిట్లించుకొనినది.

అప్పుడు శ్రీవారు "ఓ సుందరీ! నేను అందముగా లేన? ఎందుకలా మొహం త్రిప్పుకుంటున్నావు? ఇదేనా మీ వేటగాండ్ర కులాచారము? యవ్వనములో ఉన్న నీవు సుందర యువకుడనైన నన్ను అకర్షించు చున్నావు బాలా! ఎందుకలా బేలవై దూరంగా నిలచుచున్నావు! తరుణ వయస్కులైన మనము చూడ ముచ్చటైనజంట గదా, రమ్మి! నాపొందు పసందు! రా! అని మాటల చాతుర్యముతో వల్లీదేవిని అకర్షింప ప్రయత్నించెను.

అప్పుడా లలామ, 'ఓయీ నీ వెవరవో నాకు తెలియకున్నది! కాని ఒక్కనిజం తెలిసికొనుము! నాతండ్రి నన్ను చాలా జాగ్రత్తగా కాపాడు చున్నాడు నీవునికిని అతడు గమనించెనా నిన్ను పుష్పపాతర వేయగలడు ఎందుకో నిన్ను కరుణించి నీ ప్రాణములను కాపాడవలెనని నామనస్సు చెప్పుచున్నది! కనుక వెంటనే పారిపొమ్ము నాతండ్రి నన్ను వెతకుచూ వచ్చుసమయమిది వృథాప్రయాసలు మాని వచ్చి నదారినపొమ్మనినది.

అప్పుడు నంబిరాజు తన పరివారముతో అక్కడికి వచ్చుచుండెను ఇది గమనించిన కుమారస్వామి ఒక వేంగిశ (వేంగైమరమ్ అని తమిళ ములో చెప్పుదురు) గా అక్కడ నిలిచెను నంబిరాజక్కడికి వచ్చి "అమ్మాయీ ఎలా ఉన్నావని అడిగెను! తండ్రీ! అంతా సక్రమంగానె యున్న" దని ప్రత్యుత్తర మిచ్చినది "అది సరే ఇంతకు ముందు ఈ మాను యిక్కడ లేదు కదా! మొక్క మొలచి మాను కావలసినదిపోయి యిలా ఒక్కసారిగాయిక్కడెలా ఈమాను నిలచినది" అనివల్లిని అడిగెను

'ఈ మ్రాను ఉండినది మీరు గమనించలేదేమో'! అని సమాధాన మివ్వగా నంబిరాజు మనస్సుకు ఇదేదో అబ్బురముగా ఉన్నదని తోచితన అనుచరులతో ఈ చెట్టును నరకండి అని అజ్ఞాపించెను. తర్వాత 'ఆగండి ఇది ఇక్కడ ఉడటం వల్ల అమ్మాయికి నీడ నిచ్చునేమో యని నాఅంత రంగము చెప్పుచున్నది' అని మరలా వాక్రుచ్చెను. అందువల్ల ఆ చెట్టు నరకకుండానే వారు వచ్చిన దారిన వెళ్లిపోయిరి. వారలా వెళ్లగానే ఆచెట్టు అద్భుతంగా పండ్లుకాసినది మరలా ఆచెట్టు రూపమును వీడి మునుపటి వేటగాని రూపము దాల్చి 'ఓ నెచ్చెలీ నీకు నా మీద అనురాగమున్నదని యిప్పుడు జరిగిన దానిని బట్టి నాకు అర్థమయినది! లేకపోతే నీతండ్రితో చెప్పి నాజాడను తెలియజేసియుందువు' అనెను

'నీతో మాటలు నాకు అనవసరమ'ని వల్లీదేవి మరోచోటికి నడిచి పోయెను. అక్కడ నంబిరాజు తన పరివారముతో కొంత దూరమున పోవుచుండెను. అప్పుడు శ్రీవారు వేటగాని రూపము వీడి ఒక వృద్ధసన్యాసి రూపమును దాల్చి ఆమె వెంట పడెను అడిగమనించిన వల్లీదేవి సన్యాసీ ఎవరునువ్వు? ఎందుకీ కొండపై యీవృద్ధాప్యమందు కాళ్లూ చేతులూ నిస్సత్తువై యున్ననూ నడచుచూన్నావని అడిగినది ఈలోగా, నంబిరాజ క్కడికి వచ్చి స్వామీ మీరెవ్వరు? ఎండకీ ప్రాంతమందు ముసలి పాయ మందు తిరుగాడుచున్నా రని ప్రశ్నించెను.

అందులకు శ్రీవారు నాకు వయస్సుతో పనియేమున్నది ఏదో కాల క్షేపము చేయుచున్నా నని బదులు పల్కెను 'ఓహో అలాగా అయితే మా అమ్మాయికి తోడుగా మీరు ఇక్కడే వుండవచ్చును'! అని పలికి నంబిరాజు తనవారిని తోడ్కొని సోమనాథపురమునకేగెను.

శ్రీవారి వృద్ధ రూపమందు గల దివ్యతేజస్సుకు శ్రీవల్లి నిరుత్తరా లైనది ఆమె ఎక్కడికి నడిచినా వృద్ధుడు వెంటనడవసాగెను ఇదిగమ నించి ఆకన్యామణి ఎందుకలా వెంట బడెదరు? ఒక్కచోటఉండలేరా నావెంటపడుట యీవయస్సులో సరియైనదా? అని శ్రీవారిని కఠినముగా అడిగినది.

శ్రీవారికి తానెవ్వరో యీ కన్యారత్నమునకు తెలియక యింకనూ తన్ను నిర్లక్ష్యము చేయుటకు కారణమేమైయుండును - అని క్షణ కాలము తలపోసెను వెంటనే తాను చేసిన తప్పిదము స్ఫురించినది. విఘ్నములకు కారకుడైన శ్రీ విఘ్నేశ్వరుని తానుస్మరించి ఆయన ఆశీస్సులు పొందకనే వచ్చిన కారణము వల్ల యిలా విఘ్నములు కలుగుచున్నవని గ్రహించెను. వెంటనే, అగ్రజా! రమ్ము! నాయీకార్య సాఫల్యమునకు తోడ్పడుమని వినాయకుని ప్రార్థించెను.

షణ్ముఖుని ప్రార్థనను ఆలకించిన గణపతి ఏనుగు రూపమున వచ్చి వల్లిని తరమసాగెను ఆమెబయపడి వృద్ధుని చెంతకు పరుగిడివచ్చి ఆయనను గట్టిగాకౌగలించుకొనుచూ నను కాపాడు మనెను అన్నా మఱుగు పడుమని మనస్సులోనే శ్రీవారు ప్రార్థించగా గణేశుడు అదృశ్యమాయెను ఈనాటికి ఆయన ఏనుగురూపములో వచ్చినందుకు నిదర్శనముగా శిలారూపమున (ఏనుగువలె) వల్లిమల వృత్తర కొసన చూడవచ్చును ఇంకను తాను వల్లిని పరీక్షించరాదని మురుగడు భావించెను.

వెంటనే అరుముఖములతోనూ- పన్నెండు చేతులతోనూ దివ్యాయుధములు ధరించి కుడి చెవి ప్రక్కన శక్తి ఆయుధమును ఎడమ చెవి సమీపమున కోడిపుంజు ధ్వజముతోనూ, మయూరవాహనమందు కూర్చొని శ్రీవల్లికి తన దివ్యరూపమును ప్రదర్శించెను. శ్రీవల్లితన ఆరాధ్య దైవమును దర్శించగానే పూర్వ జన్మమందలి జ్ఞానమును పొందినది. తానెవరికోసమై సూక్ష్మరూపము ధరించి యిరవైవేల సంవత్సరములు ఈకొండపై తపమాచరించినదో (జ్ఞాన దృష్టి పొందినదై) తెలిసికొనెను

"స్వామీ ! కరుణాసాగరా ! ఇన్ని పరీక్షలు చేసినగాని నన్ను స్వీకరించ నైతివా? ఎంతకాలమని నీకోసము వేచియున్నాను? ఇప్పటికైనా నన్ను అనుగ్రహింపు " మని శ్రీవారి పాదపద్మములపై తన శిరముంచి ప్రార్థించినది శ్రీవారు శ్రీవల్లిని ఆదరించుచూ కౌగిట జేర్చి దేవీ ! నీతపోబలము నాతల్లి పార్వతీదేవి నాతండ్రి పరమేశ్వరుని వుద్దేశించి చేసినతపోశక్తికి మించినది. నీవునాకు అత్యంతప్రియురాలవైనావు కనుకనే నిన్నింతకాలము తపోమూర్తివైన పిమ్మట నాదేవిగా స్వీకరించుచున్నాననెను.

తర్వాత శ్రీ వల్లి సుబ్రహ్మణ్యులిరువురూ వల్లిమలలోని ఉత్తర దిగ్భాన సూర్యరశ్మి సోకని రాతి బండక్రిందగల జలాశయమందు క్రీడించిరి కొంతసేపలా విహరించిన తర్వాత శ్రీవల్లిని తన తండ్రియైన నంబిరాజు వెతకునని యెంచి "యింటికి పోయిర" మ్మనెను

శ్రీవల్లిదేవిలో వైవాహిక సుఖచిహ్నములు గోచరించగా నంబిరాజు భార్య ఆమెను ఇంటిలోనే నిర్బంధించినది శ్రీవల్లి యొక్క చెలికత్తెను కాపలావుంచినది.

శ్రీవారికి వల్లీదేవిని చూడమనసైనది ఆమె నిర్బంధములో నుండు గృహమున కేగెను చెలికత్తెకు నిదురరాగా వల్లిని తోడ్కొని శ్రీవారు వల్లిమలలో విహరించ సాగెను.

నంబిరాజుభార్య వల్లిని యింటిలో వెతికినది ఆమె కనపడకపోగా నంబిరాజుతో జరిగినది చెప్పినది నంబిరాజు తన పరివారమును పిలుచుకొని యుద్ధ సన్నాహముతో కొండపై వచ్చి వల్లినీ-వల్లీశుని అన్వేషించెను.

ఇరువురూ ఒకరి ప్రక్కన నొక్కరు కూర్చొని వినోదించుచుండగా నంబిరాజక్కడ చేరెను. కోపావేశముతో తన పరివార సహితముగా శ్రీవారిపై యుద్ధము చేసెను. శ్రీవారు కోపించగా కోడిపుంజుగా నుండు శూరపద్మాసురుడు బిగ్గఱగా కూసినాడు ఈకూత భయానకమై అందరూ క్రింద పడిచచ్చిరి.

అప్పుడు వల్లీదేవి శ్రీ వారిని 'దేవా మీరెవరో! తెలియక అజ్ఞానులై ప్రవర్తించిరి వారితప్పును సైలించి కాపాడు' మనివేడెను. ఆమె వేడికోలును అనుసరించి వారిని పునరుజ్జీవుల జేసెను. తన నిజస్వరూపమును వారికి చూపెను. నంబిరాజు చెంపఱువాయించుకొని స్వామినర్చించెను

వారి కులాచారము మేరకు వివాహతంతు నడిపి వల్లీ సుబ్రహ్మణ్యులకు వివాహమొనరించెను అతి వైభవముగా జరిగిన శ్రీవల్లీ సుబ్రహ్మణ్యుల కళ్యాణమును గగన వీధిలో నిలచి పార్వతి పరమేశ్వరులు, లక్ష్మినారాయణులు, సరస్వతీ చతుర్ముఖులు, ఇంద్రాదిదేవతలు ఋషిగణములు భూతగణములు జూచుచూ తమ దివ్యాశీస్సులను వారికి అందించిరి.

తర్వాత నంబిరాజుకడ వీడ్కోలు పొందినవారై వారిరువురూ వల్లీమల గర్భగుడి లోనిగుహ మార్గమున తిరుత్తణి చేరిరి. అక్కడ తన దర్శనార్థమై వచ్చు భక్తులకు శ్రీవారెలా అభీష్టసిద్ధులనిచ్చునో వల్లీదేవికి వివరించిరి.

అలా కొంతకాలము 'తిరుత్తణి' కొండపై నివసించిత తర్వాత శ్రీవల్లిని తోడ్కొని వల్లిపతి దేవసేనయుండు స్కందగిరికి పోవలెనని నిశ్చయించుకొనెను. ఈలోగా నారదమహర్షి దేవసేనను సమీపించి "అమ్మా నీ భర్త షణ్ముఖుడు నీకొక సపత్నిని తోడ్కొని వచ్చుచున్నాడని ముందుగా హెచ్చరించినాడు

దేవసేనకు సపత్నిమాత్సర్యము కలిగినది శ్రీవారు రాగానే నిలదీయవలెనని అనుకొనినది నారదమునీంద్రులు తిరుత్తణికి వచ్చి శ్రీవారికి నమస్కరించి "దేవసేనాపతి! నీవు వల్లిపతికూడా అయినావని దేవసేనకు తెలిసి, కోపముగానున్నద" నెను.

"నారదా! ఇదంతా నీ పనియే కదా? " అనెను "నారాయణా నారాయణా! నాకేమి కావలె యున్నది స్వామి! తమ చిద్విలాసమే కదా యిదంతా? " అని చిరునవ్వు నవ్వెను.

"సరే కానున్నది కానిమ్ము! వెళ్లుము! మేము వచ్చుచున్నాము అని దేవసేనతో మరోమారు సెలవిమ్ము" అనెను. నారదుడు స్కందగిరి చేరెను. తర్వాత వల్లీసమేతుడై సుబ్రహ్మణ్యస్వామి మయూరవాహనుడై స్కందగిరి చేరెను. దేవసేన శ్రీవారిముందు కోపావేశముతో వచ్చెను.

'ఎక్కడ నాసపత్ని? నాకంటే అందగత్తెకదా! ఆమెను చూపుడు!' అని శ్రీవారిని నిలదీసి ప్రశ్నించినది ఏమీయెఱుగని వానివలె నారదుల వారిని అర్థంతముగా శ్రీవారు చూచిరి.

"అమ్మా! దేవసేనా! శ్రీవారి పుష్పహారముతో నీసపత్నిని మఱుగు పఱచియున్నాడని యెఱుంగుము!', అనెను.

"ఏదీ చూపు" మని గద్దించినది ఆమె శ్రీవారు ఆమెకు భయపడు న్నట్లు నటింపసాగిరి అప్పుడు నారదమునియే శ్రీవారి పూలదండచాటున గల వల్లిదేవిని ఆ హారమును ప్రక్కకు తొలగించి చూపుమని స్వామిని ప్రార్థించెను శ్రీవారట్లేచేసిరి. "దేవసేనా! మంగళ హారతినిచ్చి మమ్ములను లోపలికి రానిమ్ము! నీసోదరి సుందరవల్లియే యీ వల్లిదేవి యని తెలిసికొనలేక - ఎందుకిలా వ్యాజ్యమునకిడ్చెద" వని సయుగారముతో ఛలోక్తిగా శ్రీవారు పలికిరి.

దేవసేనకు తనసోదరి భూలోకమందు శ్రీవారితొ వివాహము కోరి తపము చేయుచుండినదను విషయము అప్పటికి అవగాహనమైనది

"క్షమించండి స్వామీ! తెలియక అపచారమొనరించితి" నని శ్రీవారిని వేడినది. వెంటనే వారికి మంగళ హారతి నిచ్చి మందిరములోనికి వారిని చేయిపట్టి తోడ్కొని వెళ్లినది. సుందరవల్లికి కూడా తన అక్క అమృతవల్లి పూర్వజన్మ వృత్తాంతము అవగతమైనది. సోదరీమణు లిద్దరూ ఒకరినొకరు కౌగిలించుకొని కుశల ప్రశ్నలు వేసికొనిరి.

ఇలా శ్రీవారు వల్లీదేవసేనా సమేతుడై ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి అనే మూడు శక్తులకు తామే కారకులని చూపుతూ భక్తుల మనోభీష్టములు నెరవేర్చుచున్నారు.

లౌకికపరమైన అష్టభోగములనిచ్చు శక్తి వల్లీదేవిది! పరలోక సుఖమునర్థించువారికి దేవసేన ప్రసన్నురాలయినగాని అది లభ్యము కాదు! జ్ఞానశక్తిని కోరువారు తన్నే ఆరాధించవలెనని శ్రీ సుబ్రహ్మణ్య స్వామి సెలవిచ్చియున్నారు.

## ము ఖ్యాం శ ము లు

మన జాతక చక్రములో పన్నెండు రాశులు/భావములున్నవి వానిలో సృష్టికి ప్రారంభరాశికి మేషరాశియైన అధిపతి అంగారకుడు

## అం గా ర క స్తు తి

శ్లో॥ ధరణీగర్భ సంభూతం। విద్యుత్ కాంతి సమప్రభమ్।
కుమారం శక్తిహస్తం। తం మంగళం ప్రణమామ్యహం॥

ఈ శ్లోకములో కుమారం-శక్తిహస్తం అనే రెండు పదాలలోనూ కుమార స్వామినీ, శక్తి ఆయుధమును గురించి చెప్పబడినది ఈ అంగారకునికి అధిదేవత శ్రీ సుబ్రహ్మణ్యస్వామి.

మేషరాశికి ఎనిమిదవ రాశియైన వృశ్చికరాశికూడా అంగారకునిదే కాగా మేష వృశ్చిక రాశులవారికి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు ఆరాధింప బడు దైవమూర్తియగుచున్నాడు.

## శ్రీ సు బ్ర హ్మ ణ్య గా య త్రి

ఓం తత్పురుషాయ విద్మహే. మహాసేనాయధీమహి।
తన్నోషణ్ముఖ. ప్రచోదయాత్॥

ఇప్పుడు అరుముఖములు సుబ్రహ్మణ్యునికి ఎలా అమరినవో తెలిసికొందాము

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ఆదిశక్తి | : ఐశ్వర్యము | 2 | ఇచ్ఛాశక్తి | : వీర్యము |
| 3 | క్రియాశక్తి | : కీర్తి | 4 | పరాశక్తి | : శ్రీ |
| 5 | జ్ఞానశక్తి | : జ్ఞానము | 6 | కుండలినీశక్తి | : వైరాగ్యము |

ఈ అరుశక్తుల సమన్వయమును షణ్ముఖుని అరుముఖముల నుండి గ్రహింపనగును. సంఖ్యాశాస్త్రము ప్రకారము "6" శుక్రుని సంఖ్య శుక్రుని బలమున్ననే దాంపత్యసుఖము, సరససల్లాపములు,

భోగములు (పట్టుపీతాంబరములు, పరిమళ ద్రవ్యములు, శయ్యా సుఖము యిత్యాదులు) మనకు లభించును. ఇవన్నీ మేషరాశికి 2వ రాశియైన ధన, కుటుంబ, వాక్కులకు స్థానమగు వృషభరాశికి అధిపతి యైనశుక్రుడివ్వ గలడు. మేషరాశికి 7వరాశి తులారాశి కళత్రమును సూచించునది ఆ తులారాశికి కూడా శుక్రుడే అధిపతి కాగా శుక్రునికి అధిదేవత మహాలక్ష్మి

అనగా 6 సంఖ్యకు అధిపతి శుక్రుడు ఆరుముఖములు గలవాడు షణ్ముఖుడని పిలువబడు శ్రీసుబ్రహ్మణ్యస్వామి ఈ ధన కుటుంబ వాక్కులను కళత్ర/పురుష సుఖములను కూడా శుక్రుని ద్వారా తానే యివ్వగలుగుటయేగాక తన అత్తగారైన మహాలక్ష్మి ద్వారా అష్టైశ్వర్యము లను కూడా తానేయివ్వగల సమర్థుడగు చున్నాడు

మేషమునకు భాగ్య (9వ) రాశి ధనుస్సుదానికి అధిపతి గురువు కాగా గురుమూర్తిగా కూడా తానే జ్ఞానమిచ్చు అధికారి యగుచున్నాడు సాధారణముగా పరమశివుడుసతీదేవినిద క్షయజ్ఞ వాటికలో కోల్పోయిన అనందరముద క్షిణామూర్తియై జగద్గురువుగా విలసిల్లుచుండుటను మనమిది వఱకే చెప్పుకొన్నాము "వల్లిమల"లో ఏకశిలా గర్భమందు గుహుడు శ్రీవల్లిదేవసేనాసమేతుడై దక్షిణాభిముఖముగా నిలిచి భక్తి,జ్ఞాన వైరాగ్యములను కూడా నివ్వగల గురుమూర్తి యైనాడు "స్వామిమల"లో దక్షిణామూర్తి పరబ్రహ్మయైన మహేశ్వరునికే స్వామియై "స్వామినాథు" డనిపించు కొనినాడు.

కాబట్టి యిటు ఇహలోక సౌఖ్యములతో బాటుపరలోక బ్రహ్మైక్య మును కూడా తానే యివ్వగల సమర్థుడాయన కేరళ రాష్ట్రములో ఆలెప్పి జిల్లాలో "హరిపాడ్" అనే వూరిలో చతుర్భుజములతో శ్రీసుబ్రహ్మణ్య స్వామి దర్శన మిచ్చుచున్నాడు ఉటిపి సమీపము "పుట్ట" రూపమున 'సుబ్రహ్మణ్య' అనే శ్రీవారిపేరుతోనంబూద్రి బ్రాహ్మణులు పూజలు సలుపుట చూడనగును.

'పళని' (తమిళనాడు) లో వైద్యుడైనాడు ప్రంచామృతముతన నవపాషాణ విగ్రహముపై అభిషేకించగా అది పరమౌషధమై రోగులను తాను కాపాడుచున్నాడు.

"తిరుప్పరంగున్రమ్" (తమిళనాట మధురైకు అతి సమీపమున వున్నది)లో వివాహము కానివారికి వివాహమగు భాగ్యమునిచ్చు దేవసేనా పతిగా కూర్చొనుభంగిమలో దర్శన మిచ్చుచున్నాడు.

"తిరుచ్చెందూరు" (తమిళనాట రామేశ్వరానికి వుత్తరాన బంగాళా ఖాతసముద్రము యొక్క అలలు తన ఆలయ ప్రాకారమును మోదు చుండగా దక్షిణాభిముఖుడై శ్రీవల్లీ దేవసేనా సమేతుడై నిలచియుండి శత్రు, రోగ, ఋణాదులనుండి భక్తులను రక్షించుచున్నాడు.

"పయముదిర్ శోలై" (మధురైసమీపము)లో శ్రీవల్లీ దేవసేనా సమేతుడై అహ్లాదము కలిగించు వనశోభగల దివ్యక్షేత్రవాసియై, దాంపత్య సుఖము కొఱవడిన భార్యాభర్తలను అనురాగ బంధముతో కలిపి కల కాలము వారు దాంపత్యసుఖములను పొంది, సంతానవంతులగుటకు నిలిచి యున్నాడు.

"తిరుత్తణి"లో ఎన్ని భోగములనుభవించి ననూ సుఖశాంతులు లేనివారికి సుఖశాంతుల నిచ్చి బ్రోచుటకై శ్రీవల్లిదేవసేనలతో నిలచి యున్నాడు ఇక్కడే వల్లిదేవిని రెండవభార్యగా తెచ్చుకొన్నాడని కోపించిన ఐరావతము మూలస్థానమునకు ఎదురుగా వీపు చూపించి (దేవసేనను పెంచిన తన మమతాను రాగములను ప్రస్ఫుటము చేయుట) యుండు టను గమనించవచ్చును.

ఇలా 'పళణి' (1), 'స్వామిమల' (2); తిరుచ్చెందూరు (3); తిరుప్పరంగున్రమ్ (4); పయముదిర్‌శోలై (5); తిరుత్తణి (6) తన ఆరు ముఖములకు ప్రతీకగా ఆరుదివ్యక్షేత్రములై కుమారస్వామి వైభవమును మహిమలను చాటిచెప్పుచున్నది. ప్రభవాది సంవత్సరములు అరవై. స్వామిమలలో దేవాలయమునకు సోపానములు అరవై. సంవత్సరమునకు దినములు 365. తిరుత్తణిలో గుడిమెట్లు 365. కాలచక్రమున ఇలాతానే మూలమని శ్రీసుబ్రహ్మణ్యుడు నిరూపించుచున్నాడు.

భారతదేశమందలి అన్ని పుణ్యక్షేత్రముల మహిమలు ఈ ఆరు నివాస క్షేత్రములలో ఇమిడియున్నది ఈ ఆరుక్షేత్రముల మొత్తము మహి మలను ఒక్క "వల్లిమల" క్షేత్రమే గ్రహించియున్నదని తమిళములో వ్రాయబడిన "వల్లిమలస్థలపురాణ" మందు చెప్పబడినది.

కావున పాఠకులారా! మనము అన్ని పుణ్య క్షేత్రములను దర్శించ లేకపోవచ్చును అలాంటప్పుడు "వల్లిమల"ను దర్శించి శ్రీవల్లి సుబ్రహ్మణ్యులు నడయాడిన యీ ప్రదేశమును తిరిగి చూచుటవల్ల; వీలైతే యీ కొండచుట్టూ (తారురోడ్డు ఉన్నది) చుట్టివచ్చుట వలన పూర్వ జన్మ పాపములన్నీ పరిహరమై, సకల యీప్సితములను పొందవచ్చునని ఉద్ఘాటించుచున్నాను. వివాహము కావలసినవారు; విద్యకోరువారు; ఉద్యోగవ్యాపారాలు వలయువారు; రోగపీడ, శతృపీడ, ఋణపిడల నుండి నివృత్తి కోరువారు ఒక్కటేమిటి ఏసులభసాధ్యమైన సత్సంకల్ప మైనను శ్రీవల్లిని కోరుటవలన అన్నియూ ఒన గూడునని విశ్వసించుచూ జీవితమందొకసారైనా యీ వల్లిమల క్షేత్రమును దర్శించి, తరించమని కోరుచున్నాను.

సాధారణముగా నేను వ్రాయు పుస్తకముచివరిన అందుకు సంబంధ పడిన ముఖ్యమైన శ్లోకములను పొందు పఱచు వాడుక కలదు. తద్వారా పాఠకులకు అందుబాటుగా అవివారి భక్తి ప్రపత్తులకు తోడ్పడు నని నానమ్మకము ఇంతటి ఈ "శ్రీస్కాందపురాణ సారామృతము" యొక్క కథాది వస్తువును ముగించుచూ పాఠకులకు ఉపయోగపడే కుమారస్వామికి సంబంధపడిన కొన్ని శ్లోకములను పొందుపఱచెదను.

మంగళం మహత్ !

లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు !

సర్వేజనాస్సుఖినోభవన్తు !

ఓం శాన్తిః ! ఓం శాన్తిః ! ఓం శాన్తిః !

## ఉపకథలు

తొల్లినారదమునీంద్రుడు కైలాసమునకు ఒక జ్ఞానఫలమును తెచ్చి పరమేశ్వరునికిచ్చి మీకిష్టమైన వారికి ఇవ్వుడనెను. "నాకు కావలెనంటే నాకు కావలె"నని వినాయకుడూ, సుబ్రహ్మణ్యుడూ పోటీపడిరి. "విశ్వమంతటినీ ముందుగా ప్రదక్షిణము చేసివచ్చెదరో వారికి యీపండు నిచ్చెద" నని శివుడు చెప్పినదే తడవు కుమారస్వామి నెమలినెక్కి విశ్వ ప్రదక్షిణమునకు బయలుదేరెను. సూక్ష్మబుద్ధి స్థూల శరీరముగల వినాయకుడు పార్వతీపరమేశ్వరులను చుట్టివచ్చి 'మిమ్ములను చుట్టవస్తే మీలో నేగల సకల భువనములను చుట్టివచ్చినట్లే కదా! ఆ జ్ఞానఫలమును ఇవుడ్వ'ని చెప్పెను. అంతేమరి! ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులే కదా సర్వస్వము! మారుమాటాడక ఆపండును విఘ్నేశ్వరుని చేతిలో పెట్టగానే శిఖివాహనుడు విశ్వప్రదక్షిణ మొనరించి కైలాసము చేరెను. జరిగినదంతా గ్రహించినవాడై కోపించి చేతిలో దండము, శిరోముండనము తోనూ, శిరము చుట్టిన రుద్రాక్షలతోనూ, మెడలోనూ, ముంజేతిలోనూ రుద్రాక్షలు ధరించి కౌపీనము మాత్రము వస్త్రముగా ధరించినవాడై దక్షిణాపథమునకు వెడలెను. పార్వతీపరమేశ్వరులు ఎంతోనచ్చచెప్పిరి. 'ఔవ్వై' అనే సశరీరధారిగా భక్తి తత్పరత వలన కైలాసము చేరిన ముదుసలిస్త్రీ "మురుగా జ్ఞానఫలమే నీవైనపుడు, నీకా జ్ఞానఫలమేల?" అని ఆమెకూడా నచ్చచెప్పెను. కానీ వినలేదు. హిడింబాసురుడు రెండు కొండలను కావడిగా చేసికొని భుజముమీద మోయుచూ బదరిక తిరుగుటకు ఒకచోట వానిని దింపెను. అప్పుడు సుబ్రహ్మణ్యుడు ఒక కొండపై నిలిచెను.

దండపాణి నిలచిన కొండపై మరలా కావడిపై నిడుకొని ఎత్తుకొన వలెనని వాడెంత ప్రయత్నించిననూ వీలుకాక, కొండపై నిలచిన యీ బాలసన్యాసి యెవ్వడని ఆలోచించెను. బాలసుబ్రహ్మణ్యుడు హిడింబా సురుని తన భక్తుడిగా గ్రహించి "హిడింబాసురుడా! నాకోసం నాభక్తులు నీవలెకావడి యెత్తుకొని నాకొండకు వచ్చి దానిలోతెచ్చిన పూజాద్రవ్యము లతో నన్ను అర్చించినచో వారిసకలాభీష్టములను నెరవేర్చెదను! అలా కావడితెచ్చునాభక్తులు ముందుగా నిన్ను దర్శించి నా కొండకు వత్తురు"

అని వానిని అనుగ్రహించెను. అప్పటినుండి మురుగభక్తులు తమ కష్టము లను దీర్పికాపాడు కలియుగదైవమని కావడులనెత్తుకొని స్కందగిరు లకు వెళ్లెదరు.

ఒక సమయమున అర్కాడులోని భక్తుడొకడు ఇంటిలో కావడిపూజ చేసి తిరుత్తణికి బయల్దేరు సమయమున ఒక్కాగానొక్క కుమారుడు ఉన్నట్లుండి చనిపోయెనట. అయిననూ వారు దుఃఖించకుండా కావడి నెత్తికొని తిరుత్తణి కేగి స్వామిని పూజించి అర్కాడుకు మరల వచ్చిరట అప్పుడు చనిపోయిన బాలుడు పరుగెత్తుకొంటూ వచ్చి తన తల్లిదండ్రు లను కలిసికొనెనట అప్పటినుండి నేటికీ అర్కాడు వారి కావడులను ముందుగా ప్రవేశపెట్టు వాడుక తిరుత్తణిలో ఉంటున్నది.

సరే! పార్వతి కుమారుని కోసం పళని వచ్చి తనతో రమ్మని కోరినది. జ్ఞానపండితుడయ్యు "పోలుకా" దనెను పళని కొండనుండి అదృశ్యుడయి బళ్లారి సమీపము సాండూరు (సుండూరు) అడవులలో నిలిచిన బాలసుబ్రహ్మణ్యుని మరలా పరాశక్తి వెతకుచూ వచ్చినది.

"కుమారా! నాజ్ఞానక్షీరమును త్రాగిన నీవు నాపిలుపును నిర్లక్ష్యము చేయతగద''ని ఆదిశక్తి చెప్పెను. వెంటనే "ఇదిగో నీజ్ఞానక్షీర" మని తల్లి పాలంతయూ (రక్తరూపమునవుండినదంతా) కుమారస్వామి క్రక్కివేసె నట. అలా క్రిందపడిన రక్తమే అక్కడ విభూతిగా లభించుచున్నది. "శివపురిప్యాలెస్" లోని రాజవంశమువారి ఆధీనములో సాండూరు సుబ్రహ్మణ్యస్వామి ఆలయము నిర్వహింపబడు చున్నది కార్తీకమాస మందు నిత్యపూజలు, ఉత్సవములు అక్కడ జరుగును మిగిలిన దిన ములలో అక్కడ ప్రత్యేక వాహనముల ద్వారా చేరవచ్చును. స్త్రీలంటే నే అక్కడి సుబ్రహ్మణ్యునికి గిట్టని కారణాన ఆలయములోపల స్త్రీ ప్రవేశము నిషేధము! ఒక సమయము తెర తొలగిన కారణాన ఒక స్త్రీకి సుబ్రహ్మణ్యుని దర్శనము లభించెనట, తక్షణమే ఆమెకు అధికరక్తస్రావమై మరణించెనట!

మరొక్కగాథ! పంజాబు రాష్ట్రంలోని భాక్రా నంగల్ ప్రాజెక్టు నుండి 72 కిలోమీటర్ల బస్సుప్రయాణం చేసిన యెడల ''బాబా బాలక నాథ్'' అనే పేరుతో బాలసుబ్రహ్మణ్యస్వామి మర్రిచెట్టునానుకొని కూర్చొని

యుండుట ఆ ప్రాంతంలోని భక్తులకు తెలిసినదే! శ్రీ విరాట్‌పోతులూరి వీరబ్రహ్మంగారి కథకు సారూప్యమైన గాథను తెలిపెదను.

'బాలక్‌నాథ్'అనే పేరుతో పిలువబడిన యీ బాలసుబ్రహ్మణ్యుడు ఒక జనపద లోని ఒక కుటుంబంలోని పశువులమందను అడవులలో మేపుటకు అంగీకరించెనట. ఆగృహిణి యిందుకుగాను మూడుపూటలా గోధుమరొట్టెలను అతనికి పెట్టుచున్నది. బాలక్‌నాథ్ పశువులన్నింటిని ఒకేచోట యుంచి చుట్టూ కర్రతోగీతగీసి, పర్వతగుహలో తపస్సుచేసికొని మరలా సాయంసంధ్యా సమయమున వానిని విడిపించి యింటికి తోలు చుండెనట. అవి పగలంతా గడ్డిమేయలేదు. నీరు తాగలేదు కానీ వాని కడుపులు నిండినట్లు ఉండెడివి. సమృద్ధిగా పాడినిచ్చుచుండినవి. కొన్నాళ్ళు ఇలా సాగుచుండినది. అదే పల్లెలోని తతిమా జనపదులు తమ పశువులను వేర్వేరుచోట్లలో కావలావుండి మేయుచుండగా-బాలక్ నాథ్ మాత్రము ఒకచోట బంధనములోనుంచి గుహలలో తపోదీక్షలో ఉండేడివాడట.

ఇది గమనించిన తతిమావారు ఆగృహిణియొద్ద యీ విషయము వివరించిరట. అందుకామె కోపించి, "ఓయీ! బాలకా! నీకిది తగునా? ఎందుకని నా పశువులను ఒకేచోట కట్టివేసినట్లు వదలివేసి, వానిని మేయనీయలేదు?" అని ప్రశ్నించెనట.

"అమ్మా! నీపశువుల కడుపులు నిండలేదా? అవి విస్తారంగా పాలిచ్చు చుండుటలేదా? నీకు కావలసింది అందేకదా! నా విషయమేల పట్టించుకొందు"వని అడిగెనట.

"నేను పెట్టిన రొట్టెలు మాత్రము తినుచుంటివి! కానీ పశువులకు కాపలా వుండుటలేదు" అని ఆమె చెప్పిన వెంటనే బాలక్‌నాథ్ "ఇదిగో నీ రొట్టెలు" అని చెప్పుచూ నోటినుంటి ఆమె పెట్టిన రొట్టెలన్నింటినీ పేర్చి పెట్టినటుల ఆమె ముందు క్రక్కెనట. వెంటనే దాపులోనుండు మర్రిచెట్టు వీపునానించి ఆసీనుడయ్యెనట. ఈవృత్తాంతము అక్కడికి వెళ్లిన వారికి అక్కడి వారు చెప్పెదరు! ఉత్తర దేశంలో మహనీయులను 'బాబా' అని గౌరవముగా పిలుతురు. కాన 'బాబాబాలక్ నాథ్' అని శివశక్తి బాలుని పిలుచుచుందురు.

ఆంధ్రదేశమందు కడప జిల్లానుండి మరికొన్ని ప్రాంతములలో 'సుబ్బరాయడు' 'సుబ్బరాయలు' సుబ్బరావు అనే పేర్లతో సుబ్రహ్మణ్య నామములు వాడుకలో గలవు. భుజంగ (పాము) రూపములో సుబ్రహ్మణ్యుని పూజించుట కూడా కద్దు

ఇప్పుడు శ్రీవల్లీ శ్రీ సుబ్రహ్మణులకు గల పేర్లనూ చెప్పి తర్వాత వానిని వ్రాసెదను.

## శ్రీవల్లికి గల పేర్లు

1 అమృత స్వరూపి, 2 అమృతానంది; 3 ఇచ్ఛాశక్తి, 4 లావణ్య; తులోత్తమ; 5 కళాలత; 6 రక్షకనారి! 7 కిరాతకుల తిలకము, 8 కిరాతలక్ష్మి; 9 సంతానమాత; 10 సుజ్ఞాన రంభ; 11 జ్యోతిప్రకాశ కిరణ్మయి, 12 జ్ఞానతపోగ్ని; 13 భట్టారిక, 14 నారీనాయకి, 15 మృగ గర్భవాసిని; 16 మాయాదేవి; 17 త్ర్యక్షరీ 18 మూలజ్ఞానశ్రీ 19 కిరాతపతి తనయ; 20 వేద్యస్వరూపి; 21 అపరేశ జ్ఞానవల్లి 22 లవలీ

## శ్రీ సుబ్రహ్మణ్యుని అద్భుత నామావళి :

1) దాస రక్షక : 2) సంకష్టహరుడు, 3) వేదసారస్వరూపి 4) సహస్రకస్కంద; 5) హారాధరుడు; 6) మకరందభక్తుడు 7) బధిరదేవసోదరుడు; 8) నిత్యయువ్వనుడు; 9) దేవతా చక్రవర్తి 10) విద్యాసాగరతీరపండిత; 11) కవీశ్వరసహాయక చక్రవర్తి; 12) కవిరాజ దేవమణి; 13) బాలగురునాథ; 14) కిరాతవపుషమూర్తి; 15) సకలకళాధరుడు; 16) సత్య వాక్యపరిపాలకుడు; 17) త్ర్యక్షరీభాషాదురంధరుడు; 18) జ్ఞాన పండితస్వామి; 19) పితాగురు; 20) నారదగీతవినోదుడు 21) బాలనాథుడు; 22) త్ర్యక్షరీభాషావినోదుడు; 23) ముక్తిబీజుడు 24) మురుగానందం; 25) సంపూర్ణసేవకుడు 26) వల్లీభృత్యుడు; 27) తారకారి.

ఈ అపురూపమైన శ్రీవల్లి! శ్రీ సుబ్రహ్మణ్యుల నామావళిని నిత్యమూ స్మరించువారికి (మిగిలిన మంత్రములు చదువ వీలు కాకపోయిననూ) సర్వ సౌఖ్యములొనగూరునని ప్రాజ్ఞుల అభిప్రాయము.

శ్రీ అరుణగిరినాథస్వామి ద్రవిడభాషలో "తిరుప్పుగళ్" "స్కంద అనుభూతి" ఇత్యాది మంత్ర సహిత సుబ్రహ్మణ్యస్తుతులను వ్రాయగా శ్రీ పాంబన్ దేవరాయన్ "స్కందషష్ఠి కవచము" వ్రాసెను. ఈ చిరు పొత్తములను తమిళనాట నిత్యము పఠించి, యెందరో భక్తులు స్కంద కరుణానందములో పరవశులగుచున్నారు.

దేవసేనయొక్క దివ్య నామములు

1) అంచమయూరశ్రీ; 2) దేవపారిజాతము; 3) నాకశుకము [స్వర్గలోకపు చిలుక]; 4) దేవకుంజరి [ఐరావతం]; 5) వేదశ్రీ; 6) శశిమయూరి; 7) కుంజరీమృగి.

## ఆరు దివ్య క్షేత్రములు

1] తిరుచ్చెందూరు జయంతీపురము/సింధుపురము గంధాద్రి లేదా గంధమాదన పర్వతం (శ్రీ ఆదిశంకరులవారు జయంతీపుర వడా న్నన స్తోత్రం వ్రాసియున్నారు).

2] తిరుప్పరంకున్రమ్-పరాచలపుర క్షేత్రము.

3] పయణి - వరాహగిరి/శివగిరి/శివపురి (తిరువావినన్‌కుడి అనికూడా అంటారు). [నవపాషాణ పళనీస్వామి విగ్రహమును మూలికాపాషాణములు తొమ్మిదింటిని ఏకకృతముచేసిన మహనీయుడు "భోగమహర్షి"]

4] స్వామిమల-స్వామిశైలము

5] పయముదిర్‌చోలై ఫలపూర్ణాచలక్షేత్రము

6] తిరుత్తణి-క్షణికాచలము (క్షణమాత్రమున భక్తుల అభీష్ట ములను నెరవేర్చువాడు); పూర్ణాద్రి-పూర్ణశైలము-తిరుగిరి

సంగీత త్రిమూర్తులలో (Musical Trinity of India) రెండవవారైన శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారికి "తిరుత్తణి" పుష్కరిణిలో స్నానమాచరించి, తాను భార్యతో కొంగుముడి వేసుకొని కొండనెక్కు సమయమున శ్రీవారే తననోట కలకండ వేయగా [వృద్ధ బ్రాహ్మణరూప మున శ్రీవారువచ్చి వెంటనే మాయమైనారు] "గురుగుహముద్రాం కొర ము"తో విభక్తి కీర్తనములను సంస్కృత సాహిత్యములో వ్రాసినారు. అందులో షష్ఠివిభక్తి కీర్తన "మానస గురుగుహరూపంభజరే..." ఆనంద భైరవి-రూపకతాళం]

# శ్రీవల్లీ దేవసేనా సుబ్రహ్మణ్య స్తోత్రము

## శ్రీవల్లీ స్తోత్రము

**శ్యామామ్** పంకజధారిణీమ్ - మణిలసత్తాటంక కంకణోఽజ్జ్వలామ్ !
దక్షేఽ**లం**బకరామ్ కిరీటమకుటామ్ - తుంగస్తనోత్కంచుకామ్ !
**అన్యోన్యే**క్షణ సంయుతామ్ - శరవణోద్భూతస్య సవ్యేఽస్థితామ్ !
**గుంజామ్ మాల్య**ధరామ్ ప్రవాళ వదనామ్ వల్లీశ్వరీమ్ భావయే॥

[శ్రీవల్లి - వల్లి **అనగా** లత లేదా తీగ అని **అర్థ**మున్నది **మానసవల్లి** **అనగా 'మనసు' అ**నే 'తీగ' అని భావము స్కందమనగా చెట్టుయొక్క **కాండ**ము జ్ఞాన సారనిధియైన వాడే స్కందుడు కాండమును అల్లుకొన్న తీగవలె (మన) మనస్సు అనే తీగను స్కందుని అల్లుకొని అంటుకొని **వుంటే 'సుజ్ఞాన'** ము లభించి - ఇహపర సౌఖ్యములనిచ్చును ]

కావున "**శ్రీ**వల్లి" స్కందుని **అ**ల్లుకొనిన "ఇచ్ఛాశక్తి" గా భావన చేసి, **ఆ**మెకు సంబంధించి సంపుటీకరణ బీజాక్షర మంత్రమును **గురుముఖముగా ఉ**పదేశ**ము**ను పొంది, సాధన చేసి మంత్ర జపసిద్ధితో **తమ అ**భీష్ట**ము**ల**ను** పరిపూర్ణముగా భక్త సమాజము తరింతురు గాక !

శ్రీవల్లి సంపుటీకరణ బీజాక్షర మంత్రము

ఓం **శ్రీం** హ్రీం క్లీం ఐం సౌః వం వనవల్ల్యై నమః

[108/1008 సార్లు నిత్యమూ జపించి సిద్ధి పొందునంతవరకు సాధన చేయవలెను]

## శ్రీ దేవసేన స్తోత్రము

పీతాముత్పలధారిణీమ్ శచిసుతామ్-పీతాంబరాలం
కృతామ్-వామేఽలంబకరామ్।
**మ**హేంద్రతనయామ్ మందారమాలాధరీమ్-దేవైరర్చిత
పాదపద్మయుగళామ్-వామేఽస్థితామ్।
దేవసేనాభూషితాంఽగీమ్-త్రినయనీమ్ దేవీం త్రిభంగీమ్-భజే॥

[శ్రీ దేవసేన - దేవసేనా పతియైన సుబ్రహ్మణ్యుని ఎడమువైపున **అమరి**యున్న "క్రియాశక్తి" ఈమె మోక్షముకోరువారిని అనుగ్రహించు 'పరాశక్తి'యే]

## పుత్ర సంతానము కోరువారు భజించవలసిన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి స్తోత్రము [సంస్కృత గద్యము]

ఓం నమోభగవతే భవబంధహరణాయ సద్భక్త చరణాయ శరవణ భవాయ శాంభవిభవాయ యోగదాయకాయ భోగదాయకాయ మహాదేవ సేనా పరివృతాయ మహామణిగణాలంకృతాయ దుష్టదైత్య సంహారకారణాయ దుష్క్రౌంచ విదారణాయ శక్తిశూలగదా ఖడ్గఖేటకముసలపాశతో వరాభయకరాలంకృతాయ దుష్టదైత్య సంహారకారణాయ శరణాగత రక్షణ దీక్షా దురంధర చరణారవిందాయ సర్వలోకైక కర్త్రే సర్వలోకైక హర్త్రే సర్వ నిగమగుహ్యాయ కుక్కుటధ్వజాయ కుక్షిస్థాఖిల బ్రహ్మాండ మండలాయ ఆఖండలవందితాయ బుధేంద్రామ్ తరంగాభిసోమాయ సంపూర్ణకామాయ నిష్కామాయ నిరుపమాయ నిర్ద్వంద్వాయ నిత్యాయ సత్యాయ శుద్ధాయ అవ్యక్తాయ అసాధ్యాయ అద్యంతశూన్యాయ అప్రమేయాయ అవాఙ్మానస గోచరాయ పరమశాంతాయ పరిపూర్ణాయ పరాత్పరాయ ప్రణం వర్ధప్రచరాయ ప్రణవస్వరూపాయ స్వాశ్రిత జనరంజనాయ జయజయ రుద్రకుమార మహాబల పరాక్రమాయ త్రిశంత్‌కోటి దేవతానంద స్కందా నిరుపమానందా మమఋణ రోగశత్రు పీడాపరిహారం కురుకురు మాముద్ధర మద్దర సంస్కృతం కేశమాం ఆనందయ ఆనందయ నరకభయాన్ సంజీవయ సంజీవయ వరదోసిత్వం సదయోసిత్వం శక్తోసిత్వం భక్తిం భుక్తిం యుక్తిం ఇహాముర్త్రే దత్వాయేమామ్ శరణాగతయాం శతాయుషభవ దీనబంధోదయా సింధో కార్తికేయప్రభో శ్రీ సుబ్రహ్మణ్య స్వామిన్ నమస్తే నమస్తే నమః!

[దినమునకు 6 మార్లు కృత్తిక, విశాఖ, షష్ఠివ్రత దినాలలో ఏకభుక్తము, ఏకశయనము-శుద్ధుడై పఠించి శ్రీవల్లీ దేవసేనా సమేత షణ్ముఖుని ధ్యానించిన సర్వశుభములు కలుగును].



# అ భి షే క ము

| | | | |
|---|---|---|---|
| 1 | జలాభిషేకము | – | శాంతినిచ్చును |
| 2 | తైలాభిషేకము | – | పీడలు తొలుగును |
| 3 | ఎడనీరు (కొబ్బరినీళ్లు) | – | యోగమిచ్చును |
| 4 | నిమ్మరసము | – | భయము తొలుగును |
| 5 | మామిడి పండ్లు | – | జయము నిచ్చును |
| 6 | చెఱకు రసము | – | దృఢ శరీరము కలుగును |
| 7 | పాలాభిషేకము | – | దీర్ఘాయువు నిచ్చును |
| 8 | పెరుగుతోఅభిషేకము | – | సత్కీర్తిలభించును |
| 9 | నేతితొ అభిషేకము | – | భూమి, గృహలాభము |
| 10 | తేనెతో అభిషేకము | – | చక్కని గాత్రము |
| 11 | పంచామృతము | – | ఐశ్వర్యము |
| 12 | అభిషేకము పొడి | – | అప్పులు తీరును |
| 13 | చందనాభిషేకము (చందనాలంకారము) | – | పేరు ప్రతిష్ఠలు లభించును |
| 14 | పన్నీరు | – | విద్యాభివృద్ధి |
| 15 | విభూతి | – | ముల్లోకములకు శాంతి |
| 16 | స్వర్ణాభిషేకము | – | బ్రహ్మానందము |

పై కనిన వస్తువులతో శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని అభిషేకించుటచే పైచెప్పిన సత్ఫలిములన్ని తప్పక భక్తులకు లభించునని శాస్త్రప్రమాణము అలాగే, ధ్వజస్తంభమునకు ముందుగల బలిపీఠము వద్ద దేవతా సమూహము ఆ దేవాలయ మూలవిరాట్టుని స్మరించి వరములు పొందెదరు. కనుక మనము కూడా అక్కడ నిలబడి శిరోపరిభాగమున చేతులు జోడించి నమస్కరించుటచే దేవతలకిచ్చు వరములను బడయునగును.



"జ్యోతిష - కళా - వైద్య ప్రియసుదర్శన"




**డా॥ K.N. నటరాజన్,** B.Sc, B Ed, R.M.P.

తల్లి శ్రీమతి రుక్మిణమ్మ; తండ్రి: శ్రీ కరణం పెల్లాది నాగరత్నం పిళ్లై

జన్మస్థలం: పాకాల, చిత్తూరు జిల్లా, ఆం.ప్ర.

జనన తేది 24-9-1945

సతీమణి: **శ్రీమతి P. సుగుణ,** ఉపాధ్యాయిని

M.P.P. స్కూల్. C.U కండ్రిగ. తిరుపతి రూరల్.

చిరునామా: డా॥ K N నటరాజన్

18-2-258-A, మిద్దెపైన,

అశోకనగర్, తిరుపతి-517 501.


నా గురించి చెప్పుకోవడానికేమున్నది? అంతా 'ఈశ్వరేచ్ఛ'!
దైవభక్తి వంశానుగతంగా వచ్చింది పూర్వజన్మ సుకృతం వల్ల
మహనీయుల దివ్యాశీస్సులు లభించాయి. అందువల్లనే
గ్రంథరచనలు చేయగలిగాను!

సర్వేజనాస్సుఖినోభవన్తు

లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు

ఓం శాన్తిః! ఓంశాన్తిః! ఓంశాన్తిః!